*Tahreeke Islami Hind (Telugu)*

# ఇస్లామియ ఉద్యమం

మూలం:

**మౌలానా సద్రుద్దీన్ ఇస్లాహీ**

అనువాదం:

**ముహమ్మద్ నజీర్ అహ్మద్ ఖాన్ B.A,**

## విషయ సూచిక

# ముందు మాట

భారత ఇస్లామీయ ఉద్యమం ప్రసిద్ధి చెందిన పురాతన ఉద్యమం. ఈ ఉద్యమం గత 30 సంవత్సరాల నుంచి ధర్మసంస్థాపన కోసం కృషి చేస్తోంది. ఈ ఉద్యమం ఆగస్టు 31, 1941లో ఆరంభమైంది. ఈనాడు ఈ ఉద్యమ సందేశం ఇంచుమించు అన్ని ప్రాంతాలకు విస్తరించింది. సుదీర్ఘ కాలగమనంలో ఉద్యమం తన ముఖ్య విధానాలను, ఆశయాలను అన్ని కోణాల నుంచి నిరంతరం విశదీకరిస్తూ వస్తోంది. ఈ రెండు కారణాల దృష్ట్యా ఈ ఉద్యమం పట్ల తప్పకుండా అందరికీ అవగాహన కలగాల్సింది, విద్యావంతులకు అదో 'తెరిచిన గ్రంథం' కావాల్సింది. కాని వాస్తవ పరిస్థితి అలా లేదు. కొంతమేరకు అది తన ప్రత్యేక విశిష్టతల వల్ల – అధికంగా ఇతరుల అశ్రద్ధవల్ల, ఈనాటి వరకు చాలామంది కోసం అది "మూసిన గ్రంథం"లాగే వుంది. లేదా వారి ముందు దాని ప్రస్తావన వచ్చినప్పుడు, అసంపూర్ణంగా, వాస్తవాలకు భిన్నంగా ప్రస్తావన వస్తుంది. ఇలాంటి పరిస్థితిలో, ఉద్యమాన్ని అర్థం చేసుకునేందుకు అవసరమైన సమాచారమంతా, ఒకేచోట సునాయాసంగా లభించడానికి, దాన్ని వాస్తవ స్వరూపంలో పరిచయం చేయడానికి, ఉద్యమానికి చెందిన అన్ని విషయాలను, సమస్యలను, సవివరంగా విశదీకరిస్తూ సమగ్రమైన ఒక పుస్తకాన్ని ప్రచురించాల్సిన ఆవశ్యకత ఏర్పడింది. ఈ పుస్తకం ఈ ముఖ్య ఉద్దేశంతోనే రచించబడింది. దీని పఠనానంతరం ఉద్యమానికి చెందిన మౌలిక సమస్యలు తెలుస్తాయి.

ఇస్లామీయ ఉద్యమం గురించి ముఖ్యమైన పరిజ్ఞానాన్ని సవివరంగా పొందడానికి ప్రజలకు ఈ పుస్తకాన్ని అందించడం జరిగింది. ఇదే దీని అసలు

ఉద్దేశం. కాబట్టి స్వాభావికంగా, పాక్షికమైన, సాపేక్షికమైన విషయాల జోలికి పోకుండా కేవలం సూత్రప్రాయమైన విషయాలనే ప్రస్తావించడం జరిగింది. ఎందుకంటే పాక్షికమైన విషయాల జోలికి పోతే అనవసరంగా విషయాన్ని పొడిగించినట్లే అవుతుంది. విధానపరమైన ముఖ్య విషయాలను వివరంగా తెలుసుకున్న తర్వాత, పాక్షికమైన విషయాల గురించి ఇస్లామీయ ఉద్యమ దృక్పథం, ఆలోచనా విధానం దానంతట అదే తెలిసిపోతుంది.

'ఉద్యమ కార్యాచరణ'పై చర్చ అనేక కారణాలవల్ల ప్రత్యేకతను సంతరించుకుంది. దాన్ని నిర్ధారించడం ఒక క్లిష్ట సమస్యగా ఉండేది. ఈ రోజుల్లో "ఇఖామతే దీన్" (ధర్మసంస్థాపన) ధ్యేయం కేవలం ఒక పవిత్ర జ్ఞాపకార్థంగా మిగిలి ఉండగా, దాని కార్యాచరణపై సామాన్య ప్రజలు సరియైన అవగాహనకు ఎలా రాగలరు? కాబట్టి ఈ విషయంలో, గత చరిత్రలోకి వెళ్ళి ప్రవక్తలు ఆచరించిన విభిన్న కార్యాచరణ విధానాలను క్రోడీకరించి, వాటిని నేటి పరిస్థితుల్లో ఉద్యమం అనుసరించదగిన 'కార్యాచరణను' విశదపర్చడం జరిగింది. తద్వారా అది సరియైనదని, సమంజసమైనదని ప్రతి వ్యక్తికి నమ్మకం కల్గుతుంది.

**- సద్రుద్దీన్ ఇస్లాహి**
**ది. 19-01-1970.**

# భారత ఇస్లామీయ ఉద్యమం

## (జమాఅతె ఇస్లామీ హింద్)

### పూర్వరంగం

ఇస్లాం ధర్మాన్ని హెచ్చుతగ్గులు లేకుండా సంపూర్ణంగా స్థాపించడానికి, మనిషి అంతరంగాన్నే కాకుండా, బాహ్యజీవితాన్ని సహితం ఇస్లాం విధానాలకు అనుగుణంగా తీర్చిదిద్దడానికి, ఈ దేశంలో ఆవిర్భవించిన ఉద్యమమే "భారత ఇస్లామీయ ఉద్యమం". ఈ ఉద్యమ లక్ష్యం– అది సాధించ తలపెట్టిన కార్యాల దృష్ట్యా– ఆ పేరే దానికి సముచితమైనది, సమంజసమైనది. ఒకవేళ ఈ ఉద్యమ లక్ష్యం సంకుచితమై, దాని కార్యకలాపాలు 'ఇస్లాం ధర్మం'లోని కొన్ని నియమాలకు మాత్రమే పరిమితమై ఉంటే నిస్సందేహంగా దానికి ఆ పేరు పెట్టడం అతిశయోక్తిగా పరిగణించబడేది. అట్టి స్థితిలో దానికాపేరు ఒక అభూత కల్పనగా భావించినా తప్పు కానేరదు. వాస్తవానికి ఈ ఉద్యమం ఇస్లాం ధర్మంలోని కొన్ని సిద్ధాంతాలకే కాక – దాని సంపూర్ణ స్వరూపాన్ని ప్రజలకు పరిచయం చేసి, దాన్ని స్థాపించడమే ధ్యేయంగా పెట్టుకున్నందుకు, దానికి 'ఇస్లామీయ ఉద్యమం' అని పేరు పెట్టడం సముచితమే కాదు, తప్పనిసరి అయిపోయింది. అది కాకుండా మరే పేరు పెట్టినా దాని వాస్తవ స్వరూపాన్ని ఖచ్చితంగా ప్రతిబింబించేలా ఉండేదికాదు. అప్పుడు ఈ ఉద్యమానికి ఇస్లామీయ ఉద్యమం అని పేరెందుకు పెట్టలేదనే ప్రశ్న తలెత్తేది.

### వాస్తవ పూర్వరంగం:

అల్లాహ్ ముస్లిం సమాజాన్ని ఉనికిలోకి తెచ్చి ఇస్లాం ధర్మాన్ని పరిచయం చేయటానికి, వారికి అప్పగించిన బృహత్తర బాధ్యత వల్లనే ఈ ఉద్యమం

ఉనికిలోకి వచ్చింది. వాస్తవానికి దీని మూలాలు, మానవ జన్మ- అతని ధర్మంతో ముడిపడి ఉన్నాయి. అవి ఎంత పురాతనమైనవో, ఇదీ అంతే పురాతనమైనది. ఈ ఉద్యమానికి మూలమైన దివ్యఖుర్ఆన్, మానవాళి పుట్టుక- దాని పరమార్థం గురించి మౌలిక వాస్తవాలను తెలియపర్చింది. వాటిని ఈ దిగువ పేర్కొనటం జరిగింది: ఏకాగ్రతతో గమనించండి.

1) మానవుడు కేవలం తన సృష్టికర్త-ప్రభువు-పోషకుడు-పాలకుడిని మాత్రమే ఆరాధించాలి.

**"నేను జిన్నాతులనూ, మానవులనూ నా ఆరాధన కొరకు తప్ప మరి దేనికొరకూ సృష్టించలేదు."** ***(జారియాత్-56)***

2) ఆరాధనా విధానము, దాని అత్యుత్తమ పరిజ్ఞానం, స్వతహాగా తెలుసుకోవడం మనిషికి సాధ్యం కాదు. తెలుసుకోవలసిన క్లిష్టతరమైన బాధ్యత అతనిపై మోపబడలేదు. ఈ అవసరాన్ని తీర్చడం, కరుణామయుడైన ప్రభువుకే సాధ్యం. అందుకే ఇతర మానవీయ అవసరాలతోపాటు ఈ బృహత్తర అవసరాన్ని కూడా అతడే తీర్చాడు.

**"నిస్సందేహంగా మార్గాన్ని చూపెట్టవలసిన బాధ్యత మాపై ఉన్నది."** ***(అల్లైల్-12)***

మానవుని కోసం గాలి,నీరు,వెలుతురు, ఆహారము, వస్త్రముల లాంటి భౌతిక అవసరాలను సమకూర్చడంలో అలసత్వం వహించని సృష్టికర్త- అతని నైతిక, ఆధ్యాత్మిక అవసరాలను తీర్చడంలో అలసత్వం వహిస్తే అది అతని సమయస్ఫూర్తికి, కరుణ కటాక్షాలకు శోభాయమానంగా ఉండేదికాదు. కాబట్టి మొట్టమొదటి మానవునికి 'ఆరాధన' సరియైన పరిజ్ఞానాన్ని ప్రసాదించి ఈ ధరణిపై పంపడం జరిగింది.

**మేము ఇలా ఆదేశించాము:"మీరంతా ఇక్కడినుండి దిగిపోండి. ఆ తర్వాత నా వద్దనుండి ఏదయినా మార్గదర్శకత్వం మీకు అంది నప్పుడు, నా మార్గదర్శకత్వాన్ని అనుసరించే వారికి ఏ భయమూ కలగదు. వారు దుఃఖించే సందర్భమూ రాదు."** ***(అల్ బఖర: 38)***

ఈ పరిజ్ఞానాన్నే అల్లాహ్ ధర్మం అంటారు.

3) ఈ ధర్మం కేవలం ఆదిలో ఒకసారి మాత్రమే మానవునికి ప్రసాదించబడలేదు. అవసరాన్నిబట్టి అనేక పర్యాయాలు ప్రసాదించబడింది. వివిధ దేశాలలో, విభిన్న జాతుల మధ్య ప్రభవింపజేయబడింది.

**"హెచ్చరిక చేసే వాడెవ్వడూ రాని సముదాయం ఏదీ లేదు."**

***(ఫాతిర్-24)***

ఈ ధర్మాన్ని సంక్షిప్తంగా గాని, సవివరంగా గాని విశదీకరించే ప్రయత్నంలో పాక్షిక, సాపేక్షిక విషయాల అవగాహనలో అభిప్రాయ భేదాలున్నప్పటికీ, మౌలిక విషయాలలో మాత్రం భేదాభిప్రాయాలు లేవు.

**"ఆయన నూహ్ ప్రవక్తకు ఆజ్ఞాపించిన ధర్మాన్నే నీకు కూడా నిర్ణయించాడు. దానినే (ముహమ్మద్(స)) ఇప్పుడు నీవైపుకు మేము వహీ ద్వారా పంపాము; దానినే మేము ఇబ్రాహీమ్‌కు, మూసాకు, ఈసాకు బోధించాము; ఈ ధర్మాన్ని స్థాపించండి అని. దానిని గురించి విభేదాలకు లోనుకాకండి అని తాకీదు చేస్తూ."** ***(అష్ షూరా-13)***

4) ఈ పరిజ్ఞానము, ఈ ధర్మమే 'ఖుర్ఆన్' రూపంలో అవతరించగా, దానికి 'ఇస్లాం' అనే పేరును ఆమోదించడం జరిగింది."

"ఇస్లాంను మీ కొరకు మీ ధర్మంగా ఆమోదించాము." (అల్ మాఇద-3)

ఈ విధంగా తన నైజం, మౌలిక ఆదేశాల రీత్యా ఎల్లప్పుడు మానవుల కొరకు అవతరించిన ధర్మం 'ఇస్లాం' మాత్రమే అని తెలుస్తోంది. మరోవిధంగా చెప్పాలంటే, ఆది నుంచి అంతం వరకు సర్వలోక ప్రభువైన అల్లాహ్ తరఫునుండి వచ్చిన ధర్మాలన్నీ, వాటి పేర్లు వేరైనా, భాషలు వేరైనా, విభిన్న స్వరూపాలలో అవి ఉన్నప్పటికీ, తమ ఆధ్యాత్మికత, వాస్తవికత, విధి, విధానాల దృష్ట్యా వాస్తవంగా అవి 'ఇస్లాం' ధర్మాలే.

5) దివ్యఖుర్ఆన్, ఇస్లాం ఈ మార్గదర్శక క్రమంలో చిట్టచివరిది.

**"కాని ఆయన అల్లాహ్ యొక్క ప్రవక్త, దైవప్రవక్తల పరంపరను సమాప్తం చేసే చివరివారు."** ***(అల్ అహ్‌జాబ్-40)***

ఇక ఈ ధర్మం శాశ్వతమైనది. యావత్తు ప్రపంచం కొరకు ఉద్భవించింది. దీని తర్వాత మరో ధర్మం రాదు.

**"(ప్రవక్తా!) మేము నిన్ను సర్వమానవులకు శుభవార్తను ఇచ్చేవాడుగా, హెచ్చరిక చేసేవాడుగా నియమించి పంపాము."** *(సబా–28)*

అది ప్రభవింపజేయబడినప్పటి నుండి ఈ ప్రపంచపు చివరి ఘడియ వరకు సర్వమానవాళికి సన్మార్గాన్ని చూపించే ఏకైక ధర్మం ఇదే. ముక్తిని ప్రసాదించేదీ ఇదే.

**"ఈ విధేయతా (ఇస్లామ్) విధానాన్ని కాక మరో విధానాన్ని ఎవరైనా అవలంబించగోరితే అతని ఆ విధానం ఎంతమాత్రం ఆమోదించడం జరగదు. ఇంకా పరలోకంలో అతడు నిష్ఫలుడవుతాడు, నష్టపోతాడు."** *(ఆలి ఇమ్రాన్–85)*

6) ఏ 'ఆరాధన' కోసం మానవుడు సృష్టించబడ్డాడో దాని సరియైన క్రియాత్మక పద్ధతి ఏమిటంటే, దైవధర్మాన్ని విభజించకుండా, ఏ ఆదేశాన్ని విడనాడకుండా సంపూర్ణంగా ఆచరించడం. ఈ అర్థమే సరియైనది. ఎల్లప్పుడు ఆమోదించబడింది. జ్ఞానపరంగానూ సరితూగుతుంది. ఈ ధర్మం వచ్చినప్పుడల్లా ఆనాటి సామాజిక పరిస్థితులను బట్టి సంపూర్ణ జీవితానికి అవసరమైన విశిష్ట ఆదేశాలను తీసుకొనివచ్చింది. కాబట్టి జీవితపు అంతర్–బాహ్య విషయాలను, వ్యక్తిగత, సామాజిక రంగాలన్నింటినీ దాని ఆదేశాలకు అనుగుణంగా తీర్చి దిద్దుకోవాలి. ఈ సంపూర్ణ అనుసరణనే దివ్యఖుర్ఆన్ 'ధర్మసంస్థాపన'గా అభివర్ణించింది.

**"ఆయన నూహ్ ప్రవక్తకు ఆజ్ఞాపించిన ధర్మాన్నే నీకు కూడా నిర్ణయించాడు. దానినే (ముహమ్మద్(స)) ఇప్పుడు నీ వైపునకు వహీ ద్వారా పంపాము; దానినే మేము ఇబ్రాహీమ్‌కు, మూసాకు, ఈసాకు బోధించాము – ఈ ధర్మాన్ని స్థాపించండి అని. దానిని గురించి విభేదాలకు లోనుకాకండి అని తాకీదు చేస్తూ."**

*(అష్ షూరా–13)*

ఈ విశ్లేషణ వల్ల తెలిసిన వాస్తవమేమిటంటే- అల్లాహ్ ఏ యుగంలోనైనా ఏ మానవ సముదాయానికైనా తన ధర్మాన్ని ప్రసాదించినప్పుడు, ఆ ధర్మాన్ని సంపూర్ణంగా వారి జీవితాలలో స్థాపించాలని కోరుకున్నాడు. దానిపై స్థిరంగా ఉండాలని ఆదేశించాడు. మానవుడు ఖచ్చితంగా అలా చేస్తేనే అందరిలాగే తన జీవిత పరమార్ధమైన 'ఆరాధన' హక్కును నెరవేర్చినవాడౌతాడు.

7) చిట్టచివరగా వచ్చిన ఈ దైవధర్మం (ఖుర్ఆన్-ఇస్లాం) బృహత్తరమైన రెండు బాధ్యతలు తన అనుయాయులపై మోపింది. ఈ ధర్మాన్ని పూర్తిగా తమ జీవితాలలో స్థాపించి, స్థిరపరచడమే కాకుండా తోటి మానవుల వరకు దీన్ని చేరవేసి, దీని సత్యశీలత, ఆవశ్యకతను తెలియపర్చాలి. దీన్ని స్వీకరించడానికి వారిని సమాయత్తపర్చాలి. ఇలా యావత్తు ప్రపంచంలో దీన్ని స్థాపించడానికి నిర్విరామంగా కృషి చేయాలి.

> **"ఈ విధంగా మేము మిమ్మల్ని ఒక 'మధ్యస్థ సముదాయం'గా చేశాము, తద్వారా మీరు సకల మానవాళిపై సాక్షులు కాగలగాలని, దైవసందేశహరుడు (ముహమ్మద్-స) మీపై సాక్షి కాగలగాలని."**
>
> ***(అల్ బఖర-143)***

అంటే ఈ అనుయాయులపై గత ఉమ్మత్‌లకు ఉన్న ధర్మ ఆచరణా బాధ్యతే కాక- గత ప్రవక్తల వలే ప్రచార బాధ్యతలు కూడా ఉన్నాయన్నమాట!

ఈ రెండు బాధ్యతలను నెరవేర్చడం ఈ ఉమ్మత్ యొక్క ప్రధమ, అంతిమ లక్ష్యం. ఇదే దాని జీవితపు ఏకైక విధి. మానవుడు దేనికొరకు సృష్టించబడ్డాడో ఆ ఆరాధన ఇదే.

ఈ మౌలిక వాస్తవాలను దృష్టిలో ఉంచుకోండి-మానవులందరిలో దీని ఆచరణ, స్వీకరణ ఎంతవరకు ఉందో గమనిస్తే వాస్తవ పరిస్థితులు కడు విచిత్రంగా, విషాదకరంగా ఉన్నట్లు కనిపిస్తుంది. ఇతర మతస్తులు, సముదాయాల గురించి ఏమి చెప్పగలం? వాళ్ళకు ఈ సత్యాలు ఏమాత్రం తెలియవు. స్వయానా ధర్మ సంస్థాపనార్థం ఉనికిలోకి తేబడిన 'ఉమ్మతె ముస్లిమా'లో కూడా ఈ సత్యపరిజ్ఞానం, వ్యక్తిగతంగా దానిపై ఆచరణ, అడుగంటిపోవడం దిగ్భ్రమకు

గురి చేస్తుంది. అది తనను తాను విస్మరించినట్లనిపిస్తుంది. మానవాళికి సత్యధర్మాన్ని తెలియపర్చి వారి జీవితాలను పునీతం చేయవలసిన బాధ్యతను మరిచిపోవడమేగాక, స్వయాన వారి జీవితాలే అంధకారంలో మునిగి పోయాయి. ముఖ్యంగా దాని సామాజిక సమస్యలలో, ఈ సత్యధర్మ కాంతి చాలా అరుదుగా ప్రసరిస్తోంది. అందువల్లనే దానిని చూసిన వారెవరూ అది ఒక ప్రత్యేక ఆశయం కలిగినదని లేదా ప్రపంచంలో ఉన్న ఇతర జాతుల మాదిరిగా అదొక సామాన్యజాతి కాదు అని భావించరు. నిస్సందేహంగా ఈ పరిస్థితులన్నీ ఇస్లాం అనుయాయులు నేరస్తులని నిరూపిస్తున్నాయి. ఎలుగెత్తి ఇలా చెబుతున్నాయి:

ఇస్లాం, ఖుర్‌ఆన్‌ను ఆచరించే వాళ్ళమని సగర్వంగా చెప్పుకొనే ఓ ముస్లిం లారా! మిమ్మల్ని మీరు తెలుసుకోండి, దైవధర్మస్థాపన మీ బాధ్యత. దానిని నెరవేర్చటానికి తిరిగి అంకితమైపోండి. అదే ఈ లోకంలో మీ జీవిత లక్ష్యం. దానిని విడనాడడం వల్లనే తరతరాలుగా మీ అస్తిత్వం అర్థరహితమైపోయింది. ఈ పిలుపుకు, ఇతర దేశాల ముస్లింల వలెనే ఈ దేశ ముస్లింలలోనూ కొందరికి, దైవకృపతో హృదయ కవాటాలు తెరుచుకున్నాయి. వారిలో అనేక బలహీనతలు ఉన్నప్పటికీ వారు తమ కర్తవ్యాన్ని అంగీకరిస్తూ కార్యసాధనకు పూనుకొన్నారు. దానికోసం అవసరమైన, పటిష్ఠమైన ఒక ఉద్యమాన్ని ప్రారంభించారు.

## ఆత్యయిక ప్రేరణ

నిజానికి తమపై ఉన్న గురుతర బాధ్యతను నెరవేర్చాలన్న తపనే ఈ ఉద్యమ స్థాపనకు అసలు కారణం. దానికితోడు ఆనాటి సమస్యలు కూడా ఈ బాధ్యతను వెంటనే చేపట్టడానికి ప్రేరేపించాయి. ఈ ఉద్యమ వ్యాప్తికీ అవే దోహదపడ్డాయి. ఆ సమస్యలు ముఖ్యంగా మూడు :

(1) మిల్లత్ సమస్యలు (2) దేశ సమస్యలు (3) అంతర్జాతీయ సమస్యలు. ఇందులో మొదటి సమస్య ముఖ్యమైనది, ప్రభావవంతమైనది. మిగతావి ద్వితీయ శ్రేణికి చెందినవి.

## (1) మిల్లత్ సమస్యలు (ముస్లిం సముదాయిక సమస్యలు)

ఆనాటి మిల్లత్ సమస్యలను తెలుసుకోవాలంటే 1920–1945 నాటి భారతదేశ పరిస్థితులపై దృష్టి సారించాలి. దాని ప్రారంభ దశలో భారత స్వాతంత్ర్య ఉద్యమం తీవ్రతరమైంది. ఆంగ్లేయుల పెత్తనానికి వ్యతిరేకంగా తిరుగుబాటు మొదలైంది. స్వాతంత్ర్య సాధనయే దేశంలోని విభిన్నతెగల, జాతుల ఏకైక లక్ష్యంగా మారిపోయింది. ముస్లింలకైతే అదొక ధార్మిక ఆవశ్యకతగా ఇస్లామీయ బాధ్యతగా పరిగణించబడింది. సువిశాల భారతదేశం, సామ్రాజ్య వాదుల, ఇస్లాం విరోధుల నిరంకుశ దురాక్రమణకు గురికావడం వారి ఆత్మాభి మానానికి– దేశభక్తికి సవాలుగా పరిణమించింది. అంతేకాదు, ఆ ప్రభుత్వం ముస్లిం జీవిత విధానాలకు, దైవధర్మానికి ఉన్న సంబంధాన్ని త్రెంచివేసింది. అందువల్లనే ఈ దురాక్రమణల నుండి విముక్తి పొందడం మరొకరికంటే ముస్లింలకు అత్యంత ఆవశ్యకమైపోయింది. మొత్తానికి దేశ ప్రజలందరిలో ఎగిసిపడుతున్న ఉత్తేజం, ఉత్సాహాల వల్ల ఈ ఉద్యమం ముందుకు సాగుతూ పోయింది. స్వాతంత్ర్యం పొందడానికి అనువైన వాతావరణం ఏర్పడింది. స్వాతంత్ర్యపు శుభోదయం సమీపించినదని అందరికీ తెలిసిపోయింది. కాబట్టి స్వాతంత్ర్యానంతరం చేయతలపెట్టిన కార్యక్రమాలపై సమాలోచన మొదలైంది. ఇంతవరకు భారతీయుల శక్తియుక్తులన్నీ బ్రిటీష్ సామ్రాజ్యవాదాన్ని అంతమొం దించి స్వాతంత్ర్య సాధనపైనే కేంద్రీకరించబడ్డాయి. కానీ స్వాతంత్ర్యానంతరం, ఈ దేశ ప్రభుత్వమెలా ఉండాలి, దాన్ని ఏ పునాదులపై నెలకొల్పాలి అనే విషయంపై తర్జనభర్జనలు మొదలైనాయి. ఈ సువిశాల దేశంలో ఉన్న అసంఖ్యాక ప్రజానీకం, ప్రధానమైన ఈ సమస్యపై ఏకాభిప్రాయానికి రావడం వాస్తవంగా సాధ్యపడే విషయం కాదు. కాబట్టి వివిధ రాజకీయ పార్టీలు; ఆర్థిక వర్గాలు, సామాజిక సంస్థల నుండి ప్రభుత్వ విధి విధానమెలా ఉండాలన్న విషయంపై తమకు తోచిన విధానాలను, కార్యాచరణను వెల్లడించసాగాయి. వీటిలో రెండు విధానాలు ముస్లింల కొరకు ముఖ్యమైనవి. ఎందుకంటే ఆనాడు దేశ సమాజాలపై ఆ వర్గాల ప్రాబల్యం, ప్రభావం తిరుగులేనిది.

ఒక దృక్పథాన్ని 'ఇండియన్ నేషనల్ కాంగ్రెస్' ప్రతిపాదించింది. దాని ప్రకారం 'భారతదేశంలో కేవలం ఒకే జాతి నివసిస్తోంది. దాని సంస్కృతి ఒక్కటే. కాబట్టి ఇక్కడ ఒక లౌకిక ప్రజాతంత్ర ప్రభుత్వాన్ని ఏర్పరచాలి'.

రెండవ దృక్పథాన్ని 'ఆల్ ఇండియా ముస్లింలీగ్' ప్రతిపాదించింది. 'భారతదేశంలో ఒకటి కాదు, అనేక జాతులున్నాయి. వాటిలో ముస్లింలు ఒక జాతికి చెందినవారు. తరతరాల నుండి వస్తున్న ఒక ప్రత్యేక సంస్కృతి వారికుంది. కాబట్టి వారి రాజకీయ భవితవ్యం ముస్లిం జాతియత, వారి సభ్యతా సంస్కృతుల ఆధారంగా నిర్ణయించబడాలి' అని అది అభిప్రాయపడింది. 95% ముస్లింలు ఈ రెండు పార్టీలకు చెందినవారే. ఈ రెండు పార్టీలను బలపర్చడానికి, సేవ చేయడానికి ముస్లింలు సర్వదా సన్నద్ధమై ఉండేవారు. అంటే ఆనాడు రెండు కోవలకు చెందిన ముస్లింలు ఉండే వారన్నమాట- కాంగ్రెస్‌కు చెందిన ముస్లింలు లేదా ముస్లింలీగ్‌కు చెందిన ముస్లింలు. దీనివల్ల యావత్ భారతదేశ భవితవ్యమేగాక, ముస్లింల భవితవ్యం కూడా ఈ రెండింటిలో ఏదో ఒకపార్టీ సిద్ధాంతాలకు అనుగుణంగా జరగాలనే నిర్ధారణకు వచ్చినట్లయింది. ఈ రెండూ భారతీయ పార్టీలైనప్పటికీ, వాటిపై 'ఇస్లాం' ప్రభావం ఉన్నప్పటికీ-వాస్తవంగా అవి పాశ్చాత్యదేశాల ఆలోచనా ధోరణిని పుణికిపుచ్చుకున్న పార్టీలు. పాశ్చాత్య దేశాల భౌతిక వాదం, జాతీయ తత్వం, ఎన్నికల విధానం- ఈ రెండు పార్టీల ప్రధాన ఆశయంగా రూపొందాయి. మొదటి పార్టీ విధానాల వల్ల ఉత్పన్నమయ్యే పరిణామాలు ఇస్లాం-ఇస్లామీయ సంస్కృతికి అత్యంత ప్రమాదకరమైనవి. అలాగే రెండవ పార్టీ విధానాలు కూడా ఆమోదయోగ్యమైనవి కావు.

మొదటి దృక్పథం వల్ల దైవ ఆదేశాలను ఏమాత్రమూ పాటించని మత రహిత విధానాలపై దేశ నిర్మాణం జరుగుతుంది. కాబట్టి అట్టి ప్రభుత్వం ఏర్పడితే ధర్మానికి ప్రమాదం వాటిల్లుతుంది. అలాగే రెండవ పార్టీ విధానాలలో, ఇస్లాం ప్రస్తావన కూడా భక్తి పారవశ్యాలతో పునరుద్ఘాటించబడినప్పటికీ వాస్తవంగా ఇస్లాంకంటే ముస్లిం జాతీయవాదమే అందులో ప్రబలంగా

కనబడింది. ఆ పార్టీ రూపకల్పన, నాయకత్వం, ఆకాంక్షలు, విధివిధానాలన్నీ ఆ ఉద్దేశాన్నే చాటిచెప్పాయి.

ఈ దేశ దిశా నిర్దేశ సమయమది, ముఖ్యంగా భారత ముస్లింల సామాజిక జీవిత విధానాన్ని నిర్దేశించే చరిత్రాత్మక నిర్ణయం గైకొనే కీలక సందర్భమది. నిర్ణయం తీసుకొనే వారు కూడా స్వయాన ముస్లింలే! కాని ఆ నిర్ణయాన్ని తీసుకోవడంలో వారి తీరు ఎలాఉందో కాస్త గమనించండి. ఇస్లాం ధర్మాన్ని అవలంబించడమే తమ జీవిత ధ్యేయంగా భావించే ముస్లింలు – తమ వ్యక్తిగత సామాజిక జీవితాలను ఇస్లాం ఆదేశాలకు అనుగుణంగా మలుచుకొని, సర్వమానవాళికి ఆ సందేశాన్ని అందించి, సత్యధర్మ సాక్షులుగా నిలువవలసిన ముస్లింల ఆలోచనా ధోరణి ఎలావుందో చూడండి!

ఈ పరిస్థితులను క్షుణ్ణంగా పరిశీలించినట్లయితే, ఇస్లాం అనుయాయుల వ్యవహారశైలి వారి జీవితాశయంతో ఏమాత్రం పొసగకుండా పోయిందనీ, తమ భవిష్యత్ కార్యాచరణలో వారు తమ విశిష్ట స్థానాన్ని, జీవిత ఆశయాన్ని ఏమాత్రం పరిగణనలోకి తీసుకోలేదని తెలుస్తుంది. వాస్తవంగా ఆ క్లిష్ట పరిస్థితుల్లో ఏమాత్రం సంకోచించకుండా తమ అసలు జీవితాశయం వైపునకు మరలడం కన్నా వారికి మరో దారి లేదు. ఇంతకు క్రితం ఆంగ్లేయుల పాలనలో బానిసలై ఉండడం వల్ల ముస్లిం సమాజం తమనుతాము బలహీనులుగా భావించుకోవడం సమంజసమే. మా జీవిత విధివిధానాలు పరుల అధీనంలో ఉండగా, మేము మా విశ్వాసానికి అనుగుణంగా జీవితాలను ఎలా మలచుకోగలం? అనడానికి ఆస్కారముండేది. కాని ఇప్పుడా బలహీనత, నిస్సహాయత సమసిపోయే సమయం ఆసన్నమైంది. ముస్లింలకు ఒక నిరంకుశ ప్రభుత్వానికి భయపడే అవసరంలేదు. బానిసత్వం అతి త్వరలో అంతమైపోతుండగా, తమ జీవిత విధాన రూపకల్పన స్వయాన తమ హస్తాలలో చేసుకోవలసి ఉండగా ఏ పునాదులపై దానిని నిర్మించాలి? అన్నది చాలా ముఖ్యం. కాని ఆ కీలక సమయంలో కూడా వారికి జ్ఞానోదయం కలగకపోవడం, స్వాతంత్ర్య సమరపు

హోరులో మైమరిచిపోవడం దుఃఖకరమైన విషయమే కాదు, విశ్వాసపరంగా శోకసంతప్త ఘడియలు కూడా.

ఈ దుస్థితిని చూచి ఎన్నో హృదయాలు తల్లడిల్లాయి. వారిలో ఒక దైవభక్తుడు ముందుకు వచ్చి, ధర్మస్థాపనా బాధ్యతను నెరవేర్చడానికి ఒక పటిష్ఠమైన ఉద్యమాన్ని స్థాపించాడు. దానితో ఏకీభవించిన పుణ్యాత్ములు ఎందరో ఆ ఉద్యమంలో చేరిపోయారు. ఈ విధంగా ఆనాటి పరిస్థితులే దైవధర్మస్థాపన కోసం ఒక ఉద్యమాన్ని స్థాపించడానికి పురికొల్పాయి.

ఈ ఉద్యమ వ్యవస్థాపకులు, ఆనాటి పరిస్థితులను సమీక్షిస్తూ, ముస్లిం నాయకుల తప్పిదాలను ఎత్తిచూపి, వారి విధివిధానాలు వాస్తవంగా ఎలా ఉండాలో అనేక పర్యాయాలు విశదీకరించారు. ముస్లింలను జాగృతపర్చడానికి శాయశక్తులా ప్రయత్నించారు. ఉదాహరణకు వారి సందేశాన్ని చూడండి:

"ఒక ముస్లిం సమాజం కావడం వల్ల మన సంబంధం, దైవప్రవక్తలు నాయకత్వం వహించిన ఉద్యమంతో ఉంది. ఈ విషయాన్ని ముస్లింలందరూ తెలుసుకోవాలి. ప్రతి ఉద్యమానికి ఒక ప్రత్యేక ఆలోచనాసరళి, ఓ నిర్దిష్ట కార్యాచరణ ఉంటుంది. ఇస్లాం కార్యాచరణ- ఆలోచనా విధానం మనకు దైవప్రవక్తల జీవిత విధానంలో లభిస్తుంది. మనం ఏ దేశంలో ఉన్నా- ఏ కాలానికి చెందినవారమైనా- మనల్ని ఆవరించివున్న జీవిత సమస్యలు, విధానాలు, ఏ కోవకు చెందినవైనా దైవప్రవక్తల జీవిత ధ్యేయమే మన జీవిత ధ్యేయం. ఆ గమ్యాన్ని చేరడానికి దైవప్రవక్తలు ప్రతీయుగంలో ఆచరించిన మార్గమే మన మార్గం. "ఉలాయికల్లజీన హదల్లాహు ఫహుదాహు ముఖ్‌తదిహ్." మనం జీవిత వ్యవహారాలను ప్రవక్తలు చూసిన దృష్టికోణంతో చూడాలి. మన నైతిక ప్రమాణాలు వారు అవలంబించినవే కావాలి. మన సామాజిక విధానం వారు చూపిన విధంగానే ఉండాలి. ఈ విధానాన్ని విడనాడి మనం మరో విధానాన్ని ఆచరిస్తే మార్గభ్రష్టులమైపోతాము. ఒక జాత్యాభిమాని, దేశాభిమాని, ప్రజాతంత్ర అభిమాని, లేదా సామ్యవాద అభిమానికి ఉండే సంకుచిత భావంతో ప్రాపంచిక వ్యవహారాలను వీక్షించడం మన స్థాయికి ఏమాత్రం శోభించదు." (తర్జుమానుల్ ఖుర్‌ఆన్: సంపుటి 16- సంచిక 3-4)

ఆనాటి క్లిష్ట పరిస్థితుల్లో, ముస్లిం సమాజ చైతన్యరాహిత్యం దృష్ట్యా అచ్చమైన ఇస్లామీయ విధానాలకు అనుగుణంగా పనిచేసే ఒక ఉద్యమ ఆవశ్యకతను తెలియపరిచే మరో సందేశాన్ని చూడండి:

"భారత ముస్లింల భవితవ్యాన్ని నిర్ణయించే చివరి ఘడియలు సమీపించాయి. ఇక ఇప్పుడు గనుక ముస్లిం సమాజం ఏదన్నా తప్పుడు నిర్ణయం తీసుకుంటే వినాశపు అగాధంలో పడిపోతుందనే విషయాన్ని మనోనేత్రం స్పష్టంగా వీక్షిస్తోంది. ముస్లిం సమాజ భవితవ్యం ఎవరి శక్తియుక్తులపై ఆధారపడియుందో వారు కూడా పరిస్థితులను విచక్షణా జ్ఞానంతో, ఒక విశ్వాసికి ఉండవలసిన దూరదృష్టితో అర్థం చేసుకోలేదు.

ఈ పొరపాటు వల్లనే ముస్లింలు ముక్తిని ప్రసాదించని వివిధ వక్రమార్గాల వైపు నడపబడుతున్నారు. ఈ దుస్థితిని చూచి, ఇది మౌనంగా చూస్తూ కూర్చునే సమయం కాదనీ, సామాన్య ముస్లింలను, పామరులను, పండితులను అందరినీ, వారిపై పొంచివున్న ప్రమాదాలను తెలియపర్చుతూ, దైవగ్రంథం, ప్రవక్త జీవిత విధానం ద్వారానే మీరు సన్మార్గం పొందగలరని, వాటిని విస్మరించి కేవలం తమ శక్తియుక్తులపై ఆధారపడటం వినాశనానికి కారణమవుతుందని తెలియ పరిచి వారిని జాగృతి పర్చడమే ధర్మానికి ముస్లింలకు చేసుకునే సరియైన సేవ అని అంతరాత్మ ప్రబోధించింది. దాంతోపాటు మీ మార్గదర్శనానికి మూల సరోవరం దైవగ్రంథం, దైవప్రవక్త(స) సంప్రదాయమే. ఆ రెంటినీ విడిచిపెట్టి కేవలం తరుణోపాయంపై, వ్యూహరచనలపై ఆధారపడటం వినాశానికి ముందస్తు సంకేతమే అని కూడా మనస్సాక్షి హెచ్చరిస్తోంది."

**2) దేశ సమస్యలు:**

ఆనాటి దేశ సమస్యలు కూడా ఇంతకుముందు తెలిపినట్లుగా ఈ ఉద్యమ స్థాపనకు ప్రేరణ కల్పించాయి. భారతదేశ స్వాతంత్ర్య ఉద్యమం చివరి ఘట్టానికి చేరుకున్నప్పుడు స్వాభావికంగా ఈ దేశ విధివిధానాలు ఎలా ఉండాలన్న ప్రశ్న తలెత్తింది. ఆ ప్రశ్నకు సమాధానంగా, దేశ సర్వతోముఖాభివృద్ధికి, నిర్మాణానికి సరియైన సఫలమైన జీవిత విధానాన్ని అన్వేషించి, ప్రామాణికంగా దాని

విశిష్టతను ప్రజలకు తెలియపర్చి వారి విశ్వాసాన్ని చూరగొనవలసిన బాధ్యత దేశభక్తిగల మేధావులది, విజ్ఞానవంతులది. ఎందుకంటే ఇది దేశ ప్రజల సమస్య. స్వయానా వారి భావి సమస్య, భావితరాలకు ప్రభావితం చేసే సమస్య. కాబట్టి ఏ వ్యక్తి అయినా, సమూహమైనా, ఫలానా జీవిత విధానం దేశానికి శ్రేష్ఠతరమైనదని విశ్వసించి కూడా దాన్ని వ్యక్తపరచనివాడు వాస్తవానికి దేశానికే కాదు, తన కీడును కూడా కాంక్షించినవాడవుతాడు.

దేశానికి ఏ జీవిత విధానం అన్నింటికన్నా ఉత్తమమైనదిగా నిరూపితమవుతుందో దాని ప్రకారం దేశ నిర్మాణానికి పూనుకోవలసిన బాధ్యత దేశభక్తులది, శ్రేయోభిలాషులది. కాబట్టి ఈ కార్యసాధనకు, కర్తవ్యధీరులు, కార్యశూరులు ప్రపంచ నలుమూలల్లో ఉన్న ప్రభుత్వ విధానాలను అధ్యయనం చేశారు. వారి చూపులు పాశ్చాత్య ప్రపంచంలోని లౌకిక ప్రజాస్వామ్యంపైనా పడ్డాయి. రష్యాలోని కమ్యూనిజాన్ని కూడా నిశిత దృష్టితో పరిశీలించాయి. జర్మనీలోని నాజీజంను కూడా పరికించాయి. భారతదేశంలోని ప్రాచీన సాంస్కృతిక వ్యవస్థనూ అవలోకనం చేశాయి. ఆ చూపులు దారి తప్పి కుడి ఎడమల అపవాదాలకు లోనైనాయని మీరు అనగలరేమోగాని వారిని దేశద్రోహులని, శత్రువులని మాత్రం నిందించలేరు. ఆ బృహత్తర కార్యాన్ని నెరవేర్చడానికి వారు తమ ఆత్మప్రబోధంతో అకుంఠిత దీక్షతో ముందుకు వచ్చారు. వారు ప్రతిపాదించిన సిద్ధాంతాలు చిత్తశుద్ధి లేనివని, దేశ పునఃనిర్మాణానికి వారు తలపెట్టిన విధానాలు భవిష్యత్తులో దేశశ్రేయస్సును దృష్టిలో ఉంచుకొని చేసినవి కావని అనటం మాత్రం అన్యాయమే అవుతుంది.

ముస్లింలు కూడా ఈ దేశపు ముఖ్య సముదాయమే. కాబట్టి ఇతరులవలె వీరు కూడా ఈ ముఖ్య సమస్యపై సుదీర్ఘంగా ఆలోచించి, దేశ ప్రజలకు తమవద్ద ఉన్న మహోన్నత సాఫల్య జీవిత విధానాన్ని పరిపూర్ణ ఆత్మవిశ్వాసంతో పరిచయం చేసే బాధ్యత వారికుండింది. వారు తమ వాదనను సహేతుకమైనదిగా నిరూపించి, దానికనుగుణంగా ప్రజాభిప్రాయాన్ని మలిచి, ఈ దేశ భావి వ్యవస్థను నిర్మించటానికి తమ వంతు కృషి చేయాల్సిన ఆవశ్యకత ఎంతైనా

ఉండింది. వారు గనక అలా చేయకపోతే దేశానికి ద్రోహం చేసినట్లే భావించబడేది. వీరి హృదయాలలో దేశప్రేమకు చోటు లేదని నిరూపితమయ్యేది. ఏ జీవన వ్యవస్థను మానవాళి కొరకు కారుణ్యవ్యవస్థగా విశ్వసిస్తున్నారో దాని శుభాలను స్వయాన తమ దేశానికే అందకుండా చేశారనీ, మానవ మనుగడకు ముప్పుగా పరిణమించే వివిధ యిజాలకు దేశం ఆలవాలమవుతుంటే, మౌనంగా ప్రేక్షకపాత్ర వహించి చూస్తుండిపోయారనే నేరారోపణకు వారు గురికావలసి వచ్చేది.

విచారించతగిన విషయం ఏమిటంటే, ముస్లింలలో అత్యధికులు పరిస్థితుల ప్రభావం వల్లనో, ఇతరత్రా కారణాల వల్లనో నిజమైన దేశప్రేమికులుగా వారు ఈ విద్యుక్తధర్మాన్ని నెరవేర్చలేదు. కాని ఈ విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చే మహానుభావులు పూర్తిగా తుడిచి పెట్టుకుపోలేదు. ఒక చిన్న ముస్లిం సమూహం ఈ బృహత్తర కార్యాన్ని నెరవేర్చడానికి బాధ్యతా భావనతో ముందుకు వచ్చింది. పరిస్థితులు ప్రతికూలంగా ఉన్నప్పటికీ దేశ వాస్తవ ప్రగతి ఇస్లాం జీవిత విధానాన్ని స్థాపించడంలో ఉంది అని ధైర్యంగా ఎలుగెత్తి ప్రకటించింది. ఈ విధంగా దేశం పట్ల ప్రేమాభిమానాలు దాని పునఃనిర్మాణానికి ఎగిసిపడిన ఉత్సాహం కూడా 'ఇస్లామీయ ఉద్యమానికి' మరో కారణమైంది. అందుకే ఉద్యమ ఆరంభ దశలోనే ఈ వాస్తవాన్ని ఇలా వివరించడమైనది:

"వాస్తవంగా ఏ వ్యక్తి అయినా, వర్గమైనా, ఒక సిద్ధాంతాన్ని పరిశీలించి విశ్లేషించి అందులో మానవాళి సాఫల్యం ఉందనీ, మానవీయ సంబంధాలు వ్యవహారాలు చక్కబరిచే విధి విధానాలు దానిలో విశిష్టంగా ఉన్నాయని నమ్మినప్పుడు, తాను జీవిస్తున్న సమాజాన్ని, తన జీవన్మరణాలు ఆధారపడియున్న వ్యవస్థని, సామాజిక-రాజకీయ, ఆర్థిక సంబంధాలున్న జనసమూహాల జీవిత విధానాన్ని ఆ సిద్ధాంతానికి అనువుగా ప్రథమంగా తీర్చిదిద్దాలని సహజంగానే కోరుకుంటాడు. తాను నమ్మిన ఆ సిద్ధాంతం సరియైనదని, శ్రేయస్కరమైనదని ఎంత ప్రగాఢ విశ్వాసముంటుందో, మానవాళిపట్ల , దేశం పట్ల ఎంత అధికంగా ప్రేమాభిమానాలుంటాయో అంతే అధికంగా దాని ఉత్తమ ప్రతిఫలాలను

మానవాళికి దేశప్రజలకు అందించాలని తహతహలాడుతాడు. అలాగే అవి తప్పుడు భావనలని, కీడు కల్గించే సిద్ధాంతాలని ఎంత ప్రగాఢంగా నమ్మితాడో అంతే తీవ్రంగా ఆ సిద్ధాంతాల ఆధిపత్యాన్ని అడ్డుకుంటాడు. ఇది మానవ నైజం. ఇది దేశభక్తికి విరుద్ధం కాదు. దేశభక్తికి విరుద్ధమేమిటంటే, మనిషి ఏ విధానాన్ని శ్రేయస్కరమైనదిగా భావిస్తాడో దాన్ని తన హృదయంలోనే లేదా ఇంటిలోనే దాచుకొని- ఏ విధానాలను వాస్తవంగా నష్టదాయకమైనవిగా గుర్తిస్తాడో అవి తమ దేశస్తులపై రుద్దబడుతుంటే వేడుక చూస్తూ ఊరుకోవడం."

పాశ్చాత్య దేశాల ప్రజాస్వామిక వ్యవస్థను అధ్యయనం చేసి అది సరియైనదిగా నమ్మినవారు భారత దేశ సామాజిక విధానాన్ని దాని ప్రకారమే రూపొందించాలని ప్రయత్నిస్తున్నారు. సోషలిజాన్ని అధ్యయనం చేసి దానిని సరియైనదిగా నమ్మినవారు భారతదేశ పునర్నిర్మాణం (Social Reconstruction)మార్క్స్ కమ్యూనిజం ప్రకారం జరగాలని ప్రయత్నిస్తున్నారు. ఎందుకిలా? వారు నమ్మిన సిద్ధాంతాన్ని వారు ప్రవేశపెడుతున్నారంటే మనం కాదనగలమా? దీనిని ఎవరైనా దేశభక్తికి, ప్రజాభిప్రాయానికి విరుద్ధమని చెప్పగలరా? వారు నమ్మిన సిద్ధాంతం తన తోటి సోదరులకు శుభాలు ప్రసాదిస్తుందని, సఫలత చేకూరుస్తుందని విశ్వసించినప్పుడు దాన్ని స్థాపించడానికి ప్రయత్నించకపోవడం సమంజసమేనా? దేశ ప్రజలను దారిద్ర్యానికి, దౌర్భాగ్యానికి గురిచేసే సిద్ధాంతాలను స్వీకరించడం భావ్యమేనా? ఖచ్చితంగా ఇదే పరిస్థితి మనది. ఇతరులు ప్రజాస్వామ్యం, కమ్యూనిజం అని నినాదాలు చేయడానికి ఏ కారణాలు వారిని ప్రేరేపిస్తున్నాయో ఆ కారణాలే మనల్ని 'దారుల్ ఇస్లాం' (ఇస్లాం విధానం) అని నినాదం చేయడానికి ప్రేరేపిస్తున్నాయి.

మా అధ్యయనం, అన్వేషణ, విశ్లేషణ ప్రకారం 'ఇస్లాం' జీవిత విధానం లోనే మానవులకు నిజమైన శ్రేయోసాఫల్యాలు ఉన్నాయని మేము ప్రగాఢంగా విశ్వసిస్తున్నాము. ఇతర సిద్ధాంతాలు అసంపూర్ణమైనవి, అసమంజసమైనవి. వాటిలో మనిషి వ్యక్తిత్వ వికాసానికి సరియైన అవకాశాలు లేవని నమ్ముతున్నాం. ఈ విశ్వాసం, నమ్మకం కలిగిన తర్వాత మనం అనుసరించవలసిన సరియైన

విధి, విధానాలేమిటి? మన తోటి ప్రజాస్వామ్యవాదుల, సమ సమాజ స్థాపకుల విధానమే కదా మనం అనుసరించవలసింది. ఏ సామాజిక విధానాన్ని మనం దృఢ విశ్వాసంతో మానవాళి కొరకు శ్రేయస్కరమని భావిస్తున్నామో దానికి అనుగుణంగా మన దేశాన్ని, మన ప్రజల సామాజిక జీవితాన్ని మలచవలసిన బాధ్యత మనపై లేదా? ప్రజాస్వామ్యవాదులు, కమ్యూనిస్టులకు వారు నమ్మిన సిద్ధాంతాలను ప్రతిపాదించే హక్కు ఉన్నప్పుడు మనం నమ్మిన సిద్ధాంతాన్ని ప్రతిపాదించే హక్కు మనకు ఎందుకు లేదు? (ముస్లింలు - ప్రస్తుత రాజకీయ సంఘర్షణ మూడవ భాగం: పేజీలు 13-15)

### 3) అంతర్జాతీయ సమస్యలు

ఆనాటి అంతర్జాతీయ పరిణామాలు కూడా ఈ ఉద్యమ స్థాపనకు కారణమైనాయి. అంతర్జాతీయంగా నైతిక విలువల పతనం పరాకాష్ఠకు చేరుకుంది. మానవ జీవితరంగాలన్నింటిలో అరాచకం ప్రబలడం ప్రతీ వ్యక్తి విప్పారిన నేత్రాలతో చూస్తున్నాడు. ఉన్నతమైన నైతిక విలువలు మంటగలుస్తున్నాయి. ఎటుచూసినా భౌతికవాదం, స్వార్థపరత్వం, మనోకాంక్షలు, సామాజిక అసమానతలు, రాజకీయ రాక్షసత్వం దావానలంలా ప్రబలిపోతున్నాయి. భౌతికంగా ఎదిగి మానవుడు నింగిలోని చుక్కలను అందుకున్నా- నైతికంగా అధోపాతాళానికి దిగజారిపోతున్నాడు. అతని వద్ద ధన రాసులున్నా మానవత్వం మంట గలసిపోయింది. వైజ్ఞానికంగా ప్రగతి సాధించి నలుదిశలా వెలుగులు విరజిమ్మినా అతని అంతరాత్మపై మౌఢ్యపు చీకటి తెరలు మరింతగా కమ్ముకోసాగాయి. తన అనుభవాలపై వైజ్ఞానిక అన్వేషణలపై ఆధారపడి సుఖప్రసాదితమైన జీవిత విధానాలను రూపొందిస్తున్నాడు. కాని సామాజిక వ్యవస్థ మాత్రం రోజురోజుకు పెరిగిపోతున్న సమస్యలతో సతమతమవుతుంది. అంతర్జాతీయ సంబంధాల విషయానికొస్తే పరస్పర సహకారం, సహృద్భావ వాతావరణం నెలకొల్పడానికి మనోహర మూలసూత్రాలు రూపొందించబడుతున్నాయి. కాని వాటివల్ల జాతుల మధ్య అపనమ్మకం, అభద్రతాభావం, భయభ్రాంతులు పెరిగిపోతున్నాయే తప్ప తగ్గడంలేదు. తరతరాలుగా మానవాళిపై ఆధిపత్యం

చలాయిస్తున్న ఈ వికృత విష సంస్కృతి ఫలితంగానే తుదకు మానవాళి వినాశకర అంచులకు చేరుకుందని పరిస్థితులే సాక్ష్యమిస్తున్నాయి. ఇక ఈ విష సంస్కృతి మనుగడ పరిసమాప్తమైనదని దాని దౌర్జన్యానికి గురియై రక్తసిక్తమైన మానవాళికి కొరకు మరో మార్గం సుగమం కానున్నదని దీనివల్ల విదితమైపోయింది. ఆ మార్గమెలాంటిది? తొలగిపోతున్న ఈ విషసంస్కృతి స్థానాన్ని ఆక్రమించే మరో సంస్కృతి ఏది? ఈ ప్రశ్నకు సమాధానం భవిష్యత్తులో ఏమి లభిస్తుందో తెలియదు. కాని అందరికంటే ముందు దానికి సమాధానం చెప్పవలసిన బాధ్యత నిస్సందేహంగా ఉమ్మతే ముస్లిమ (ముస్లిం సమాజం)పై ఉంది.

ఎందుకంటే విశ్వాస పరంగానూ, చారిత్రక సాక్ష్యాధారాల దృష్ట్యా కూడా వారే ప్రపంచంలో అందరికంటే శ్రేష్ఠమైన, సఫలమైన సంస్కృతికి వారసులు-బాధ్యులు. ఈ సంస్కృతి యుగాల తరబడి మానవాళికి సన్మార్గం చూపడంలో సఫలీకృతమైంది. ఆ ఉన్నతమైన మార్గదర్శక స్థానం నుండి అది కనుమరుగైపోయిందంటే, అది నిర్జీవమైపోయిందని, మార్గదర్శకత్వ స్థాయిని అది కోల్పోయిందని అర్థం ఎంతమాత్రం కాదు. అది ఎందుకు కనుమరుగైనదంటే, ప్రపంచ ప్రజలు దాన్ని ఆచరించే ధైర్యాన్ని కోల్పోయారు. నిజానికి దాని సహజ సిద్ధాంతాలు, తిరుగులేని ఆధ్యాత్మికత, న్యాయబద్ధత, చారిత్రక వైభవం వల్ల ఏ కాలపు సామాజిక అవసరాలైనా, సమస్యలైనా తీర్చుడానికి మునుపటి లాగానే శక్తివంతమైనదిగా రుజువుకాగలదు. ఇస్లామీయ సమాజానికి తన అస్తిత్వం, ఔన్నత్యం గురించి ఏ మాత్రమైనా అవగాహన ఉన్నా ఆ సంస్కృతి యొక్క సత్యశీలత, తరగని విశిష్టతను తప్పక గుర్తించగలిగేది. తత్ఫలితంగా విభిన్న సంస్కృతుల మధ్య జరుగుతున్న ఈ ఆధిపత్యపోరులో ముస్లిం సమాజం కూడా తన కర్తవ్యాన్ని నెరవేర్చి, తనతోపాటు, తోటివారి జీవిత విధానాన్ని ఇస్లామీయ సంస్కృతికి అనుగుణంగా తీర్చిదిద్దడానికి తప్పకుండా ప్రయత్నించేది. ప్రపంచ ప్రజలు ప్రస్తుతంవున్న విష సంస్కృతి నుండి విముక్తి పొంది, తమ ఆవేదనను

తీర్చే సంస్కృతి కోసం వేచిచూస్తున్న ఈ తరుణంలో కూడా ముస్లిం సమాజం నిర్లిప్తంగా ఉండిపోతే తమ సమాజం, సంస్కృతి పనికిమాలినవని ప్రకటించినట్లే అవుతుంది. ప్రస్తుతమున్న సంస్కృతి కొన ఊపిరి ఘడియలు లెక్కపెడుతూ ఉండటం పరోక్షంగా, ఇస్లామీయ సంస్కృతి పునరుజ్జీవనానికి సంకేతమే.

ఇటువంటి సమయంలో కూడా ముస్లిం సమాజంలో స్పందన లేకపోవడం ఏమాత్రమూ సమంజసం కాదు. ఇంతవరకు ఏమరుపాటువల్లనో, పిరికితనం వల్లనో ఇస్లామీయ సంస్కృతి గురించి మాట్లాడకుండా సహనం వహించి ఉంటే అది ఇప్పుడు ఆరాటంగా, ఆత్రుతగా మారిపోవాలి. సంతోషించవలసిన విషయమేమిటంటే ఆ సమయంలోని పిలుపు వృధా కాలేదు. అది ఉమ్మత్‌లోని కొందరు మహాత్ముల హృదయాలలో కర్తవ్యాన్ని మేల్కొల్పింది. ఈ కర్తవ్యదీక్ష మేలుకోవడం కూడా ఇస్లామీయ ఉద్యమ స్థాపనకు మరో కారణమైంది. ఉద్యమ వ్యవస్థాపకులు ఈ విషయాన్ని ఆరంభ దశలోనే ఇలా విశదీకరించారు:

"ఒక యుగం పరిసమాప్తమై మరోయుగం ఆరంభం కానున్నదనీ, పాశ్చాత్య సంస్కృతి మరియు దాని సిద్ధాంతాల ప్రకారం పనిచేసేవారికి దైవ ప్రణాళికననుసరించి లభ్యమైన సమయం ఇక పరిసమాప్తమైనదని లేదా సమీపించిందని నేను భావిస్తున్నాను. ఇప్పుడా సంస్కృతి అతలాకుతలమవుతూ వుంది. మరో నవీన సంస్కృతి ఆవిర్భావానికి ముందు తప్పకుండా అనిశ్చిత పరిస్థితులు ఏర్పడుతాయి. అవి ఇప్పటికే మొదలైనాయి. ధర్మ సంస్థాపనకు ఎల్లప్పుడూ కృషి చేయవలసిన బాధ్యత విశ్వాసులపై ఉంది. కాని ప్రత్యేకంగా సర్వమానవులు ప్రస్తుతం వున్న జీవిత విధానాల వల్ల ఎదురవుతున్న విషమ పరిస్థితులతో విసిగిపోతున్నప్పుడు, మరో కొత్త జీవిత విధానం కొరకు పరిస్థితులు అనుకూలంగా ఉన్నప్పుడు, సత్యధర్మ స్థాపనకై కృషి చేయవలసిన ఆవశ్యకత మరెంతో పెరిగిపోయింది. ఈనాడు ఏర్పడిన అవకాశాలను సద్వినియోగం చేసుకోకుంటే దైవసన్నిధిలో మనం నిలదీయబడతాం.

**తరహా :**

ఈ ఉద్యమ గత చరిత్రను, దాని స్థాపనకు దారితీసిన కారణాలను గమనించినట్లయితే, అది ఆ తరహాలో ఉన్న ఏకైక ఉద్యమమనీ, సమకాలీన ఉద్యమాలతో దాన్ని పోల్చజాలమని విశదమవుతుంది. ఈ ఉద్యమం దేశ స్వాతంత్ర్యం, మిల్లత్ సంక్షేమం కోసం ఏర్పడిన ఉద్యమాలు ఊపందుకున్న సమయంలో ప్రారంభించబడిందనేది వాస్తవమే. కాని పరిస్థితుల ప్రభావం వల్ల ఆనాటి పరిమిత ఆశయాలతో ఉనికిలోకి వచ్చిన ఉద్యమాల వంటిది ఈ ఉద్యమం అని భావించడం ఎంతమాత్రం సరియైనది కాదు. నిస్సందేహంగా ఆనాటి పరిస్థితులు కూడా ఈ ఉద్యమ స్థాపనకు అనుకూలించాయి. వాటిని కాదనలేము. పరిస్థితుల ప్రభావం కేవలం ఆలోచించడానికి ప్రేరేపించాయి. జాగృతపర్చాయి. వాస్తవానికి ఈ ఉద్యమం ఆనాటి పరిస్థితులకన్నా ఇస్లాం అనుయాయుల జీవితాశయంతో అది ముడిపడి ఉంది. వాస్తవానికి ఈ ఉద్యమం ముస్లిం సమాజంపై శాశ్వతంగా ఉన్న బాధ్యతలను నెరవేర్చడానికి ఏర్పడింది. స్పష్టంగా చెప్పాలంటే ఈ శతాబ్ది ప్రథమార్థంలో ఉద్యమానికి అనువైన పరిస్థితులు ఏర్పడకపోయినప్పటికీ అది ఏర్పడేదే. తప్పకుండా ఏర్పడవలసిన ఆవశ్యకత కూడా ఉండింది. ఎందుకంటే అది ఒక సమయానికి, ఒక ప్రాంతానికి మాత్రమే పరిమితంకాని శాశ్వత బాధ్యత. ముస్లింలు ఎక్కడైనా, ఏ కాలంలోనైనా, ఎలాంటి పరిస్థితుల్లోనైనా అచటి మానవ జీవితాన్ని ఇతర జీవిత విధానాల, సిద్ధాంతాల, ఆశయాల నుండి మళ్ళించి, స్వచ్ఛమైన ఇస్లామీ జీవన ప్రాతిపదికపై నిర్మించటానికి శక్తియుక్తులతో ప్రయత్నించాలి. లేకపోతే వారి అస్థిత్వమే అర్థరహితమైపోతుంది. వారు బాధ్యతా రహితులుగా, క్రియాశూన్యులుగా పరిగణించబడతారు. తత్ఫలితంగా ఇహపరలోకాలలో నష్టాలను చవిచూస్తారు. అంతేకాదు, ఇతరులను వాస్తవ సఫలత, పరలోక విముక్తి పొందకుండా చేసినందుకు నేరస్తులుగా కూడా పరిగణించబడతారు. కాబట్టి ఈ ఉద్యమం దేశానికి, ముస్లిం సమాజానికి చెందిన ఉద్యమాలన్నింటిలో, సిద్ధాంతాలు లక్ష్యాల మూలంగానేగాక, తన వాస్తవిక నైజం దృష్ట్యా కూడా భిన్నమయినది. "అస్‌లుహా సాబితుఁవ్ వ ఫర్‌ఉహ ఫిస్సమాఇ."

కాని ఈ విశ్లేషణల వల్ల ఈ ఇస్లామీయ ఉద్యమానికి దేశ స్వాతంత్ర్యం పట్ల, ముస్లిం సముదాయ పరిరక్షణ పట్ల ఎలాంటి ఆసక్తిలేదని, ఇతర ఉద్యమాలు మాత్రమే దానికై కృషి చేస్తున్నాయని భావిస్తే అది అవివేకమే అవుతుంది. తుచ్ఛమయిన, భ్రష్టుపట్టిన జీవిత విధానాల నుండి దేశాన్ని సంరక్షించి దైవ ఆదేశాల ప్రకారం ధర్మబద్ధమయిన సంపూర్ణ జీవిత విధానాన్ని స్థాపించాలన్న మహోన్నత ఆశయం గల ఉద్యమం ఇది. ఈ 'స్వాతంత్ర్యం' ఈ 'పరిరక్షణ' దాని లక్ష్యసాధనలో అంతర్లీనమై ఉన్న అంశాలే. కాని దాని దృష్టిలో ఈ స్వాతంత్ర్యం ఇతరులు ఊహించే స్వాతంత్ర్యం కాదు. ఈ పరిరక్షణ ఇతరులు భావించిన పరిరక్షణ కాదు. ఈ విషయంలో ఇతరుల ఆలోచనా ధోరణికి ఈ ఉద్యమ ఆలోచనా ధోరణికి భూమ్యాకాశాల మధ్య ఉన్నంత వ్యత్యాసం ఉంది. అందువల్లనే ఈ లక్ష్యసాధనకు ఇతరులు అనుసరించిన విధానాలను ఈ ఉద్యమం అనుసరించలేదు. ఇతర ఉద్యమాల స్వాతంత్ర్య సాధన లక్ష్యమేమిటంటే; ఈ దేశంపై విదేశీయుల పాలన అధికారాన్ని అంతం చేయడం. స్వదేశీయులు తమ అధికారాన్ని ఆధిపత్యాన్ని స్థాపించటం. కాని ఇస్లామీయ ఉద్యమ స్వాతంత్ర్య లక్ష్యమేమిటంటే; మానవులపై మానవుల పాలనా అధికారాలన్ని అంతమొందించి సర్వ శక్తి సంపన్నుడయిన "అల్లాహ్ అధికారాన్ని, ఆధిపత్యాన్ని స్థాపించడం." వాస్తవానికి అతను తప్ప అధికారాన్ని చలాయించేవాడు ఎవడూ లేడు. అతని ఆజ్ఞలను శిరసావహించడం మహా భాగ్యం. అదే సరియైన స్వాతంత్ర్యం. ఈ ఉద్యమ లక్ష్యం కేవలం ఆంగ్లేయుల అధికారాన్ని అంతమొందించడమేకాదు, మానవుల అధికారాన్నింటిని అంత మొందించడం. దాని దృష్టిలో బ్రిటీష్ పాలన సామ్రాజ్యవాదమయినప్పుడు భారతీయులు స్థాపించుకోబోయేది కూడా స్వరాజ్యం కాదు. అది ప్రజల అధికారాన్ని ప్రజల పాలనను, అది ఎవరిదైనా సరే, బానిసత్వంగానే పరిగణి స్తుంది. మానవుల అధికారము ఆధిపత్యముల బంధనాల నుండి విముక్తి పొంది దైవదాసులు తమ నిజ ప్రభువుకు విధేయులై సఫలత చేకూర్చే దైవాదేశాలకు అనుగుణంగా, యావజ్జీవితాన్ని గడిపే స్వేచ్ఛ లభించడమే నిజమయిన

స్వాతంత్ర్యం అని అది భావిస్తుంది. ఇదేవిధంగా తన జీవిత విధానాన్ని రూపొందించడంలో, పూర్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కలిగి ఉండాలని, మరో శక్తి దానికి అవరోధం కాకూడదని భావించారు. కాని ఇస్లామీయ ఉద్యమం దృష్టిలో ముస్లిం సమాజ పరిరక్షణ అంటే తన భవిష్యత్ నిర్మాణానికి, తన జీవిత విధానాన్ని రూపొందించడంలో, ఒకింత స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు కలిగి ఉండాలి కాని పూర్తిగా ఉండకూడదు. ఈ విషయంలో ఏ అవరోధమూ ఉండకూడదు. స్వయాన వారు కూడా అడ్డు కాకూడదు. అంటే వారి ఆకాంక్షలుగానీ, స్వంత అభిప్రాయాలు గానీ భౌతిక ప్రయోజనాలుగానీ, జాతీయ భావాలుగానీ అడ్డంకిగా ఉండకూడదు. రెండు ముక్కల్లో చెప్పాలంటే వారు కాదు, కేవలం ఇస్లాం ఉండాలి. దాని అభ్యున్నతిపై దృష్టిని కేంద్రీకరించాలి. దానిని తనదేకాక సర్వమానవాళి జీవిత విధానంగా తీర్చిదిద్దడానికి శత విధాలా ప్రయత్నించాలి. ఎందుకంటే ముస్లిం సమాజ పరిరక్షణ వాస్తవంగా ఇస్లాం సమాజ పరిరక్షణపైనే ఆధారపడి ఉంది. ముస్లిం సమాజానికి ఇస్లాం ద్వారా లభించని పరిరక్షణ వాస్తవంగా పరిరక్షణే కాదు. ఇస్లామీయ ఉద్యమం ప్రారంభమయినప్పటి ప్రత్యేక పరిస్థితులివే. దానిని గురించి పూర్తిగా అధ్యయనం చేయడానికి ముందు మౌలికమయిన ఈ విషయాలను బాగా అర్థం చేసుకోవాలి.



# ధ్యేయం

## నిబంధనావళి వెలుగులో

ఇస్లామీయ ఉద్యమ ఆశయం, –ధ్యేయం "ధర్మసంస్థాపన." అంటే తన జీవన సరళి, తన నియమ నిబంధనలు, ఆశయాలు సమగ్రమయిన చట్టాలు అన్నీ సర్వలోక సృష్టికర్త అయిన అల్లాహ్ ఆదేశాల ఉపదేశాల ప్రకారం రూపొందిన ఒక సార్వజనీనమైన సంపూర్ణ జీవిత విధానం. దాని నిబంధనావళిలో ఈ ధ్యేయాన్ని ఇలా వివరించడమైనది :

"జమాఅతె ఇస్లామీ ధ్యేయం "ధర్మసంస్థాపన" (ఇఖామతె దీన్). దీనికి అసలు ప్రేరణ కేవలం దైవప్రసన్నత బడయటం, పరలోక సాఫల్యం పొందటం మాత్రమే." (4వ అధికరణ)

మానవ శరీరంలో గుండెకు ఉన్న ప్రాముఖ్యత ఒక ఉద్యమంలో దాని ధ్యేయానికి ఉంటుంది. అదే దాని సిద్ధాంతాలకు, దాని విధి విధానాలకు ఆలోచనాసరళికి, దాని నైజానికి ఆయువుపట్టులాంటిది. కాబట్టి ఒక ఉద్యమాన్ని సరిగా అర్థం చేసుకోవాలంటే దాని ధ్యేయాన్ని క్షుణ్ణంగా– సవివరంగా ముందు అర్థం చేసుకోవాలి. ఇస్లామీయ ఉద్యమ విషయంలో కూడా ఇది అత్యంత అవసరం. ఇంకా చెప్పాలంటే అనివార్యం కూడా. ఎందుకంటే దాని ధ్యేయం ప్రత్యేకమయినది. ఈ ధ్యేయ విశ్లేషణ కొన్ని అరుదయిన పారిభాషికాలపై ఆధారపడి ఉంది. ఆ పరిభాషకు సరైన అర్థం ఏమిటో ఈనాటి మేధస్సులకు తెలియదు, వాటి అవగాహన కూడా లేదు. కాబట్టి ఈ ఉద్యమం గురించి తదుపరి విషయాలు తెలుసుకొనేందుకు ముందుగా దాని ధ్యేయం సరిగ్గా అర్థం చేసుకోవటం తప్పనిసరి. దీనివల్ల ఈ ఉద్యమ నిజ స్వరూపాన్ని

తెలుసుకోవడమేకాక, దానిని గూర్చి పూర్తి పరిజ్ఞానాన్ని పొందే మార్గం సుగమమవుతుంది.

**వివరించవలసిన విషయాలు:**

నిబంధనావళిలో క్లుప్తంగా పొందుపరిచిన ముఖ్య విషయాలు- నిర్దిష్టమయిన అంశాల వివరణ ఈ ఉద్యమ అవగాహనకు ఎంతో అవసరం. వాటిని క్రింద తెలియజేయడమైనది.

**1) ధర్మం అంటే కేవలం ఇస్లాం ధర్మమే**

ఈ వివరణలో దీన్ (ధర్మం) అనే పదం సర్వసాధారణమైనది. అది ఒక ప్రత్యేక మతానికి చెందినది కాదని అనిపిస్తుంది. కాని అది వాస్తవం కాదు. దాని అర్థంలో ఒక ప్రత్యేకత - నిర్దిష్టత ఖచ్చితంగా ఉంది. ఆ నిర్దిష్టమయిన ధర్మమే "ఇస్లామ్ ధర్మం". అంతేకాని దాని అర్థం మరో ధర్మమని లేదా అన్ని ధర్మాలకు "దీన్" పదము వర్తిస్తుంది అనటం సరియైనది కాదు. ఇంతకు ముందు కూడా ఈ విషయాన్ని ప్రామాణిక ఆధారాలతో నిరూపించడం జరిగింది. అదేమిటంటే, ఏ యుగంలోనైనా, ఏ జాతిలోనైనా, ఏ దేశంలోనైనా అల్లాహ్ తరఫు నుండి ఈ సత్యధర్మమే అవతరింపజేయబడినది. దానిని విధిగా అవలంబించడానికే అది పంపబడినది. అంతేకాదు, దైవనిర్ణయం అతి స్పష్టమయిన ఆదేశాల ప్రకారం ఈనాడు ప్రపంచంలో ఉన్న అంతిమ ధర్మం 'ఇస్లామ్' మాత్రమే. దాన్ని ఆచరించడం అందరికి తప్పనిసరి. దాన్ని అనుసరించడం వల్లనే మానవుని పుట్టుకకు పరమార్థమయిన "దైవ ఆరాధన"ను నెరవేర్చిన వారవుతారు. ఇదీ వాస్తవ స్వరూపం. కాబట్టి ధర్మసంస్థాపన అంటే నిస్సందేహంగా కేవలం "ఇస్లామ్ స్థాపనే".

అలాంటప్పుడు ధ్యేయంలో 'ఇస్లామ్ స్థాపన' అని ఎందుకు పేర్కొనబడలేదు? దానికి బదులు 'ధర్మ సంస్థాపన' అనే పదాన్ని ఎందుకు వాడవలసి వచ్చింది? అనే ప్రశ్న ఉత్పన్నం కావచ్చు. దీనికి సమాధానం ఏమిటంటే ఇస్లాం మూలాలు మరియు 'దీన్' (ధర్మం) చారిత్రక వాస్తవాన్ని బట్టి ఇస్లాం స్థాపన అనే పదమే సరియైనది. దీనిని గురించి ఇంతకుముందు పేర్కొనబడింది. దీనిని సంక్షిప్తంగా చెప్పాలంటే ఇస్లాం కొత్త ధర్మమూ కాదు, వేరితర దైవధర్మాలకు

ప్రతిద్వంది కూడా కాదు. ఇది ఆది నుండి పంపబడుతున్న ఉపదేశాల లేదా సత్యధర్మం యొక్క పరంపరలో చివరి భాగం. కాని ఇతర దైవధర్మాలకంటే దీనికి కొన్ని ప్రత్యేకతలు ఉన్నాయి. ఉదాహరణకు ఇది అల్లాహ్ చిట్టచివరి ఉపదేశము- సార్వజనీనమైనది- అన్ని విధాలుగా సంపూర్ణమయినది, విశిష్టమైన జీవన వ్యవస్థ. ఇది సర్వ ప్రపంచానికి చిరకాలం కోసం ఆవిర్భవించింది. దీని ఆచరణ వల్లనే పరలోక సాఫల్యం ప్రాపంచిక సౌభాగ్యం లభిస్తుంది. ఇన్ని ప్రత్యేకతలు ఉన్నప్పటికీ, దాని మూల సిద్ధాంతాలరీత్యా ఆశయాలు మౌలిక ఉపదేశాలలో ఇతర ఆకాశ ధర్మాలకంటే ఏమాత్రం భిన్నంగా లేదు. స్పష్టంగా చెప్పాలంటే ఈ ధర్మాన్ని స్థాపించినట్లయితే అన్ని ధర్మాలను స్థాపించినట్లే. దీని ద్వారా ఆ ధర్మాల ఆశయం కూడా నెరవేరుతుంది. ఇది ఒక వాస్తవం, తిరుగులేని యదార్థం. దీనిని విస్మరిస్తే ఇస్లాం వాస్తవికతను తెలుసుకోలేం. అందుకే "ఇఖామతే ఇస్లాం"కు బదులుగా 'ఇఖామతే దీన్' అనే పదాలు ఉపయోగించడం సరియైనది, అనివార్యమైనది. దీని ద్వారా తెలిసేదేమిటంటే ఈ ధర్మం మానవుడు సృష్టించబడినప్పటి నుండి వివిధ జాతులలో, వివిధ దేశాలలో, వివిధ కాలాల్లో నిరంతరం పంపబడుతూ వచ్చింది. దాని మూలసిద్ధాంతాలు ఆశయాలు ఎల్లప్పుడూ ఒకేలా ఉన్నాయి. చివరకు అది తన పరిపూర్ణ దశకు చేరుకొని 'ఇస్లాం' అనే పేరుతో వినుతికెక్కింది. ఇస్లామీయ ఉద్యమ నిబంధనావళిలో దీన్ (ధర్మం)కు బదులుగా 'ఇస్లాం' అనే విధానాన్ని పొందుపరిస్తే ఈ పరమ సత్యాన్ని మరిచిపోయినట్లే అయ్యేది. కాని ఎట్టి పరిస్థితుల్లోనూ ఆ పరమ సత్యాన్ని మరవకూడదు. ఈ కారణంగానే ఇస్లామీయ ఉద్యమ నియమావళిలో 'ఇస్లాం' పదానికి బదులుగా 'దీన్' అనే పదాన్ని పొందుపరుస్తూ ఇలా వివరించబడింది.

"ఇకామతె దీన్" లోని "దీన్' అనే పద ఉద్దేశ్యం, విశ్వప్రభువు అల్లాహ్ తన ప్రవక్తల ద్వారా విభిన్నకాలాల్లో, విభిన్న దేశాల్లో పంపుతూ వచ్చిన దీనుల్ హక్ (సత్యధర్మం). దాన్ని ఆయన అంతిమ పరిపూర్ణ రూపంలో మానవులందరికీ మార్గదర్శకంగా తన అంతిమ ప్రవక్త హజ్రత్ ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ద్వారా అవతరింపజేశాడు. ఇప్పుడు ప్రపంచంలో అదొక్కటే

ప్రామాణికమయిన, సురక్షితమయిన , దైవసన్నిధిలో స్వీకార యోగ్యమైన ధర్మం (దీన్). దాని పేరే 'ఇస్లాం'. (4వ అధికరణ– వివరణ)

**2) స్వచ్ఛమైన సైద్ధాంతిక విధానం**

నిస్సందేహంగా ఇది ఒక స్వచ్ఛమైన, స్పష్టమైన సైద్ధాంతిక ధ్యేయం. ఇందులో ఎలాంటి భౌతిక లాలసత్వానికి, స్వార్థపరత్వానికి తావులేదు. దీనికి ఒక ప్రత్యేక జాతి, వర్గం , వర్ణం, భాష, దేశ భూభాగంతో సంబంధం లేదు. ఇది కొన్ని మౌలిక వాస్తవాలు, విశ్వాసాలు ఒక ప్రత్యేక జీవిత విధానానికి సంబంధించినది. దీని దృష్టి సంపూర్ణంగా, స్వచ్ఛంగా, మానవతా దృష్టి నైతిక ఆధ్యాత్మిక దృష్టి.

ఇది ముస్లిం–ముస్లిమేతరులు, ధనవంతులు – నిరుపేదలు, నల్లవారు–తెల్లవారు, పెట్టుబడిదారులు– శ్రామికులు అన్న తారతమ్యం లేకుండా అందరిది. అందరినీ అది సంబోధిస్తుంది. మహోన్నతుడైన అల్లాహ్ ఆధిపత్యాన్ని, దాస్యాన్ని నిండు హృదయంతో స్వీకరించి, తనను తాను ఆయన ధర్మానికి, ఉపదేశానికి అంకితం చేసుకుని, ఆయన ప్రసన్నత, పరలోక సాఫల్యతే ధ్యేయంగా బోధించిన ప్రతీ వ్యక్తిని తన వానిగా భావిస్తుంది. అలా భావించని వ్యక్తిని అతను ఏ జాతికి, దేశానికి చెందినాసరే పరాయివానిగా భావిస్తుంది. దాని ప్రత్యర్థి కేవలం 'దైవధిక్కార ధోరణి' మాత్రమే. ఒక వ్యక్తిగాని  లేదా సమూహంగానీ కాదు! దానికి ప్రీతిపాత్రమైనది కేవలం 'దైవదాస్యం' మాత్రమే గాని ఒక వ్యక్తి లేదా జాతి కాదు. దాని శ్రద్ధాసక్తులన్నీ ఆ ఒక్క బిందువుపైనే కేంద్రీకృతమై ఉన్నాయి. మరేవీ దానికి ముఖ్యం కాదు.

**3) ధర్మావగాహన - దాని పరిధి**

మనిషి మేధస్సులో కొన్ని ఆలోచనలుంటాయి. దానికి తగినట్లుగా అతని కార్యకలాపాలుంటాయి. ఈ రెండింటి ప్రతిరూపమే మానవ జీవితం. 'ఇస్లాం' ఈ రెండింటిపై దృష్టి సారించింది. వాటి గురించే ఉపదేశాలు జారీ చేసింది. ఈ ఉపదేశాలు పరిపూర్ణమైనవి. సార్వజనీనమైనవి. మనిషి అంతరంగానికి, బాహ్యజీవితానికి చెందిన ప్రతి విషయంపై, ఆలోచనలకు, ఆచరణలకు చెందిన

ప్రతి అంశంపై స్పష్టమైన ఆదేశాలు అందులో పొందుపర్చబడ్డాయి. అది సృష్టి రహస్యాలను తెలియపరుస్తుంది. సృష్టికర్త ప్రచండ శక్తిసంపన్నత– గుణవిశేషాల పట్ల సరియైన అవగాహన విశ్వాసం కలిగి ఉండాలని కాంక్షిస్తుంది. దైవంతో మానవునికి ఉన్న వాస్తవ సంబంధాన్ని విశదీకరిస్తూ దైవ విధేయత, ప్రసన్నత, ఆరాధనా విధానాలను తెలియపర్చుతుంది. సుగుణాలను విపులీకరిస్తుంది. ఆత్మ పరిశుద్ధతను ప్రసాదిస్తుంది. మనిషి సంసార–సామాజిక, వ్యాపార–ఆర్థిక రాజకీయ రంగాలన్నింటిలో చట్టాలు– ఆదేశాలు జారీచేస్తుంది. ఈ విధంగా మస్‌జిద్ నుండి సామాజిక జీవన వ్యవస్థ వరకు విస్తరించి ఉన్న సమస్యలన్నింటినీ అది తన పరిధిలోకి తీసుకుంటుంది. దీని ప్రతి ఆదేశం, అది ఏ విషయానికి చెందినాసరే 'దీన్' (ధర్మం)గానే పరిగణించబడుతుంది. దాన్ని ఆచరించడం తప్పనిసరి. 'ధార్మికులు' అనడానికి అది గీటురాయి. నిబంధనావళిలో 'దీన్' భావార్థాన్ని ఈ విధంగా వివరించడం జరిగింది:

"ఈ ధర్మం మానవుని అంతర్ బాహ్యాలను, అతని జీవితపు సకల వ్యక్తిగత, సామూహిక కోణాలను ఆవరించి ఉంది. విశ్వాసాలు, ఆరాధనలు, నైతికత మొదలుకొని, ఆర్థిక సామాజిక, రాజకీయ రంగాలన్నింటి వరకు మానవ జీవితపు ఏ ఒక్క విభాగమూ దీని పరిధికి వెలుపల లేదు. (4వ అధికరణ–వివరణ)

**4) ఇఖామత్ (స్థాపన) - అంటే...**

ఇఖామత్ అనే పదానికి అర్థం కనబడే ఒక వస్తువును చక్కబరచడం లేదా నిటారుగా నిలబెట్టడం. ఈ పదాన్ని కానరాని వాటికి ఆపాదిస్తే, దాని భావార్థాన్ని పరిపూర్ణ స్థాయికి చేర్చినట్లు అవుతుంది. కనిపించే వస్తువును నిటారుగా నిలబెడితే దాని వాస్తవ స్వరూపం దానిలోని మంచీ చెడులన్నీ పూర్తిగా తెలిసిపోతాయి. కానరాని విషయాలను 'నిటారుగా నిలబెట్టడం' అంటే– దాని వాస్తవిక స్వరూపం, దాని ప్రభావ శీలత గురించి సంపూర్ణంగా తెలియపర్చడం అన్నమాట. ఈ విశ్లేషణ ప్రకారం 'ఇఖామత్' అర్థమేమిటంటే ఇస్లాం ఆదేశాలు, **ఆ**కాంక్షలు మానవ జీవితంలో అందరికీ ప్రస్ఫుటంగా

కనిపించే రీతిలో స్థాపించడం. ఈ ధర్మాదేశాలు సర్వతోముఖమైనవి, సంపూర్ణ జీవితానికి చెందినవి అవటంచేత 'ఇఖామతె దీన్' స్పష్టమైన అర్థమేమిటంటే మన సంపూర్ణ జీవితాన్ని ఆ ఆదేశాలకనుగుణంగా తీర్చిదిద్దుకోవాలి. ఆ ఆదేశాలు నిజస్వరూపంలో సరియైన దృక్పథంతో నలువైపులా జారీ చేయబడాలి. ఆచరించబడాలి. జీవితంలో ఏ విభాగం కూడా దాని అనుసరణకు దూరం కాకూడదు. ఈ ధర్మవిశ్వాసాలు, విధానాలు సత్యమైనవని మదిలో నాటుకు పోవాలి. దైవారాధన అది తెలిపినట్లే చేయాలి. ప్రజల వ్యక్తిత్వం అది ప్రతిపాదించిన సిద్ధాంతాలకు అనుగుణంగా ఉండాలి. అది నిర్ధారించిన నైతిక విలువలు నలుదిశలా వ్యాపించాలి. మానవ వ్యక్తిగత జీవనం నుండి సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక, రాజకీయ, అంతర్జాతీయ సంబంధాల వరకు అన్నీ ఈ సిద్ధాంతాల ప్రకారమే అమలు జరగాలి. మానవుడు సంపూర్ణంగా దానికి ప్రతిరూపంగా మారాలి. ఏ స్థితిలోనైనా, ఏ ప్రాంతంలోనైనా, ఏ కార్యంలోనైనా ఆ ధర్మానికి విధేయుడై దాని అభీష్టాన్ని తీర్చడంలో అంకితమై పోవాలి. ఈ విషయాన్ని నిబంధనావళిలో సంక్షిప్తంగా ఇలా తెలపడం జరిగింది:

"ఈ ధర్మ సంస్థాపనం అంటే భావం, ఎలాంటి భేదభావం, విభజనను పాటించకుండా దీన్ (ధర్మం) మొత్తాన్ని చిత్తశుద్ధితో, అన్నింటి నుండి విముఖులయి, ఏకోన్ముఖులయి అనుసరించాలి. మానవ జీవితంలోని వ్యక్తిగత, సామూహిక కోణాలన్నింటిలో దీన్ని అమలు పర్చాలి. తద్వారా వ్యక్తి వికాసం, సమాజ నిర్మాణం, రాజ్య రూపకల్పన అంతా ఈ ధర్మం ప్రకారమే జరగాలి."

(4వ అధికరణ– వివరణ)

## 5) అంతిమ లక్ష్యం - పరమార్థం

ఉద్యమాలకు కొన్ని ధ్యేయాలంటూ ఉంటాయి. వాటి వెనుక కొన్ని ఉద్దేశ్యాలు కూడా ఉంటాయి. ఉద్దేశ్యాల, లక్ష్యాల సాధన కోసమే ధ్యేయాన్ని పెట్టుకోవటం జరుగుతుంది. ధ్యేయాన్ని దేహంతోను, లక్ష్యాన్ని ఆత్మతోను పోల్చవచ్చు. ఉదాహరణకు కమ్యూనిస్టు పార్టీనే తీసుకోండి. ఆ పార్టీ లక్ష్యం సమ సమాజ స్థాపన. కాని వాస్తవంగా అది దాని లక్ష్యం కాదు. శ్రామికులు,

కార్మికులు, కర్షకులకు ఆర్థికంగా న్యాయం చేకూరాలి– వారికి వారి జీవితా వసరాలన్నీ సమకూర్చబడాలి. వారు దోపిడికి గురికాకూడదు. ఇదే అదే సాధించదలచిన లక్ష్యం. కమ్యూనిజం సమసమాజ స్థాపనను తన ధ్యేయంగా ఎందుకు చేసుకుందంటే, అది తన లక్ష్యాన్ని సాధించడానికి ఏకైక మార్గమని, దాని ద్వారానే తన పరమార్థాన్ని సాధించవచ్చని భావించింది. మీరు కాస్త ఆలోచిస్తే ఇతర ఉద్యమాలన్నీ ఇలాగే వ్యవహరిస్తాయని తెలుసుకుంటారు. ఇస్లామీయ ఉద్యమం కూడా ఈ కోవకు చెందినదే. కాబట్టి దీని ధ్యేయం 'ఇఖామతే దీన్' (ధర్మసంస్థాపన) అయితే దాని పరమార్థం, మానవుని పరలోక జీవిత సార్థకత–సఫలత. అసలు ప్రాముఖ్యత వాస్తవంగా ఈ విషయానికే ఉంది. ఇది లేకుంటే ధర్మసంస్థాపనా ధ్యేయం నిరర్థకం. ఒక వ్యక్తి ఈ లక్ష్యాన్ని ఎందుకు చేపడతాడంటే, దాని ద్వారా అతను దైవప్రసన్నత పొందగలడు. అతని కరుణ కటాక్షాలకు పాత్రుడు కాగలడు. అతని పరలోక జీవితం సఫలం సార్థకం కాగలదు. ఇదే అతడు సాధించదలచిన పరమార్థం. ఇదొక మహోన్నత విషయం. అసాధారణ అంశం. తప్పనిసరిగా దాన్ని దృష్టిలో ఉంచుకోవాలి. కాబట్టి నియమావళిలో పొందుపర్చిన 'ధ్యేయం' అనే అంశంలో అంతర్లీనమై ఉన్న వివిధ అంశాలను వివరిస్తూ అతి ముఖ్యమైన ఈ విషయాన్ని కూడా విశదీకరించడం జరిగింది.

"దైవప్రసన్నత–పరలోక సాఫల్య ప్రాప్తి" ధర్మసంస్థాపనా కృషితో ముడిపడి ఉందని, మానవ జీవిత ముఖ్య ఉద్దేశం దైవారాధన అని, దాన్ని సంపూర్ణంగా పాటించడమే 'ధర్మసంస్థాపన' అని ఇంతకు ముందు స్పష్టంగా వివరించడం జరిగింది.

### 6) ప్రాపంచిక సాఫల్యానికి పూచి

ఈ ధ్యేయం ద్వారా అది పొందగోరే పరమార్థం పరలోక సాఫల్యమే అయినప్పటికీ ప్రాపంచిక శ్రేయో సాఫల్యాలను అది విస్మరించలేదు. పైగా దాంతో గట్టి సంబంధం కలిగివుంది. అందువల్లనే దానివల్ల నెలకొన్న శాంతి సౌభాగ్యాలు– సుఖ సంతోషాలు – ప్రగతి ప్రతిష్ఠలు మరో జీవిత విధానం ద్వారా సాధ్యం కాలేవు. సాధ్యపడవు కూడా. వాస్తవమేమిటంటే పరలోక

సాఫల్యం దాని అసలు పరమార్థం. ఆ పరమార్థ సాధనా కృషికి చిరుకానుకయే ఈ ఇహలోక సాఫల్యం. ధర్మసంస్థాపన, ప్రాపంచిక జీవితంలోనూ సఫలత సమకూరుస్తుందనడానికి చరిత్రే సాక్ష్యమిస్తుంది. అంతేకాదు, స్వయానా ఇస్లాం మూల విశ్వాసాలు, దాని ఆదేశాలు కూడా దీనికి సాక్షిగా నిలిచాయి. ఈ విశ్వాసాల ప్రకారం మానవుని ఉనికిని గురించి తెలిసేదేమిటంటే, అతను భువిలో విశ్వ సృష్టికర్తకు 'ఖలీఫా'గా, 'ప్రతినిధి'గా పుట్టించబడ్డాడు. రెండవది మానవ జీవితం గురించి తెలిసేదేమిటంటే అతని ప్రాపంచిక, పరలోక జీవిత విషయంలో ఎలాంటి వైరుధ్యమూ లేదు. అసమంజసత్వం కూడా లేదు. ఇహలోకం నుండి పరలోకం వరకు నిరంతరం సాగిపోయే జీవితం ఉంది. దాని ప్రథమ ఘట్టం ఇహలోక జీవితం, తదుపరి ఘట్టం పరలోక జీవితం. ఈ పరిస్థితుల కారణంగా ఇస్లాం ఉపదేశాలు పరిమితం కాకపోవడం సహజమే. అవి కేవలం ఇహలోకానికో, పరలోకానికో పరిమితం కావు. ఆ ఆదేశాలలో పరలోక జీవితం గురించి ప్రస్తావించబడినట్లే ఇహలోక జీవిత సమస్యలన్నింటిపై కూడా ప్రస్తావించడం జరిగింది. అంతేకాదు, వాటి పరిష్కార మార్గాలు కూడా సూచించబడ్డాయి. ఈ ఆదేశాలలో ఉన్న సమతూకం, న్యాయబద్ధత, వాస్తవికతల కారణంగా వాటిని ప్రవేశపెట్టగానే మానవజీవితం జటిల సమస్యల చిక్కుల నుండి సంపూర్ణంగా విముక్తి పొందుతుంది. ఈ వివరణల ద్వారా 'ఇస్లాం' ప్రాపంచిక జీవితంలో కూడా మనిషికి సాఫల్య భాగ్యాన్ని ప్రసాదిస్తుంది అనటంలో ఎలాంటి సందేహం లేదు. నిబంధనావళిలో ఈ ముఖ్య విషయాన్ని సంక్షిప్తంగా ఇలా వివరించడం జరిగింది:

"ఈ ధర్మం ఏవిధంగా దైవప్రసన్నత, పరలోక సాఫల్యాలకు హామీ నిస్తుందో అదే విధంగా ఇది ప్రాపంచిక సమస్యల సముచిత పరిష్కారానికి అత్యుత్తమ జీవన వ్యవస్థ కూడా. వ్యక్తిగత, సామూహిక జీవితాన్ని సంస్కార వంతంగా, ప్రగతిశీలంగా నిర్మించడం దీని సంస్థాపన ద్వారానే సాధ్యం." (4వ అధికరణ)

**7) వాంఛనీయ ప్రమాణాలు**

ఈ ధ్యేయం ద్వారా కాంక్షించబడే ఉన్నత ప్రమాణాలను క్లుప్తంగా చెప్పాలంటే: “యావత్ మానవ సమాజం లోకేశ్వరుడైన అల్లాహ్ ఆదేశాలకు, అభీష్టానికి అనుగుణంగా రూపొందాలి. వ్యక్తి, సమాజం ధర్మంపై నిలబడాలి. సద్వర్తనను, దైవారాధనను అవలంబించాలి. పరిస్థితులు సదాచారం–సంస్కారంతో ఏస్థాయికి ఎదగాలంటే సమాజ సంస్కరణ సులువైపోవాలి. చెడు ప్రబలటం కష్టతరంగా మారాలి. వ్యక్తులు సంఘానికి, సంఘం వ్యక్తులకు రక్షా కవచంలా మారాలి. అభివృద్ధికి మార్గం సుగమం కావాలి. ధనికులు, పేదవారికి మధ్య, పెట్టుబడిదారులు– శ్రామికులకి మధ్య పోరాటాలకు వర్గ సంఘర్షణకు బదులు సహాయసహకారాలు శ్రేయోభిలాషలు పరిఢవిల్లాలి. దివ్యఖుర్ఆన్ ప్రవక్త సంప్రదాయాల ప్రకారం చట్టాలు చలామణి కావాలి. చట్టాల రూపకల్పనలో వ్యక్తి ఆశలు, అభిలాషలకు, సంఘం ఆకాంక్షలకు తావుండకూడదు. దైవదాసులు వాస్తవంగా తమంతట తాము దైవదాసులుగా, ఆజ్ఞాపాలకులుగా ఏతెంచి అల్లాహ్ మహోన్నత అధికారానికి సంపూర్ణ భక్తిశ్రద్ధలతో వినమ్రులై తమ తప్పుడు అధికార డాంబికాలకుపోకుండా ఉండాలి. తీర్పులన్నీ సత్యబద్ధంగా, ధర్మబద్ధంగా ఉండాలి. బలవంతుల పట్ల పక్షపాత వైఖరి అవలంబించి వారికి అనుకూలంగా తీర్పు ఇవ్వకూడదు. ప్రభుత్వ యంత్రాంగ ముఖ్యకార్యం సత్కార్యాలను ప్రోత్సహించడం, దుష్కార్యాలను రూపుమాపడం, తిరుగులేని న్యాయపాలన దౌర్జన్య నివారణ కావాలి. క్లుప్తంగా చెప్పాలంటే, ఇస్లాం ధర్మం ప్రవేశపెట్టే జీవన విధానం గత కాలంలో మాదిరిగా యావత్తు ప్రపంచం ముందు ప్రత్యక్షం కావాలి. ఈ వాంఛనీయ ప్రమాదాన్ని నియమావళిలో ఈ విధంగా పేర్కొనబడింది.

అందుకే సంవిధానం, అది కోరే ఈ ప్రమాణ నికషాన్ని నిర్ధారిస్తూ ఇలా అంటోంది–

“ఈ ధర్మసంస్థాపనకు ఆదర్శప్రాయమైన అత్యుత్తమ ఆచరణాత్మక నమూనా ప్రవక్త మహనీయులు హజ్రత్ ముహమ్మద్(స). సన్మార్గగాములైన ఖలీఫాలు (రిజ్వానుల్లాహి తాలా అలైహిమ్ అజ్‌మయీన్) స్థాపించినదే.

# సంబోధితులు

**సర్వతోముఖ సందేశం:**

ఏ ఉద్యమం గురించి అయినా ప్రారంభంలో అనేక ప్రశ్నలు తలెత్తుతాయి. అందులో ఒక ప్రశ్న ఏమిటంటే ఈ ఉద్యమం ఎవరికోసం? ఎవరిని ఇది సంబోధిస్తుంది? అనేది. ఉదాహరణకు పెట్టుబడిదారీ వ్యవస్థను స్థాపించే ఉద్యమం ఆర్థిక వనరులపై ఆధిపత్యం చెలాయించే వ్యక్తులను సంబోధిస్తుంది, కమ్యూనిస్టు ఉద్యమం కార్మికులను, కర్షకులను ఆహ్వానించి సంఘటిత పరుస్తుంది. అలాగే జాత్యాభిమానం గల ఉద్యమం ఒక ప్రత్యేక జాతిని, మతతత్వ ఉద్యమాలు తమ మతాధిపతులను ఒకచోట సంఘటిత పరుస్తాయి. కాబట్టి ఇస్లామీయ ఉద్యమ విషయంలో కూడా, అది ఎవరిని సంబోధిస్తుంది? ఇంతకీ దాని సందేశం ఎవరికోసం? అనేది స్పష్టంగా తెలుసుకోవడం ఎంతో అవసరం. ఈ ప్రశ్నకు సమాధానం పొందడానికి ఇంతకుముందు విశదీకరించిన ఇస్లామీయ ఉద్యమ ఆశయాన్ని, దాని వివరణలను ఒకసారి మననం చేసుకుంటే సరిపోతుంది. అల్లాహ్ చిట్టచివరిగా ప్రపంచానికంతటికీ, శాశ్వత ధర్మాన్ని పంపించాడు. ప్రతి ఒక్కరూ దాన్ని అవలంబించడం ఎంతో అవసరం. ముక్తి పొందడానికి తప్పనిసరి. ఇస్లాంకు చెందిన ఈ విశిష్టత, దాన్ని స్థాపించడానికి ఏర్పడిన ఉద్యమానికి కూడా సహజంగానే ఉంటుంది. అది ప్రపంచానికి చెందినదై సర్వమానవాళిని సంబోధిస్తుంది. జాతి, వర్ణ, వర్గ, దేశ,భాషల తార తమ్యాలకు అది అతీతంగా ఉంటుంది. అందువల్లనే ఈ ఉద్యమానికి మూలమైన ఖుర్ఆన్, స్పష్టమైన తన ప్రకటనల ద్వారా; ఖుర్ఆన్‌ను అందించినవారు, సందేశానికి వాస్తవ ప్రతినిధులు అయిన ముహమ్మద్ ప్రవక్త (స) కూడా తమ

ఉపదేశాల ఆచరణల ద్వారా, ఈ సత్యాన్ని స్పష్టంగా విశదపర్చారు. అందువల్లనే ఇస్లామీయ ఉద్యమం కూడా తన సందేశాన్ని ఎలాంటి తారతమ్యాలు పాటించకుండా సర్వమానవాళికి అందిస్తుంది. తన కారుణ్య సందేశానికి ఎవరినీ దూరం చేయదు. కాబట్టి మొదటి రోజునుండే ఈ విధానాన్ని అది అవలంబించింది. దాని నియమావళిలో ఇలా తెలియపర్చబడింది.

"ఇండియన్ యూనియన్‌కు చెందిన ప్రతి పౌరుడు, స్త్రీ అయినా పురుషుడయినా, ఏ జాతికి, ఏ వంశావళికి చెందిన వారయినా జమాఅతె ఇస్లామీ హింద్ సభ్యులు కావచ్చు. అయితేవారు.......... (6వ అధికరణ)

"అయితే వారిపై" కొన్ని మౌలిక నిబంధనలు షరతులు విధించబడ్డాయి. ఇస్లామీయ ఉద్యమంలో చేరడానికి వాటిని అంగీకరించడం తప్పనిసరి. కాబట్టి ఉద్యమ కార్యాచరణ తయారు చేసినప్పుడల్లా ఈ విషయంలో స్పష్టమైన వివరణ ఇలా ఇవ్వడం జరిగింది:

"మా సందేశ సంబోధకులు ముస్లింలు - ముస్లిమేతరులు. సందేశాన్ని హెచ్చుతగ్గులు లేకుండా ప్రతివర్గానికి చెందినవారికి చేరవేయడం ధర్మపరంగా మా బాధ్యత." (జమాఅతె ఇస్లామీ హింద్ పాలసీ ప్రోగ్రాం)

**స్వాభావిక విభజన :**

ఇస్లామీ ఉద్యమం ప్రతి వ్యక్తిని సంబోధిస్తుంది. ప్రతి వ్యక్తి దానికి అవసరమే. కాని అది స్థాపించదలచిన ధర్మం విషయంలో అందరి ఆలోచనా తీరు ఒకేలా ఉండదు. వారికున్న విభిన్న దృష్టికోణాల వల్ల వారు వివిధ వర్గాలుగా విభజించబడ్డారు.

ఒక వర్గం ఈ ధర్మాన్ని విశ్వసించే వారిది. వారు ముస్లింలుగా పిలువబడతారు. మరో వర్గం ఈ ధర్మాన్ని విశ్వసించని వారిది. వారిని ముస్లిమేతరులంటారు. ఈ రెండు వర్గాల మనస్తత్వాలు, భావోద్రేకాలు అభిప్రాయాలు ఇస్లాం గురించి ఒకే విధంగా లేవని, ఉండబోవని వారిమధ్య తూర్పు-పడమరలకున్న వ్యత్యాసము ఉందని అందరికీ తెలుసు. మొదటి వర్గానికి చెందినవారు, ఇస్లాం ధర్మ ఆచరణలో ఎంత వెనుకబడి ఉన్నా వారి జీవితాలలో ఇస్లామేతర

విధానాలు, సిద్ధాంతాల ప్రభావం ఎంతగా ఉన్నా వారికి ఇస్లాం పట్ల విశ్వాస ముంది. మానసికంగా, ఆధ్యాత్మికంగా దానితో అనుబంధముంది. అదే సత్య మైనదని, సఫలత చేకూర్చేదని వారు తప్పకుండా విశ్వసిస్తారు. ఆ సిద్ధాంతం (కలిమా) వర్ధిల్లాలని కాంక్షిస్తారు. కాని రెండవ వర్గానికి చెందిన వారి తీరు దీనికి భిన్నంగా ఉంటుంది. వారికి ఇస్లాం పట్ల విశ్వాసముండదు. అవగాహనా ఉండదు. మానసికంగా ఆధ్యాత్మికంగా సంబంధముండదు. దాని మౌలిక సిద్ధాంతాలు, స్వరూప స్వభావాలు, పరిభాష, పవిత్రత వారికి ఏ మాత్రమూ తెలియవు. కాబట్టి ఇస్లాంను వారు తిరస్కరిస్తారు. లేదా వ్యతిరేకిస్తారు. లేదా దానితో సంబంధం లేనట్లుగా వ్యవహరిస్తారు. ఇస్లాం గురించి ఈ రెండు వర్గాల విభిన్న మానసిక-భావోద్రేకాల ఫలితంగా ఇస్లామీ ఉద్యమం పట్ల కూడా వారి మానసిక భావోద్రేకాలు భిన్నంగానే ఉంటాయి. అలాంటప్పుడు మొదటి వర్గాన్ని సంబోధించినట్లుగా రెండవ వర్గాన్ని సంబోధించడం సరికాదని ఇంగిత జ్ఞానమే చెబుతుంది. లేనిచో ఇస్లామీయ ఉద్యమ ప్రబోధాలు రెండవ వర్గానికి సమంజసంగా– సహేతుకంగా ఉండజాలవు. వారి మేధస్సును అవి ప్రభావితం చేయలేవు. అందువల్లనే ఉద్యమం ఈ రెండు వర్గాలను సంబోధించినప్పటికీ, తన సందేశాన్ని అందజేసేటప్పుడు రెండువర్గాల ఆలోచనా తీరునుబట్టి ఒక ప్రత్యేక శైలిలో వారిని సంబోధిస్తుంది. జ్ఞానరీత్యా ఇదే సరియైన, సమంజసమైన విధానం.

### 1) ముస్లింల ఉద్యమ ప్రాధాన్యత

ఈ రెండు వర్గాలలో మొదటి వర్గమైన ముస్లింల స్థానం ఉద్యమ ప్రదాయ సంబోధకులది. వారినే ప్రధమంగా ఆహ్వానిస్తుంది. అందుకు అనేక కారణా లుంటాయి.

1. మొదటి ముఖ్య విషయమేమిటంటే ముస్లింల స్థానం ఈ ఉద్యమాన్ని మౌనంగా అంగీకరించిన సభ్యుల లాంటిది. ఎందుకంటే ఏ వ్యక్తి అయినా తనను తాను ముస్లింగా చెప్పుకున్నప్పుడు వాస్తవంగా అతను ఇస్లాం ఉద్యమ సారథినని, ప్రపంచంలో సత్యధర్మం కోసం ఉనికిలోకి వచ్చిన ముస్లిం సమాజ

సభ్యుడినని, మంచిని ప్రబోధించి చెడును రూపుమాపడమే ధ్యేయంగా పంపబడిన ధర్మాన్ని ఆచరించేవాడినని అంగీకరించినట్లే. కాని నేటి పరిస్థితి ఏమిటంటే, ఇస్లాం విధివిధానాలు కేవలం దైవగ్రంథ పుటలలోనే అలంకృతమైపోయాయి. దైవధర్మ సాక్ష్యం ఏమరుపాటుకు గురయింది. మంచిక ప్రేరణ అడుగంటింది. చెడు నలుదిశలా వ్యాపించింది. అల్లాహ్ పంపిన ధర్మం సామాన్య ప్రజల జీవితాల నుండే కాదు, స్వయాన ముస్లింల జీవితాల నుండి కూడా చాలా వరకు కనుమరుగైపోయింది. ఇలాంటి స్థితిలో ముస్లిం అనబడే ఏ వ్యక్తి అయినా ఈ దుస్థితిని చక్కబర్చే బృహత్తర బాధ్యత నుండి తప్పించుకోజాలడు. వాస్తవంగా చెప్పాలంటే ఈ పరిస్థితుల్లో తనపై ఉన్న బృహత్తర బాధ్యతను నెరవేర్చడానికి ఉద్యమిస్తేనే అతనొక నిజమైన ముస్లింగా ప్రత్యేక గుర్తింపు పొందగలడు. అతను అంగీకరించినా అంగీకరించకపోయినా, నడవడిక ఎలా ఉన్నా, ముస్లిం అయినందువల్ల ఈ భువిపై దైవధర్మానికి సాక్షిగా నిలబడి, దానిని స్థాపించడం అతని ప్రథమ అంతిమ జీవితాశయం. ఒక ముస్లిం జీవన విధానం ఎలా ఉంటుందో ఖచ్చితంగా ఇస్లామీ ఉద్యమ కార్యకర్త విధానం అలాగే ఉంటుంది. కాబట్టి ప్రతీ ముస్లిం ఈ సందేశాన్ని మౌనంగా అంగీకరించే సభ్యుడని చెప్పడంలో ఎంతమాత్రం అతిశయోక్తి లేదు. ఇక ఒక ముస్లిం ఈ ఉద్యమంలో చేరలేదంటే, అతను దీని ప్రత్యేక విధివిధానాలతో లేదా ఆలోచనాతీరుతో ఏకీభవించడం లేదన్నమాట. అయినప్పటికీ అదే జీవిత లక్ష్యం- ఆశయం తనదిగా రూపొందించుకొని ఉంటాడు. లేదా మూఢత్వము అజ్ఞానం వల్ల ధర్మపరంగా ఉన్న తన స్థానాన్ని, గురుతర బాధ్యతను గుర్తించకపోవచ్చు. లేదా అతను చేస్తున్న ఇస్లాం స్వీకార ప్రకటన సరియైనది కాకపోవచ్చు. ముస్లింల నిజస్థానం, వారి వ్యవహారశైలి ఇలా ఉండటం వల్ల స్వాభావికంగా వారిని తన వారిగా భావించి ప్రథమంగా వారినే ఇస్లామీయ ఉద్యమంలో ఆహ్వానించడం తప్పనిసరి అని భావించడ మైనది. వారిని పిలవడం నిజానికి తన పార్టీ వారిని పిలిచినట్లే. తద్వారా అందరూ సంఘటితమై పార్టీ

ఆశయ సాధనకు తిరిగి కార్యోన్ముఖులు కావడానికి అవకాశం ఏర్పడుతుంది. అందువల్లనే ప్రథమంగా జరగవలసిన కార్యమిది.

2. రెండవ కారణమేమిటంటే, ఒక ముస్లిం ఆచరణ రీత్యా ఎలా ఉన్నా ముస్లింగా ఉన్నంత వరకు అతను ముస్లిం సమాజంలోని అవిభాజ్య అంశమే. అందువల్ల ఇతర ముస్లింల వలే అతని ధార్మిక, సామాజిక హక్కులు ముస్లిం సమాజంపై ఉంటాయి. ఈ హక్కులలో ఒక ప్రధాన హక్కు ఏమిటంటే, అతణ్ణి సన్మార్గగామిగా చేసి, అతడి శ్రేయస్సును కాంక్షించడం పుణ్యకార్యాలు చేయ డానికి ప్రేరేపించడం, పాప కార్యాల నుండి పరిరక్షించడం, నిజమైన ముస్లింగా తీర్చిదిద్దడం. జీవితాశయ సాధన కొరకు ఉత్తేజపర్చడం. ఇదే వాస్తవంగా అతనిపట్ల నిజమైన శ్రేయోభిలాష. అతణ్ణి పుణ్యకార్యాలను ఆచరించేవాడిలా, పాపకార్యాలను త్యజించేవాడిలా తీర్చిదిద్దడమే ఘనకార్యం. కాబట్టి ఇస్లామీయ ఉద్యమ సభ్యులు తప్పకుండా ఇతర ముస్లింల ఈ హక్కును ఎలాగైనా నెరవేర్చాలి. నిస్సందేహంగా ఇతర దైవదాసుల హక్కులు కూడా ముస్లింలపై ఉన్నాయి. అవేమిటంటే వారికి ఇస్లాం సందేశాన్ని అందజేయాలి. నిరర్ధకమైన విశ్వాసాల నుండి పాపకార్యాల నుండి రక్షించడానికి నిరవధికంగా ప్రయత్నించాలి. కాని ఖుర్ఆన్ ఆదేశానుసారం ముస్లింలను సంస్కరించే హక్కు నిస్సందేహంగా ఇతరు లకంటే ప్రముఖమైనది.

3. మూడవ కారణం ఏమిటంటే, ఇతరులు ఈ ఉద్యమానికి చేరువ కావాలంటే వారిచుట్టూ ఉన్న ముస్లింలు నిజమైన ముస్లింలై ఉండాలి. వారి జీవితాలు స్పష్టంగా ఇస్లాంకు ప్రతిరూపంగా మారాలి. వారు మంచి వారైనా, చెడ్డవారైనా ఇస్లాంకు ప్రతినిధులుగా భావించబడతారు. ఇతరులు 'ఇస్లాంను' దాని మూలగ్రంథమైన ఖుర్ఆన్ - ప్రవక్తజీవిత చరిత్రల ద్వారా కాకుండా, సాధారణంగా ముస్లింల నైతిక స్వభావం– వారి నడవడికను చూచి అర్థం చేసుకుంటారు. ఇది సరియైన అన్వేషణా పద్ధతి కాదు. కాని వాస్తవంగా జరిగేది మాత్రం అదే. దాని ప్రభావాన్నుండి తప్పించుకోలేము. కాబట్టి ముస్లింల

జీవితాలు ఇస్లాంకు దూరంగా ఉన్నంత వరకు ఇస్లాంకు అడ్డుగోడగానే ఉంటారు. అప్పటివరకు ముస్లిమేతరులు ఇస్లాం నిజస్వరూపాన్ని చూడగలరని, దాని సహజ సౌందర్యానికి ఆకర్షితులౌతారని చెప్పజాలం. ఇదొక కఠోర వాస్తవం. కాబట్టి ఇతరులకు ఇస్లాం సందేశం ఇవ్వడానికైనా తమ బాధ్యత మరచి ముస్లిం లకు ముందుగా ఇస్లాం పట్ల సరియైన అవగాహన కల్పించాలి. లేకుంటే ప్రస్తుతమున్న వారి వ్యవహారశైలి ఇస్లాం మార్గాన్ని ఇతరుల కొరకు నిర్దాక్షిణ్యంగా మూసివేస్తుంది. ఈ ఉద్యమం ప్రప్రథమంగా ముస్లింలను సంబోధించడానికి ముఖ్య కారణాలు ఇవే.

**(2) ముస్లిమేతరులు - ఉద్యమ ప్రాధాన్యత**

ముస్లింలు ప్రథమ సంబోధితులు అయినంతమాత్రాన, ఇతర దైవదాసు లకు ఈ ఉద్యమ సందేశం ఇవ్వడంలో తాత్సారం చేయమని అర్థం ఎంతమాత్రం కాదు. అలా ఒక్క రోజు కూడా చేయడానికి వీల్లేదు. కొన్ని కారణాల వల్ల ముస్లిం సముదాయానికి ప్రథమస్థానం ఉన్నప్పటికీ, ముస్లిమేతరులకు కూడా కొన్ని ప్రత్యేకతలు, విశిష్టతలున్నాయి. అందువల్ల ఒక్క క్షణం కూడా వారిని ఉపేక్షించలేము.

1) మొదటి కారణం ఏమిటంటే, మౌలికంగా ఈ ఉద్యమ నైజం-తీరుతెన్నులు, ముస్లింలకు కాక ముస్లిమేతరులకు సంబోధించే విధంగా ఉన్నాయి. ఎందుకంటే ఈ ఉద్యమం తన నైజం దృష్ట్యా దివ్యఖుర్ఆన్ ఇచ్చిన సందేశం లాంటిదే. దివ్యఖుర్ఆన్‌లో ముస్లింలు సర్వమానవాళి సమక్షంలో సత్యధర్మసాక్షులని, దాని సంరక్షకులని తెలపడం జరిగింది. అదే నెరవేర్చవలసిన కార్యమని, వారి జీవిత ఏకైక లక్ష్యమని విశదీకరించబడింది.

**"ఇకపై మీరు సకల మానవాళికి సాక్షులు కాగలగాలి."**

(అల్ బఖర :143)

**"ఇప్పుడు ప్రపంచంలో శ్రేష్ఠమైన సముదాయం మీదే. మిమ్మల్ని మానవుల మార్గబోధనకు, సంస్కరణకు లోకంలో తీసుకురావటం జరిగింది. మీరు**

సదాచారాన్ని ఆదేశిస్తారు. చెడుల నుండి నిరోధిస్తారు, దైవాన్ని విశ్వసిస్తారు. *(ఆలి ఇమ్రాన్ : 110)*

ఖుర్‌ఆన్‌లోని 'అలన్నాస్' 'లిన్నాస్' పదాలు, ముస్లిం సముదాయం అల్లాహ్ తరఫునుండి ఒక ప్రత్యేక కార్యంపై నియుక్తులైనవారని, ఒక ప్రత్యేక కార్యసాధనకోసం వారిని ఉనికిలోకి తేవడం జరిగిందని తెలుపుతున్నాయి. ఆ కార్యమే సర్వమానవాళి సమక్షంలో ధర్మసాక్షులుగా నిలవడం, మానవులందరిలో దైవ జిజ్ఞాస కల్పించి ధర్మపరాయణులుగా చేయడం.

ముస్లిం సముదాయ కార్యక్రమ విధి విధానాలు ఇలా ఉండగా, అందులో నుండి ఆవిర్భవించిన ధర్మ సంస్థాపన ఉద్యమం తీరుతెన్నులు వేరుగా ఉండ జాలవు. తప్పనిసరిగా అది అన్నాస్ (సర్వమానవాళి)ని సంబోధిస్తుంది. కాని ప్రస్తుతం ముస్లిం సముదాయం క్లిష్టపరిస్థితుల్లో ఉండటం వల్ల అధికసంఖ్యాకులు ఏమరుపాటుకు గురైనవారు. తమకు అల్లాహ్‌పై విశ్వాసముందని, ఖుర్‌ఆన్‌ను ఆచరిస్తామని ప్రకటించినప్పటికీ, వారి జీవితాలు దానికి పూర్తిగా భిన్నంగా ఉన్నాయి. వారు తమ బాధ్యత ఏమిటో తెలుసుకోలేకపోతున్నారు. అందువల్లే ఇస్లామీయ ఉద్యమం తన ముస్లిం సముదాయాన్ని అందరికంటే ముందుగా సంబోధించవలసి వచ్చింది. దానిపై ప్రత్యేక దృష్టి పెట్టవలసిన ఆవశ్యకత ఏర్పడింది. ఈ విధంగా ఇస్లామీ ఉద్యమం చేపట్టదలచిన బృహత్తర కార్యాన్ని సాధించడానికి ముందుగా ముస్లిం విశ్వాసాన్ని జాగృతపర్చి వారిని సంస్కరించడం అనివార్యమైపోయింది. ఈ పరిస్థితే దాపురించకపోతే ఈ ఉద్యమంలో తన అసలు బాధ్యతను నెరవేర్చడానికి ఏకాగ్రతతో పనిచేసేది. దాని సందేశ ప్రధాన కార్యక్రమాలు ముస్లిమేతరుల కొరకే ప్రత్యేకించబడి ఉండేవి. ఇప్పుడీ పనిని ఏకాగ్రతతో నెరవేర్చలేకపోవడానికి కారణం ముస్లిం సమాజం ఆధ్యాత్మికంగా అనారోగ్యానికి గురికావడమే. దాని చికిత్సకు ప్రత్యేక శ్రద్ధ వహించలసి రావడమే. లేకుంటే దాని సందేశ ప్రచారాలు కేవలం ముస్లిమేతరులకే పూర్తిగా నిర్దేశించబడేవి. ఈ ఉద్యమం కాంక్షించేది కూడా ఇదే.

(2) రెండవ కారణం: ఈ ఉద్యమ శ్రేయస్సు కూడా ఇందులో ఇమిడి ఉంది. ఏ దేశంలోనైనా– ఏ యుగంలోనైనా ఆ దేశ ప్రజల సహకారంతోనే ఇస్లామీ ఉద్యమం విజయం సాధించింది. అలాగే ఈ దేశ ప్రజలలో అధిక సంఖ్యాకులు హృదయపూర్వకంగా సహకరిస్తేనే ఇస్లామీ ఉద్యమం విజయవంత మవుతుంది. ఇచ్చట 90 శాతం ముస్లిమేతరులున్నారు. వారి సంఖ్యాబలమే కాదు, ఆర్థిక, రాజకీయ బలం కూడా ఎంతో అధికంగా ఉంది. ప్రభుత్వాధికారం వారి చేతిలోనే ఉంది. ఈ స్థితిలో వారిని విడిచిపెట్టినా ఉద్యమ భవిష్యత్తు ఉజ్వలంగా ఉంటుందని భావించడం, అధిక సంఖ్యాకుల సహకారం లేకపోయినా గమ్యాన్ని చేరగలం అని అనుకోవడం అవివేకమే అవుతుంది. కాబట్టి ముస్లిమేతరులపై ప్రత్యేక శ్రద్ధ వహించి, వారిని సంబోధించి, తమ అనుయాయులుగా చేసుకొనటానికి సకల ప్రయత్నాలు చేయవలసిన ఆవశ్యకత ఈ ఉద్యమానికి ఎంతైనా ఉంది.

(3) మూడవ కారణమేమిటంటే, మానవులంతా ఒకే తల్లిదండ్రుల (ఆదం–హవ్వాల) సంతానం. భాషా, రంగు, జాతి, దేశం, ఆలోచనా విధానం, విశ్వాసాలు వేరైనా, వారి మధ్య స్వాభావికంగా నెలకొని ఉన్న బంధుత్వ హక్కులను ఆదరించడం అవసరం. ఈ బాంధవ్యం వల్లనే ఒండొకరి పట్ల ప్రేమానురాగాలు జనిస్తాయి. పరస్పర శ్రేయోభిలాష కోసం ఇది ఎంతో అవసరం. ఒక మనిషిలో మానవత్వం పూర్తిగా మంటగలసి పోనంతవరకూ ఈ సౌభ్రాతృత్వం, ప్రేమాభిమానాలు అతని హృదయం నుంచి తుడిచి పెట్టుకొని పోజాలవు. స్వాభావికమయిన ఈ ప్రేమాభిమానాలే తనతోటి వారిశ్రేయస్సును కాంక్షిస్తాయి. కష్టాల్లో ఆదుకోవడానికి, ఆపదల నుంచి వారిని రక్షించడానికి ప్రేరేపిస్తాయి. ఇస్లాం ధర్మం కూడా ఇదే కోరుకుంటుంది. తన అనుయాయులకు ఇదే ప్రబోధిస్తుంది. అందువల్ల ఇస్లాం ఉద్యమ కార్యకర్తలు తమ అంతరంగంలో ఈ ఉన్నత నైతిక విలువలను పెంపొందించి వాటిని ఆచరించడం ఎంతయినా అవసరం.

ప్రేమాభిమానాలు, శ్రేయోభిలాష వ్యక్తపర్చడానికి ఇతరుల దృష్టిలో ఏ ఘనకార్యమున్నప్పటికీ, ఇస్లాం- ఇస్లామీయ ఉద్యమ దృష్టిలో మాత్రం మానవాళిని పరలోక అనంత జీవితంలో వైఫల్యం నుండి రక్షించడమే వారిపట్ల నిజమయిన శ్రేయోభిలాష.

దైవదాసులు స్వచ్ఛమయిన దైవారాధనను పాటించి దైవానుగ్రహం పరలోక సాఫల్యతను పొంది పరలోక జీవిత అనర్థాల నుండి రక్షించబడాలి అనేదే ఈ ఉద్యమ అసలు లక్ష్యం. కాగా, సన్మార్గం తెలియక పరలోకంలో అంతులేని అనర్థాల వైపు పరుగిడుతున్న మానవాళిని చూడకుండా, కళ్ళు మూసుకుని అది నిర్లిప్తంగా ఎలా ఉండగలదు? వారికి ఎదురు కాబోయే ఘోర ప్రమాదాల నుండి రక్షించడానికి, కలత చెందకుండా ఏ ప్రయత్నం చేయకుండా ఎలా ఉండగలదు? అలా చేయకపోతే అది తన కర్తవ్యాన్నేకాదు తన ఉనికిని కూడా మరిచిపోయినట్లు అయ్యేది. స్వాభావికంగా మానవుల పట్ల ప్రేమాను రాగాలు, వారి యోగక్షేమాలను కాంక్షించే తపన మానవునిలో ఎంత ప్రగాఢ మయినది, బలీయమయినది, ఉన్నతమయినదంటే, ఒకవేళ అల్లాహ్ తరఫు నుండి ధర్మప్రచారపు బాధ్యత విశ్వాసులపై విధించబడనప్పటికీ, ఈ తపన వారిని చూస్తూ కూర్చోనిచ్చేది కాదు. దైవాన్ని మరిచిపోయి అతని కారుణ్యానికి దూరమయిన తమ ముస్లిమేతర సోదరులను ఎలాగయినా అల్లాహ్ సాన్నిధ్యంలో చేరవేసి, అతని కరుణాకటాక్షాలకు నోచుకునేలా చేయడానికి సకల ప్రయత్నాలు చేసేవారు.

ఈ కారణాలే ముస్లిమేతరులను కూడా సంబోధించి తన సందేశాన్ని వారికి అందించడానికి పురికొల్పాయి. ఈ విషయంలో ఏమాత్రం అశ్రద్ధ- తాత్సారము, సంశయానికి తావులేకుండా చూడటానికి ఇస్లామీయ ఉద్యమాన్ని ప్రేరేపిస్తున్నాయి.

# సందేశ విధానం

## సందేశ మౌలిక గుణం

ఇస్లాం ఒక జ్ఞాన భరితమైన, వివేకవంతమైన ధర్మం. దివ్యఖుర్‌ఆన్ సందేశం స్వచ్ఛంగా జ్ఞానదాయకమైన సందేశం. కాబట్టి ఇస్లామీయ ఉద్యమం కూడా తన సందేశ ప్రచార విధానంలో బలాత్కారాన్ని అవలంబించదు. క్షణికావేశాలను రేకెత్తించదు. ప్రజలకు మోసం చేయడం దానికి శోభించదు, మానవులను మంత్రముగ్ధులుగా చేయడానికి మేధస్సును ప్రభావితం చేయడానికి తప్పుడు నినాదాలు, అసత్య ప్రచారాలు చేయదు. ఈ విధానాలు దాని నైజానికి ఎంతకీ సరిపడవు. అవి ఉద్యమానికి ఎంతమాత్రం ప్రయోజనం కల్గించవు. ఒక సంస్కారవంతుడు పనికిమాలిన విషయాలకు నీచ ప్రవృత్తులకు దూరంగా ఉన్నట్లు ఈ ఉద్యమం కూడా దూరంగా ఉంటుంది. ఇది నేరుగా మనిషి ఇంగిత జ్ఞానాన్ని సంబోధిస్తుంది. అతని అంతర్మాతను మేల్కొల్పి అతనిలోని ఉన్నత భావాలు, భావనలను జాగృతపరుస్తుంది. అందువల్లనే తన సందేశం అందజేయడానికి అది ప్రశాంత వాతావరణాన్ని అనుకూల పరిస్థితులను కాంక్షిస్తుంది. సమయోచితంగా తన సందేశాన్ని ప్రామాణిక ఆధారాలతో నిరూ పించి మానవ హృదయాలను సంతృప్త పరచి గెలుచుకుంటుంది. ఎందుకంటే ఏ గొప్ప ఆశయం కొరకు ఇస్లామీయ ఉద్యమం ఉనికిలోకి వచ్చిందో దాని కొరకు విశ్వాస బీజం మనో భూమిలో నాటుకుపోయినవారు అవసరం. హృదయాంతరాళాలలో ఒక విషయం పూర్తిగా నాటుకుపోవాలంటే సంతృప్త పరిచే బలీయమైన ప్రామాణిక ఆధారాలతో దానిని నిరూపించవలసి ఉంటుంది. బలవంతంగాగానీ, మోసపూరిత విధానాల ద్వారాగానీ అది సాధ్యపడదు.

## ప్రత్యక్ష సందేశ విధానం

దైవధర్మ అసలుసిసలు ప్రబోధకులు దైవ ప్రవక్తలు. వారు ఈ సందేశాన్ని నేరుగా చేరవేశారు. ఏ అరమరికలూ లేకుండా, ఏ విషయాలు దాచకుండా, ఎవరి మధ్యవర్తిత్వం లేకుండా, ఎలాంటి లౌక్యాన్ని ప్రదర్శించకుండా, సుదీర్ఘ ఉపోద్ఘాతాలు లేకుండా ముఖాముఖిగా స్పష్టంగా, నిర్భయంగా, తమ సందేశాన్ని అందజేశారు. తమ సందేశ ఆరంభం ధర్మపునాదులపైన దేవుని ఏకత్వం, అంతిమ దినం, తమ దైవదౌత్యంతో ప్రారంభించారు. వాటిని విశ్వసించి దైవారాధన చేయాలని ప్రబోధించారు. కాబట్టి ఈ ఇస్లామీయ సందేశ ఉద్యమం కూడా ఆ విధానాన్నే అవలంబిస్తుంది. అది ఎలాంటి హెచ్చుతగ్గులు లేకుండా, అరమరికలు లేకుండా, అనవసర ఉపోద్ఘాతాలు లేకుండా దైవదాసులకు దైవాన్ని ఆరాధించమని సూటిగా సందేశమిస్తుంది. దైవ ప్రసన్నతను, పరలోక సాఫల్యాన్ని తన జీవిత లక్ష్యంగా పెట్టుకోవాలని ప్రబోధిస్తుంది. ఈ సందేశ విధానం ప్రవక్తలు అవలంబించిన విధానమవటం చేత ఆచరించడం మాత్రమే కాదు, ఈ సందేశ ఆశయ ప్రాప్తికి ఇదే సహజ విధానం అవటం వల్ల కూడా దీని ఆవశ్యకత ఉంది.

## సూత్రప్రాయమైన పద్ధతులు

ఈ ఉద్యమం తన సందేశ పరిచయం కోసం అవలంబించిన మూల సూత్రాలకు సరోవరం దివ్యఖుర్ఆన్ – ముఖ్యంగా ఖుర్ఆన్‌లోని ఈ వాక్యం.

> **"ప్రవక్తా! నీ ప్రభువు మార్గం వైపునకు ఆహ్వానించు, వివేకంతో చక్కని హితబోధతో, ప్రజలతో ఉత్తమోత్తమమైన రీతిలో వాదించు."**

***(అన్ నహ్ల్ :125)***

ఈ ఖుర్ఆన్ వాక్యంలో ధర్మప్రచార విధానం చాలా స్పష్టంగా, సంక్షిప్తంగా వివరించబడింది. ఇందులో దైవదాసులను దైవారాధన వైపు పిలువడానికి మూడు సూత్రప్రాయమైన అంశాలు నిర్ధారించబడ్డాయి. (1) వివేకవంతమైన విధానం, (2) హితబోధనా విధానం, (3) ఉత్తమ వాదనా విధానం.

'వివేక'మంటే ఖచ్చితమైన మాట. దీని అర్థమేమిటంటే చెప్పిన మాట ప్రామాణికమైనదిగా, సమంజసమైనదిగా, సంతృప్త పరిచేదిలా ఉండాలి.

'హితబోధ' అంటే మంచి ఉపదేశం. మంచి ఉపదేశమంటే, చిత్తశుద్ధితో, కేవలం దైవ ప్రసన్నత కోసం చేసే ఉపదేశం, అందులో ఆర్ధ్రత ఉట్టిపడాలి. శ్రేయోభిలాష తొణకిసలాడాలి. అది ప్రభావవంతంగా, హృదయాలకు హత్తుకు పోయేలా ఉండాలి.

'ఉత్తమ వాదన' అంటే సంయమనంతో వాదించడం, సంస్కారవంతంగా సంబోధించడం, సందేశ లక్ష్యాన్ని సాధించడానికి అనువుగా తగిన సాక్ష్యాలతో, ఆధారాలతో చర్చించడం, ప్రశాంత వదనంతో, హుందాగా, మంచి భాషా ప్రావీణ్యతతో, ఆకట్టుకునే నిరూపణలతో ప్రభావితం చేసే మధుర సంభాషణతో తర్కించడం. మంకుపట్టు, ఆవేశం, ఎత్తిపొడుపులు, మనోవేదనకు గురిచేయడం ఏమాత్రం ఉండకూడదు.

సందేశపు ఈ మూడు విధానాలు వాస్తవంగా మూడు కోవలకు చెందిన మనుషులను దృష్టిలో ఉంచుకొని రూపొందించబడ్డాయి. మొదటి విధానం ముస్లిమేతరులకు సందేశం అందించడానికి, రెండవ విధానం స్వయంగా ముస్లింల కొరకు మరియు మూడవ విధానం ముఖ్యంగా తర్కించడానికి, వాదించడానికి ముందుకు వచ్చే ముస్లిమేతరుల కొరకు. ఈ విధంగా ఈ సూక్తి సందేశ విధానాన్ని క్షుణ్ణంగా వివరిస్తుంది. ఎవరితో ఏ విధానాన్ని అవలంబించాలో విడమర్చి తెలియపరుస్తుంది. ఈ దైవాదేశం ప్రకారం 'ఇస్లామీయ ఉద్యమం' తన సందేశ పరిచయం కోసం కొన్ని మౌలిక విధానాలకు కట్టుబడి ఉంది. ఆ విధానాల ప్రాముఖ్యతను మన మేధస్సు కూడా పూర్తిగా అంగీకరిస్తుంది. వాటి విశ్లేషణ ఇది:

1) ముస్లిమేతరులను వివేకంతో, తిరుగులేని ప్రామాణిక ఆధారాలతో సందేశమిస్తుంది. సత్యధర్మం వైపు ప్రభావవంతమైన హృదయాలకు హత్తుకు పోయే నిరూపణలతో పిలుపునిస్తుంది. ఎందుకంటే వారికి ఇస్లాం పరిజ్ఞాన ముండదు. వారు అసత్యవిధానాలను, ఆచారాలను విశ్వసిస్తారు. వారి ఆచారాలు విశ్వాసాలు అసత్యమైనవని, ఇస్లాం విధానాలు విశ్వాసాలు సత్యమైనవని వారికి వివరంగా తెలియజేయనంతవరకు వారు తమ విశ్వాసాలను త్యజించి ఇస్లాం

సత్యవిధానాలను అవలంబించరు. తగిన నిరూపణలతో ఈ కార్యాన్ని సాధించగలము అనడంలో ఏమాత్రం సందేహంలేదు. ప్రధమంగా అది ఇస్లాం మౌలిక ఉపదేశాలను, దేవుని ఏకత్వాన్ని, పరలోక జీవితాన్ని, దైవ దౌత్యాన్ని ప్రామాణిక ఆధారాలతో సత్యమైనవని నిరూపిస్తుంది. తరువాత అది ప్రామాణిక ఆధారాలతోనే ముస్లిమేతరుల్లలో తాతముత్తాతల నుండి వస్తున్న దురాచారాలను అసమంజసమైనవిగా, అసత్యమైనవిగా నిరూపిస్తుంది. మరియు సత్యధర్మ ఆచరణవల్ల కలిగే సత్ఫలితాలు, అసత్య విధానాలవల్ల కలిగే దుష్ఫలితాలను వారికి వివరిస్తుంది. అలా ఇస్లాం ధర్మ స్వీకారం కోసం వారిని సమాయత్తపరుస్తుంది. ఇదే దీని సందేశ విధానం. నిస్సందేహంగా తన సందేశ ప్రచారంలో సమయస్ఫూర్తి ఉండాలి. ఎవరికి సందేశమిస్తున్నామో అతని మనస్తత్వం, ఆలోచనాతీరును దృష్టిలో ఉంచుకొని చర్చిస్తుంది.

2) ముస్లింలకు తన సందేశాన్ని చేరవేయడానికి, వారిని దైవమార్గం వైపునకు ఆహ్వానించడానికి ఈ ఉద్యమం ప్రముఖంగా 'హితబోధనా విధానాన్ని' అవలంబిస్తుంది. ఇస్లాం ధర్మమే నిజమని నిరూపించటానికి అవలంబించిన విధానాన్ని ఇక్కడ అనుసరించదు. ఎందుకంటే ముస్లింల ఆలోచనా తీరు ఇతరులకంటే భిన్నమైనది. కాబట్టి వారిని ఇతరులను సంబోధించినట్లు సంబోధించడం సరియైనది కాదు. అది సమంజసమైన వివేకవంతమైన విధానం కూడా కాజాలదు. ముస్లింలు ఇస్లాం తిరస్కారులు కారు. ఇస్లాం పట్ల వారికి అవగాహన ఉంది. అందువల్ల వారిని ఈ ధర్మాన్ని స్వీకరించమని ఆహ్వానించడం గాని, దేవుని ఏకత్వాన్ని, దైవదౌత్యాన్ని విశ్వసించమని ప్రబోధించడంగాని ఇస్లామీ జీవన విధానం సత్యమైనదని వారి ముందు నిరూపించడంగాని సరియైన పద్ధతికాదు. వారిని దైవమార్గం వైపునకు పిలువడానికి కారణం; వారు ఈ మార్గాన్ని సత్యమార్గమని నమ్మరని కాదు. ఇది సత్యమైనదని పుణ్యప్రదాయిని అని నమ్మినా, బలహీన విశ్వాసంవల్లనో, అవివేకం అజ్ఞానం వల్లనో అప్పు డప్పుడు ఈ మార్గం నుండి దూరమైపోతుంటారు. కాబట్టి వారిని దైవమార్గం వైపు పిలువడం ముస్లిమేతరులను పిలువడం వంటిది కాదు. కేవలం వారిలో

నిద్రాణమై ఉన్న ధర్మ జిజ్ఞాసను మేల్కొలపడానికి, బలహీన విశ్వాసాన్ని తేజోవంతం చేయడానికి, ఏమరుపాటుతనాన్ని దూరం చేయడానికి, దైవ సంస్మరణ, మరణానంతర జీవిత చింతన రగుల్కొల్పడానికి, సదాచారానికి ప్రేరేపించి దురాచారపు దుష్ఫలితాలను తెలియపర్చడానికి వారిని సంబోధించ వలసి వస్తుంది. ఇదంతా ప్రేమానురాగాలతో, చిత్తశుద్ధితో, దైవప్రసన్నత పొందే ఆకాంక్షతో చేయాలి. తద్వారా సంబోధన హృదయాలలో నాటుకుపోవాలి. ఈ విధానాన్నే 'హితబోధనా విధానం' అంటారు. ఇస్లామీయ ఉద్యమం ముస్లింల విషయంలో అనుసరించిన మౌలిక విధానం ఇదే. కాబట్టి ముస్లింలతో అది కాంక్షించేది క్లుప్తంగా ఏమిటంటే – "మిమ్మల్ని మీరు ముస్లింలుగా చెప్పుకుంటు న్నారు, కాబట్టి నిజమైన ముస్లింలుగానే మిమ్మల్ని తీర్చిదిద్దుకోండి. పూర్తిగా అల్లాహ్ దాస్యానికి అంకితమైపోండి. అతని ప్రవక్త(స) విధానాన్ని బేషరతుగా అవలంబించండి. విశ్వాసంలో, ఆచరణలో సారూప్యత కల్పించండి. మీ నడవడికను సరిదిద్దుకోండి. ప్రపంచంలోనున్న జాతులన్నింటిలో ఇస్లాం నిజ సందేశహరులుగా, సత్యధర్మ సాక్షులుగా పుణ్యకార్యాలకు ప్రతీకగా సత్యసంధత స్వరూపులుగా , స్థాపకులుగా జీవించండి. ఇదే మీరు అవలంబించవలసిన సరియైన విధానం. ఇదే మీ జీవన పరమార్థం. దీనిపైనే మీ పరలోక సాఫల్యం, ఇహలోక సౌభాగ్యం ఆధారపడి ఉంది."

ఇక్కడ ఒక విషయాన్ని తెలియపర్చవలసి ఉంది. అదేమిటంటే: ఇస్లామీయ ఉద్యమ ప్రయత్నాలన్నీ దీన్-షరీఅత్‌కు చెందిన మౌలిక విషయాలు మరియు అవి వాంఛించే అంశాలపైనే కేంద్రీకరించబడి ఉంటాయి. ఆదేశాలపై విశ్లేషణ లను, పాక్షిక విషయాలను లేవనెత్తటం, ముఖ్యంగా వివాదాస్పద అంశాల జోలికి అది వెళ్ళదు. ప్రశస్తమైన ఈ విధానంలో దాగివున్న వివేకము, ఔచిత్యాల గురించి వేరుగా చెప్పనవసరంలేదు. వాస్తవంగా సంపూర్ణమైన, సరియైన ధర్మ ఆచరణ దాని మౌలిక సిద్ధాంతాల ఖచ్చిత పరిజ్ఞానం, విశ్వాసం పైనే ఆధార పడివుంది. ఈ పరిజ్ఞానాన్ని పొంది ఆచరించినప్పుడే షరీఅత్ (ధర్మశాస్త్రం)లోని విశ్లేషణాత్మక ఆదేశాలను అనుసరించే మార్గం అతనికి సుగమమవుతుంది.

అందువల్లనే వివేకము, ధార్మిక దృష్టికోణం సందేశ నైపుణ్యాల దృష్ట్యా ప్రప్రథమంగా ప్రాథమిక విషయాలపైనే దృష్టి సారించడం అవసరం.

3) మూడవది "ఉత్తమ వాదనా విధానం". సందేశ ప్రచార సందర్భంలో ఒక వ్యక్తి వాదోపవాదానికి దిగినప్పుడు, ధర్మసందేశాన్ని, దాని ప్రామాణికతను తప్పని వాదిస్తున్నప్పుడు ఈ 'ఉత్తమ వాదనా విధానం' అవసరమేర్పడుతుంది. ఇలాంటి సందర్భాలు తరచుగా ఎదురౌతున్నాయన్న విషయం అందరికీ తెలిసిందే. ఎందుకంటే తాతముత్తాతల కాలం నుండి తమ మదిలో నాటుకొనిపోయి ఉన్న నమ్మకాలను, ఆచారాలను తప్పు అని తక్షణం తెలుసుకొని ఇతర ధర్మాన్ని సత్యమైనదని అంగీకరించడం సామాన్య వ్యక్తికి సాధ్యపడే విషయం కాదు. అందుకే ఈ సందేశాన్ని అందించడానికి ఎంతటి సమంజసమైన, ప్రామాణికమైన, ప్రభావవంతమైన విధానాన్ని అవలంబించి నప్పటికీ దానికి వ్యతిరేకంగా వాదోపవాదాలు, వ్యతిరేకత ఎదురవడానికి ఎప్పుడూ ఆస్కారముంటుంది. అలాంటి పరిస్థితి ఉత్పన్నమైన ప్పుడు ధర్మ బోధకులు వారి లాగానే వివేకాన్ని కోల్పోయి వాదోపవాదాలకు, పిడివాదానికి దిగడం సమంజసం కాదు. అంతేకాదు, సందేశ బాధ్యత పూర్తయిందని, ఇక ఆ వ్యక్తి స్వీకరించకపోతే మాకేమిటి అని మిన్నకుండి పోవడం, తిరిగి ఆ వ్యక్తిని సమాధానపర్చడానికి, సరియైన అవగాహన కల్పించడానికి యత్నించక పోవడం కూడా సమంజసమైన విధానం కాదు. ఎందుకంటే అది ధర్మప్రచార విధానానికి పూర్తిగా విరుద్ధమైనది. ఈ ధోరణి మానవ మస్తిష్కాన్ని, హృదయాలను ప్రభావితం చేయజాలదు. ఇంకా దూరం చేస్తుంది. రెండవది తప్పుడు వైఖరి. అసమంజసమైనది. ఎందుకంటే తమపై వున్న ప్రచార బాధ్యతలనుండి పలాయనం చిత్తగించడం లేదా సందేశ బాధ్యతల పట్ల సరియైన పరిజ్ఞానం లేకపోవడం దానికి కారణం. నిజవైఖరి ఏమిటంటే ఎదుటి వ్యక్తి మాటలను, వాదనలను సహనంతో, ఏకాగ్రతతో ఆలంకించాలి. అతని మదిలో మెదలుతున్న సందేహాలను పసిగట్టడానికి ప్రయత్నించాలి. వాటిని నివృత్తి చేయడానికి సరియైన, సమంజసమైన విధానాన్ని అవలంబించాలి. ఎదుటి వ్యక్తి వాదనలో

ఆవేశం, అహంకారం, మనసుని గాయపర్చే విషయాలుంటే హుందాగా వాటిని ఉపేక్షించాలి. అతడు తన నమ్మకాలను సరియైనవిగా నిరూపించుటకు కొన్ని తార్కాణాలు పేర్కొంటాడు. వాస్తవంగా అవి అసత్య విశ్వాసాలకు విధానాలకు సంబంధించినవి కాబట్టి ప్రామాణికంగా అవి కూడా పేలవంగా పసలేనివిగానే ఉంటాయి. వాటన్నింటిలో ఉద్యమకారులు ప్రామాణికమైన, ఖచ్చితమైన తార్కాణాలతో తప్పని నిరూ పించాలి. వాదన తీరు కూడా సాధ్యమైనంతవరకు ప్రశాంతంగా, గంభీరంగా, మనసులను ప్రభావితం చేసేదిలా ఉండాలి. దైవప్రీతి కోసం సానుభూతి, సదుద్దేశాలతో, శ్రేయోభిలాషతో ఈ కార్యాన్ని నెరవేర్చాలి. ఎలాగైనా నచ్చజెప్ప డానికి ఎదుటివారి హృదయాలను జయించడానికి సకల యత్నాలు చేయాలి. ఈ కార్యసాధనకు అవసరమైన విధానాలను అవలంబించాలి. అవరోధంగా నిలిచిన ఎదుటివారిని దూరం చేసే ఎలాంటి విధానాన్నీ అవలంబించకూడదు. ఈ వాదోపవాదాలు తర్జనభర్జనలనే 'ఉత్తమ వాదనా విధానం' అంటారు. దీనినే అవలంబించాలని ఖుర్ఆన్ చెబుతోంది. దీనినే ఇస్లామీయ ఉద్యమం కూడా తన మౌలిక విధానంగా రూపొందించుకుంది.

ఎదుటివారికి సందేశ వాస్తవికత ప్రస్ఫుటం అయ్యేంతవరకు 'ఉత్తమ వాదనా విధానాన్ని' అవలంబిస్తూనే ఉండాలి లేదా ఆ వ్యక్తి తన వాదనలో సరియైన తార్కాణాలు ఇవ్వడంలో విఫలమై అడ్డగోలుగా వ్యవహరించేంతవరకు, పిడివాదము 'మంకుపట్టు' ఆత్మాభిమానం అహంకారానికి లోనై హేయమైన స్థితికి దిగజారనంతవరకు ఈ విధానాన్ని అవలంబిస్తూ ఉండాలి. మొదటి విధానంలో సందేశహరుని ఆశయం నెరవేరుతుంది. కానీ రెండవ విధానంలో వాదోపవాదాలను కొనసాగించడంలో ఎలాంటి ప్రయోజనం ఉండదు. కాబట్టి సమంజసత్వం, దైవ సందేశ హుందాతనం దృష్ట్యా 'మేము మూర్ఖుల విధానాన్ని అవలంబించం" అని చెప్పి వాదనలను విరమించుకోవాలి.

**ప్రయోజనకర విధానం:**

ఇంతకు ముందు వివరించిన సిసలైన సందేశ విధానం ఏమిటంటే:

ఎదుటి వ్యక్తిముందు అతని సామర్థ్యాన్నిబట్టి వివేకంతో, మృదు సంభాషణతో ఇస్లాం మూల సిద్ధాంతాలను, విధానాలను స్పష్టంగా సూటిగా పరిచయం చేయాలి. వాటిని అతని మస్తిష్కంలో ప్రతిష్ఠించడానికి ప్రయత్నించాలి. చివరికి సందేశం వాస్తవ దృక్పథంతో, సంపూర్ణ స్వరూపంలో అతనికి అవగతమవ్వాలి. అతను పరలోక జీవిత సాఫల్యమే తన జీవిత లక్ష్యంగా ఎంచాలి. అయితే మానవ ఆలోచనలకు కూడా కొన్ని పరిమితులుంటాయి. వినాయింపు లుంటాయి. ఇస్లామీయ ఉద్యమం కూడా దానిని గుర్తించి విజ్ఞతతో వ్యవహరిం చాలి. మతాలు, విశ్వాసాల స్థానంలో వాదాలు, ప్రతివాదాలు, యిజాలు, సిద్ధాం తాలు ఆక్రమించిన కాలమిది. ఈ పరిస్థితుల్లో ఎదుటివ్యక్తి ఆలోచనా తీరు ఒక పెద్ద సమస్యగా తయారైంది. ఈనాడు ఆధునిక విద్యావేత్తలు, మేధావులలోని అధిక సంఖ్యాకులు ఏ ఉద్యమాన్నైనా అది సరియైనదా కాదా అని పరీక్షించ దలచుకుంటే మొదట దాని ఆలనాపాలనా సామర్థ్యాన్ని చూస్తారు. ఏ జీవన వ్యవస్థ గురించి అయినా ఒక అభిప్రాయానికి రావడానికి ముందు "ప్రపంచ సామాజిక, ఆర్థిక, రాజకీయ సమస్యలను అది ఎలా పరిష్కరిస్తుంది? జీవితపు క్లిష్ట సమస్యలను అది విజయవంతంగా ఎలా పరిష్కరించగల్గుతుంది? అని ప్రశ్నిస్తారు. కాని వారి ముందు దైవం, అంతిమ దినం, ప్రవక్తల గురించి ప్రస్తావించడానికి ప్రయత్నిస్తే కనీసం వినడానికి కూడా వారు సిద్ధపడరు. కాని వారి ప్రాపంచిక సమస్యలకు చక్కని పరిష్కారం ఈ ధర్మం, ఈ ఉద్యమం వద్ద ఉందని విశదపర్చినప్పుడే వారు మీ మాటలను వినడానికి సిద్ధపడతారు. ఇది తప్పుడు ఆలోచనా విధానం. ప్రమాదకరమైన పోకడ. దానికి వారు అలవాటుపడ్డారు. అంతమాత్రాన ఆ దైవదాసులను దైవసందేశానికి అనర్హులుగా భావించలేం. ఒక ఇస్లామీ ఉద్యమం మానసిక రుగ్మతలను నయం చేయడానికి, తప్పుడు ఆలోచనా విధానాన్ని సరిదిద్దడానికి, మానవాళిని వక్రమార్గాల నుండి రక్షించి శ్రేయస్కర మార్గంవైపు నడపడానికి ఉనికిలోకి వస్తుంది. అది కేవలం సన్మార్గగాములనే వెతుకుతూ ఉండదు. మార్గవిహీనులను సన్మార్గగాములుగా చేయడానికి ప్రయత్నిస్తుంది. కాబట్టి ఈ ఉద్యమం కూడా అలాంటివారికి

సందేశమివ్వకుండా విడిచిపెట్టరు. వారి సమస్యలను కూడా చర్చించాలి. వాటినే వారు మానవుల అసలు సమస్యగా పరిగణిస్తారు. వాటి పరిష్కార మార్గాన్ని చూపిస్తూనే తమ సత్యసందేశాన్ని మానవ జీవితం యొక్క అసలు సమస్య ఏమిటో తెలియపర్చాలి. ఈ విధానం విజ్ఞతతో కూడుకున్నదే కాదు, ప్రవక్తలు ఆచరించిన విధానం కూడా ఇదే అని మనకు అవగతమవుతుంది. దివ్య ఖుర్‌ఆన్‌లో దైవప్రవక్తల సందేశప్రచారం దాని విధివిధానాల గురించి వచ్చిన ప్రస్తావన ద్వారా మనకు తెలిసేది ఏమిటంటే: వారు సందేశ ప్రారంభం "అనియ్‌బుదుల్లాహ్" (మీరు అల్లాహ్‌నే ఆరాధించండి) అనే పిలుపుతోనే చేసేవారు. తమ శక్తిసామర్థ్యాలు పూర్తిగా దేవుని ఏకత్వం, అంతిమ దినం మొదలైన మౌలిక విశ్వాసాలపైనే కేంద్రీకరించారు. అంతేకాదు, ఇహ లోకంలోనూ పరలోకంలోనూ తమ సందేశ వాస్తవికత, ఆవశ్యకత, ప్రాధాన్యత తెలియపర్చుతూ ఇలా సంబోధించారు : "ఒకవేళ మీరు ఈ సత్యవచనాన్ని (కలిమా) విశ్వసించినట్లయితే మీ పరలోక జీవితమేకాదు, ప్రాపంచిక జీవితం కూడా చక్కబడుతుంది. గౌరవమర్యాదలు మీ పాదాక్రాంతమవుతాయి. ఆకాశాన్నుండి కూడా కారుణ్యాలు వర్షిస్తాయి. భువి నుండి కూడా ఆహారం ఉబికి వస్తుంది." (ఉదాహరణకు సూరె మాయిదా వాక్యం 66 మరియు సూరె నూహ్ వాక్యాలు 11,12 చూడండి)

ఎదుటివారి మనస్తత్వాన్ని దృష్టిలో ఉంచుకొని ఇలా ప్రబోధించడం జరిగింది. వారి మనస్తత్వం ప్రపంచ సౌఖ్యాలను కాంక్షించే మనస్తత్వం. వారు ఒక విషయాన్ని సత్యమైనదో అసత్యమైనదో తేల్చడానికి, అంగీకార యోగ్యమా కాదా అని చెప్పడానికి ముందు దానివల్ల కలిగే ప్రాపంచిక లాభనష్టాలను తప్పకుండా బేరీజు వేసేవారు. అలాంటి మనస్తత్వమే నేడు కూడా ప్రబలి పోయింది. ఎంతగా ప్రబలిపోయిందంటే ధార్మికతకి అందులో తావులేకుండా పోయింది. ప్రాపంచిక వ్యవహారాలు వారి అభిరుచికి ఆలవాలమైనాయి. ఇంతకు ముందు తరాల వారిలో ఇలా ఉండేదికాదు. వారు బహుదైవారాధన, దైవ నిరాకరణలో ఎంతగా కూరుకుపోయి ఉన్నా ఏదో ఒక రూపంలో మత

విలువలను పాటించేవారు. కాబట్టి ఇప్పుడు ప్రపంచ వ్యామోహ మనస్తత్వం గలవారితో వ్యవహరించవలసిన విధానంలో కూడా తప్పకుండా మార్పు రావాలి.

గత విధానం ఏమిటంటే, ప్రజలకు ముందుగా అసలైన ధర్మం దాని మౌలిక విశ్వాసాలను ప్రామాణికంగా రుజువు చేసిన తర్వాత ప్రాపంచిక ప్రయోజనాలకు కూడా విశదీకరించడం జరిగేది. కాని ఇప్పుడు మాత్రం సందేశ ప్రచార ఆరంభంలోనే "ఈ ధర్మం ప్రాపంచిక సమస్యలను అందరికంటే చక్కగా పరిష్కరిస్తుందని" తెలియపర్చాలి. దాని తర్వాత క్రమంగా అసలు సందేశాన్ని వారి హృదయంలో పొందుపర్చాలి. ఈ విధానం కూడా నిస్సందేహంగా ప్రవక్తల విధానమే. అయితే ఈ ఉద్యమం, వాస్తవాలు ప్రాధాన్యతలు తారుమారు కాకుండా జాగ్రత్త వహిస్తుంది. ఈ విధానంవల్ల ఎదుటివ్యక్తి ఉద్యమానికి చేరువైనప్పటికీ, దాని అసలు లక్ష్యం కేవలం ప్రాపంచిక సమస్యల పరిష్కారం, సామాజిక, ఆర్థిక, రాజకీయ ప్రగతియే అని అపార్థానికి గురికాడదు. ఏ ఉద్యమమైనా మానవ మేధస్సును పూర్తిగా ప్రభావితం చేయాలంటే దాని మౌలిక విధానాలు వాస్తవ లక్ష్యం పూర్తిగా ఒక వ్యక్తికి అవగతమైపోవాలి. మరే విషయం దాని నిజస్వరూపాన్ని విధానాలను ప్రభావితం చేయకూడదు. కాబట్టి కొన్ని పరిస్థితుల్లో ఇస్లామీయ ఉద్యమం తన సందేశాన్ని అందజేసేటప్పుడు ప్రయోజనకరమైన విధానాన్ని అవలంబిస్తుందంటే అది కేవలం సందర్భానుసారమే. ఎదుటి వ్యక్తి యొక్క ప్రాపంచిక సమస్యలను చక్కగా పరిష్కరించడమే ఈ ఉద్యమ ప్రత్యేకత, ప్రధాన లక్ష్యమని పొరబడకుండా జాగ్రత్త వహిస్తుంది. ప్రాపంచిక సమస్యల పగిష్కారమైనా, ఇహలోక జీవిత సాఫల్యమైనా ఈ ఉద్యమం ఒక వ్యక్తికి ఇచ్చే చిరు కానుకలు మాత్రమే! అది ప్రసాదించే అసలు కానుక అంతిమ దినపు అనంత సాఫల్యం అని ఆ వ్యక్తికి విశదపర్చాలి. ఇలా ఆ వ్యక్తి పూర్తి అవగాహనతో, సరియైన దృక్పథంలో ఉద్యమానికి దగ్గరయ్యేందుకు వీలు కలుగుతుంది.

# కార్యాచరణ విధానం

## ఆచరణా విధాన ప్రాముఖ్యత

ఏ ఉద్యమం అయినాసరే లక్ష్యం- ఆశయం తర్వాత అధిక ప్రాధాన్యత దాని కార్యాచరణ విధానానికి ఉంటుంది. ఈ కార్యాచరణ విధానం దాని లక్ష్యానికి- ఆశయానికి అనువుగా లేకపోయినట్లయితే ఉద్యమ ప్రగతి ఆగిపోతుంది. చూడటానికి అది ముందుకు సాగినట్లే అనిపిస్తుంది కాని అలా ముందుకు వెళ్ళేమార్గం 'దైవ గృహం కాబా'కు బదులు ఏ టర్కీ వైపుకో ఉంటుంది. అందువల్లనే ప్రజలు ఉద్యమ లక్ష్యాలను గూర్చి ఒక అభిప్రాయానికి రావడానికి దాని కార్యాచరణ విధానాన్ని తప్పకుండా చూస్తారు. అది ప్రకటించే లక్ష్యాలకు అనుగుణంగా కార్యాచరణ విధానం ఉంటేనే వాటిని అంగీకరిస్తారు. కాబట్టి లక్ష్యాన్ని బట్టి కార్యాచరణ విధానాన్ని రూపొందించుకోవటం అత్యంతా వశ్యకం. రండి! ఇస్లామీయ ఉద్యమం ఈ ఆవశ్యకతను ఎంతవరకు పరిగణన లోకి తీసుకుందో, తన లక్ష్యసాధనకు అది అవలంబించిన విధాన మేమిటో, అది దాని ఆశయాలతో స్వాభావికంగా ఏమేరకు సమన్వయం చెందుతుందో పరిశీలించుదాం.

## కార్యాచరణకు పునాది దివ్యఖుర్ఆన్- ప్రవక్త విధానం

ఇస్లామీయ ఉద్యమం తన ఆచరణా విధానాన్ని నిర్ధారించుకోవడానికి పరిగణనలోకి తీసుకున్న విషయాలన్నింటిలోకి అతి విశిష్ఠమైన తిరుగులేని ప్రాధాన్యత రెండు విషయాలకుంది. ఒకటి: దివ్యఖుర్ఆన్ ఆదేశాలు, రెండవది: ముహమ్మద్ ప్రవక్త (స) సంప్రదాయం. గత ప్రవక్తల జీవిత విధానాలు. ఈ

రెండు విధానాలపై క్రమబద్ధ ఆచరణే ఇస్లామీయ ఉద్యమ సంపూర్ణ కార్యాచరణ విధానమని ఖచ్చితంగా చెప్పవచ్చు. మిగిలిన విషయాలది దాని తదుపరి స్థానం మాత్రమే. కాబట్టి దాని నిబంధనావళిలో ఆచరణా విధాన ప్రస్తావన ఈ పదజాలంతో చేయబడింది.

"దివ్యఖుర్ఆన్, ప్రవక్త సంప్రదాయం జమాఅత్‌కు (ఇస్లామీయ ఉద్యమానికి) ప్రాతిపదికలు; ఇతర విషయాలన్నీ క్రిందిస్థాయిలో, ఖుర్ఆన్, ప్రవక్త సంప్రదాయం రీత్యా అవకాశం ఉన్నంతమేరకే దృష్టిలో ఉంటాయి." (అధికరణ:5(1))

ఈ పదాలు తమ భావవ్యక్తీకరణలో చాలా స్పష్టంగా ఉన్నాయి. దివ్యఖుర్ఆన్, ప్రవక్త సంప్రదాయం జమాఅత్‌కు ప్రాతిపదికలు అని చెప్పిన తర్వాత ఈ ఉద్యమ సారథ్యం సంపూర్ణంగా ఈ రెండు విధానాల హస్తగతమై ఉన్నాయని, ఉంటాయనీ అందరికీ తెలిసిపోతుంది. దీని ఆచరణా విధానంలో దైవ గ్రంథం నుండి, లేదా దైవప్రవక్త విధానం నుండి అనుమతి లభించని విషయాలకు స్థానమే ఉండదు. అవి ఎంత ప్రాచుర్యం పొందినా, ప్రశస్తమైనవిగా స్తుతించబడినాసరే! ఎట్టి స్థితిలోనూ ఈ ఉద్యమం ఖుర్ఆన్, ప్రవక్త సంప్రదాయం నిర్దేశించిన ఆదేశాలకు విరుద్ధం కాని విధానాలపై ముందుకు సాగుతుంది. ఇది ఒక ఇస్లామీయ ఉద్యమం కావడంవల్ల దీని ఆశయం వేరితరుల ఆలోచనా విధానం ప్రకారం కాకుండా కేవలం ఖుర్ఆన్, ప్రవక్త సంప్రదాయాల ప్రకారం నిర్దేశించబడగా, దాని కార్యాచరణ విధానం కూడా తప్పకుండా ఖుర్ఆన్-ప్రవక్త సంప్రదాయం ప్రకారమే నిర్దేశించబడటం, వివేకవంతమైన, హేతుబద్ధమైన విషయం. ఖుర్ఆన్, ప్రవక్త సంప్రదాయాలకు మారుపేరే 'ఇస్లాం'! కాబట్టి ఏ కార్యాచరణ విధానమైనా నిజంగా ఇస్లాం ప్రకారం ఉండాలంటే ఖుర్ఆన్-ప్రవక్త సంప్రదాయాలను పరిగణనలోకి తీసుకోకతప్పదు. ముఖ్యంగా ఇస్లాంకి చెందిన ఒక చిన్న కార్యాన్ని కాకుండా సంపూర్ణ ఇస్లాంను స్థాపించడానికి చేపట్టిన మహోన్నత కార్యంలో పై విధానం తప్ప మరో విధానాన్ని ఊహించనైనా లేము. దైవగ్రంథం స్వతహాగా ఇస్లామీయ ఉద్యమ గ్రంథం. ఆచరించడానికి అనువుగా సందర్భానుసారం కొద్దికొద్దిగా అవతరించింది. కాబట్టి అందులో

పొందుపర్చిన విధానాలకంటే విశిష్ఠమైన విధానాలు మరొకటి లేనేలేవు. అలాంటి స్థానమే ముహమ్మద్ ప్రవక్త (స) సంప్రదాయం మరియు ఇతర ప్రవక్తల జీవిత విధానాలది. అదే ధర్మసందేశానికి స్వచ్ఛమైన ఆచరణా విధానం. కాబట్టి ఇస్లాం సందేశ విధానాన్ని తెలుసుకోవడానికి ఆ ధర్మ నిజ సందేశ హరులు, ధ్వజవాహకులైన ప్రవక్తల విధివిధానాలను తెలుసుకోవడం ఎంతో అవసరం. అవే మనకు ఖచ్చితంగా సరిపోతాయి. ఈ విధంగా సందేశ విధానపు రూపురేఖలు ముందే నిర్దేశించబడ్డాయి. స్వీకరించబడ్డాయి. వాటిని తిరిగి నిర్ధారించే అవసరం ఎంతమాత్రం లేదు.

చూడడానికి ఇదొక జటిలమైన, జడత్వంతో కూడిన ఆలోచనా ధోరణిలా గోచరిస్తుంది. కాని వాస్తవంగా అలాంటిదేమీ లేదు. వ్యవహారం మరో ఉద్యమానిదైతే అది నిస్సందేహంగా అదే అయ్యేదేమో! కాని ఇస్లామీయ ఉద్యమాన్ని ఇతర ఉద్యమాలతో పోల్చడానికి వీల్లేదు. ఇతర ఉద్యమాలకు చెందిన వేలాది సంవత్సరాల పురాతన విధివిధానాలు తప్పకుండా నిర్వీర్యమై చచ్చుబడిపోవచ్చు. కాని ఇస్లామీయ ఉద్యమాలకు వాటి పురాతన విధానాలే ఒక ప్రేరణ, ఒక శక్తి, ఒక జీవం లాంటివి. ఎందుకంటే ఈ ఉద్యమాల ఆశయం, వాటి నైజం, వాటి ఆకాంక్ష అన్ని చిరకాలంగా ఉన్న దైవప్రవక్తల సందేశ విధానాన్నే ఆచరించడానికి ప్రేరేపిస్తున్నాయి. అదే మానవ నైజానికి సరిపోయే విధానం. అందులోనే వారి జీవిత రహస్యం దాగివుంది. అదే వారిని చైతన్యవంతులుగా చేస్తుంది. సరియైన గమ్యానికి చేర్చుతుంది. కాబట్టి ఈనాటి ఇస్లామీయ సందేశ ఉద్యమానికి కూడా అదే ఒక సరికొత్త క్రియాశీల విధానం. దానిపైనే ఈ ఉద్యమ విజయం ఆధారపడి వుంది. కాబట్టి ఎలాంటి పరిస్థితుల్లోనైనా సరే ఆ విధానంపై నిలకడగా ఉండటం తప్పనిసరి.

## నీతి-నిజాయితీ తప్పనిసరి

ప్రాథమికమైన పై విషయాల తర్వాత మరో ముఖ్య విషయం నీతి నిజాయితీలను ఎట్టి పరిస్థితిలోనూ విడనాడకూడదనేది. దీనిని నిబంధనావళిలో స్పష్టంగా ఇలా వివరించడం జరిగింది.

**"జమాఅత్ తన కార్యకలాపాలన్నింటిలో నైతిక పరిధులకు కట్టుబడి ఉంటుంది. సత్యానికి నిజాయితీకి వ్యతిరేకమైన మతతత్వం, విద్వేషం, వర్గపోరాటం, భువిలో కల్లోలం (ఫసాద్ ఫిల్ అర్జ్)జనింపజేసే సాధనాలను, పద్ధతులను ఎన్నడూ వినియోగించదు.** ***(అధికరణ:5 (2)***

ఈ ఆంక్ష ఎందుకు అవసరమంటే, దివ్యఖుర్ఆన్-ప్రవక్త సంప్రదాయంలో దీన్ని గురించే గట్టిగా ప్రబోధించబడింది. ఈ ఉద్యమ నైజం కూడా దీనినే కాంక్షిస్తుంది. ఈ ఆయుధం ద్వారానే ఈ ఉద్యమం పోరాడగలదు. విస్తృతమైవున్న దాని వివిధ రంగాలలో విజయం సాధించగలదు. ఎందుకంటే తన గమ్యాన్ని చేరడానికి తప్పనిసరిగా ఏ శక్తులతో పోరాడవలసి వస్తుందో అవి ఆర్థికంగా, రాజకీయంగా శక్తివంతమైనవి. ప్రజామోదం పొందినవి. ప్రచార సాధనాలు వాటి అధీనంలో ఉన్నాయి. సకల భౌతిక సాధనాలు వారి హస్తగతమై వున్నాయి. కాని ఇస్లామీయ ఉద్యమం వద్ద వాటిలో నుండి ఏ ఒక్క సదుపాయమూ లేదు. అది కేవలం నీతినిజాయితీపైనే నిలబడి ఉంది. ఇలాంటి పరిస్థితిలో అది గనక నీతి నిజాయితీలను సహితం విడనాడినట్లయితే తన ప్రత్యర్థి వర్గాలతో అదెలా పోరు సాగించగలదు? పోరాడడం సంగతి అలా ఉంచితే ఆ స్థితిలో దాన్ని ఇస్లాం సందేశం లేదా ఉద్యమం అని చెప్పడం కూడా నామోషీ అవుతుంది. ప్రపంచంలో సత్యాన్ని, ధర్మాన్ని స్థాపించడమే తమ లక్ష్యంగా చేసుకున్నందు వల్ల అది ఒక ఇస్లామీయ ఉద్యమం అని పేరు పొందింది. అలాంటప్పుడు ఇది తన విధి విధానాలలో ఒకవేళ ఈ సత్యాన్ని, ధర్మాన్ని రోజురోజుకు మంటగలుపుతూపోతే అది మరే ఉద్యమమైనా కావచ్చు కానీ 'ఇస్లామీ సందేశ ఉద్యమం' మాత్రం ఎట్టి పరిస్థితుల్లోనూ కాజాలదు. ఈ వ్యవహారశైలి దాని వాదానికే కాదు, దాని ఉనికికే ప్రశ్నార్థకమవుతుంది.

ఈ తప్సీళ్ళ ద్వారా స్పష్టంగా అవగతమైపోతుంది - ఈ ఉద్యమం ఏ నైతిక నిబద్ధతకు, మరే నిజాయితీ తత్పరతకు కట్టుబడి ఉందో అది రాజకీయ అవసరాల దృష్ట్యా, తాత్కాలిక స్వప్రయోజనాల దృష్ట్యాకాదని. పైగా అది ధర్మ సంస్థాపన దృష్ట్యానే ఈ నిర్దిష్టమైన విధానాన్ని అవలంబిస్తుందని అర్థమవుతుంది. అందుచేత ఎన్నడూ ఈ మహదాశయాన్ని వెనక్కి నెట్టివేసే ప్రసక్తే ఉండదు.

## శాంతియుత, నిర్మాణాత్మక వైఖరి

ఉద్యమ మూడవ విధానమేమిటంటే, దాని కార్యక్రమాలన్నీ శాంతియుత పద్ధతిలో, నిర్మాణాత్మకంగా ఉంటాయి. విధ్వంసాలకు, ఉగ్రవాదానికి పూర్తిగా దూరంగా ఉంటుంది. కాబట్టి దాని నిబంధనావళిలో స్పష్టంగా ఇలా ప్రకటించబడింది:

> **"జమాఅత్ తన ధ్యేయసాధన కొరకు నిర్మాణాత్మకమైన, శాంతియుత మైన విధానాలు అనుసరిస్తుంది."** ***(అధికరణ: 5(3))***

ఈ విధానాన్ని అవలంబించడంలోని అవసరము, ఔచిత్యాన్ని దృష్టిలో ఉంచుకోవాలి. ఇస్లామీయ ఉద్యమ నైజాన్ని గుర్తించి, వాస్తవంగా దాని బాగోగులు ఏమిటో తెలిసిన వ్యక్తి శాంతియుత, నిర్మాణాత్మక విధానమే ఈ ఉద్యమ ప్రాథమిక ఆవశ్యకత అని, దాన్ని విడనాడితే సాఫల్యం పొందే మార్గం సుగమం కాజాలదని తప్పకుండా గ్రహిస్తాడు. ఎందుకంటే మానవ శరీరాలపై బలవంతంగా చలాయించే ఆధిపత్యంతో కాక అంతర్యాల అంగీకారంతో ఈ మార్గం సుగమమవుతుంది. ఈ అంగీకారం కేవలం వివేకంతో శాంతియుత, నిర్మాణాత్మక విధానం వల్లే సాధ్యమవుతుంది. ప్రశాంత వాతావరణం కూడా దీనికి అవసరం. అలాంటప్పుడు ఈ ఉద్యమం స్వయాన తానే శాంతియుత విధానం అవలంబించక, విచ్ఛిన్నకర లేదా దౌర్జన్యపూరిత విధానాలు అవలంబించినట్లయితే, అది తన చేజేతులా వాతావరణాన్ని విషపూరితం చేసినట్లే అవుతుంది. తన మార్గంలో తనే స్వయంగా ముళ్ళు పరుచుకున్నట్లవుతుంది. కాబట్టి ఇస్లామీయ ఉద్యమం తప్పకుండా శాంతియుత, నిర్మాణాత్మక విధానాలనే అవలంబించాలి.

కొందరు ప్రవక్తలు సందేశ పరిచయ కార్యంలో భాగంగా ధర్మ విరోధులతో యుద్ధాలు కూడా చేయవలసి వచ్చింది. అంతిమ ప్రవక్త ముహమ్మద్(స) కు కూడా ఈ ఘటనలు ఎదురయ్యాయి. "శాంతియుత నిర్మాణాత్మక" విధానం అవలంబించినప్పటికీ యుద్ధాలు కూడా తప్పనిసరి పరిస్థితుల్లో చేయవలసి వస్తుంది. కాని యదార్థంగా యుద్ధాలు చేయవలసిన అవసరం ఎల్లప్పుడూ ఉండదు. తప్పనిసరిగా ఒక సంక్లిష్ట పరిస్థితి ఎదురైనప్పుడు, యుద్ధం చేయడానికి

ఆవశ్యకమైన షరతులు పూర్తి అయినప్పుడు అలాంటి పరిస్థితి వస్తుంది. వైరిశక్తులు ఇస్లామీయ ఉద్యమానికి ఉన్న పనిచేసే హక్కును కాలరాసినప్పుడు దానికి వ్యతిరేకంగా హింసా దౌర్జన్యాలకు, విధ్వంసాలకు పాల్పడినప్పుడు ఈ అసాధారణ పరిస్థితి ఉత్పన్నమవుతుంది. ఇది కాక మరో ముఖ్యమైన నిర్దేశిత విధానం ఏమిటంటే, సందేశహరులు దేశ ప్రజల ముందు తమ సందేశాన్ని పూర్తిగా అందించిన తర్వాతగాని, లేదా పరిస్థితులు అనుకూలించకపోవడం వల్ల గాని సందేశహరులు మరో ప్రాంతానికి వలస పోవచ్చు. ఈ రెండు విధానాలను గమనించినట్లయితే భారత ఇస్లామీయ ఉద్యమ విధానం స్పష్టమైపోతుంది. అదేమిటంటే; ఈ ఉద్యమ కార్యక్రమాలు మొదటి నుండి చివరి వరకు శాంతియుతంగానే ఉంటాయి. యుద్ధఘట్టాలు దానికి ఎదురు కానేకావు. అదెలాగంటే, ఇక్కడి రాజ్యాంగం ప్రతి పౌరునికి తాను కోరిన మతాన్ని అవలంబించడానికే కాదు, దాన్ని ప్రచారం చేయడానికి, ఒక సంఘంగా ఏర్పడడానికి సంపూర్ణ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను ప్రసాదిస్తుంది. కాబట్టి ఇక్కడ ఈ విషయంలో ఇతర దేశాలకు వలస పోవడం, యుద్ధాలు పోరాటాలు చేయడం అనే ప్రసక్తే తలెత్తదు. అందుకే ఉద్యమ ఆరంభంలోనే ఈ ముఖ్య విషయాన్ని విశదీకరించడం జరిగింది. దైవసందేశంలో ప్రథమ ఘట్టం సందేశ ప్రచారానిది. రెండవది : హిజ్రత్ (ఇతర ప్రాంతాలకు వలస పోవడం). మూడవది : యుద్ధానిది అని తెలుపుతూ ఈ క్రింది విధంగా వివరణ ఇవ్వడం కూడా జరిగింది

'ప్రతి సందేశాన్ని విజయతీరాలకు చేర్చటానికి ఈ మూడు ఘట్టాలను దాటవలసిన అవసరం తప్పనిసరి కాదు. కాకపోతే, సర్వసాధారణంగా ఈ మూడు ఘట్టాలు ఎదురవుతాయి. కాని ఈనాటి ప్రజాస్వామిక వ్యవస్థలో మొదటి ఘట్టంలోనే సందేశం సఫలీకృతం కావచ్చు.(దావతే దీన్ పేజి-274)

**మతతత్వం- వర్గ సంఘర్షణలకు దూరం**

నాల్గవ విషయమేమిటంటే, ఉద్యమ కార్యాచరణలో విధ్వంసాలకు వినాశాలకు ఏమాత్రం స్థానం లేదు. అలాగే మతతత్వ ఉద్రిక్తతలు వర్గ పోరాటాలు

మరే ఇతర భావోద్రేకాలైనా ప్రబలిపోయే ఏ విధానాన్నీ అవలంబించరాదు. దాని నియమావళిలో స్పష్టంగా ఇలా తెలియపర్చబడింది:

**"సత్యానికి నిజాయితీకి వ్యతిరేకమైన, మత వైషమ్యం, వర్గ పోరాటం భువిలో కల్లోలం (ఫసాద్ ఫిల్ అర్జ్) జనింపజేసే సాధనాలను పద్ధతులను ఎన్నడూ వినియోగించదు." (అధికరణ: 5 (2))**

ఈ విధానాన్ని అవలంబించడానికి గల కారణాలు ఇంతకు ముందు వివరించబడ్డాయి. దేశప్రజల మధ్య మతతత్వం–జాత్యాహంకారం, విద్వేషాలను రెచ్చగొట్టడం, వర్గపోరాటాలు, భాషా దురభిమానాలు, ప్రాంతీయ తత్వాల చిచ్చు రగల్చడం, ధనిక పేద వర్గాల మధ్య విద్వేషాలు రెచ్చగొట్టడం, కల్లోలాలు సృష్టించడం ఉద్యమ నైజం కానేకాదు. అలాంటివి ఉద్యమానికి ఏమాత్రం లాభదాయకం కావు. కాని ఈ విధానాలే ఇతర ఉద్యమాలకు జీవనాడులైనాయి. మాటిమాటికి చెప్పబడుతున్న ఈ యదార్థాన్ని మళ్ళీ ఒకసారి మననం చేసుకోండి. ఒక ఇస్లామీయ ఉద్యమం ఇతర ఉద్యమాలన్నింటికంటే తన ధ్యేయం, విధానాలు, ప్రామాణికతలు తన నైజం– ప్రతి విషయంలోనూ పూర్తిగా భిన్నంగా ఉంటుంది. కాబట్టి కనీసం దాని ప్రాథమిక విషయాలలోనైనా ఇతర ఉద్యమాలతో పోల్చకుండా ఉండటమే సరియైన విధానం. ఎన్నో విషయాల్లో ఇతర ఉద్యమాలతో పోల్చకుండా ఉండటమే సరియైన విధానం. ఎన్నో విషయాలు ఇతర ఉద్యమాల కొరకు జీవనాధారమవుతాయి. కాని అవే ఈ ఉద్యమానికి విషతుల్యమవుతాయి. పైన పేర్కొన్న కల్లోలాలు, విద్వేషాలు ఇతర ఉద్యమాలు బలపడటానికి ఎదగడానికి మార్గం సుగమం చేస్తే, అవి ఈ ఉద్యమ మార్గానికి అడ్డుగోడలుగా, అధిరోహించడానికి అనువు కాని పెద్దపెద్ద బండ రాళ్ళుగా నిలుస్తాయి. ఇస్లామీయ ఉద్యమం దైవదాసులందరినీ నిజ దైవ దాసులుగా మార్చడానికి ప్రయత్నిస్తుంది కదా! అలాంటప్పుడు ఈ విద్వేషాలను, అలజడులను రేకెత్తించి తన ఆశయాన్ని అది సాధించగలదా? ఆలోచించండి! ఇలాంటి మానసిక ఉన్మాదం, ఉద్రేకపూరిత వాతావరణంలో ముస్లిమేతరులు సందేశాన్ని వినడానికి ఎలా సిద్ధపడతారు? ముస్లిమేతరులే కాదు, తమ జాతి, తెగల శ్రేయస్సు పరమార్థంగా భావించే ముస్లింలు, నిజమైన ధర్మాచరణ,

దైవసందేశ ప్రచారం, దాని సంస్థాపనే అంటే రుచించని ముస్లింలు కూడా అలాంటి పరిస్థితుల్లో మీ మాట వింటారా? కాబట్టి ఇస్లామీయ ఉద్యమం మతతత్వ భావోద్రేకాలను భాషా, వర్గ విద్వేషాలను రెచ్చగొట్టడాన్ని కలలో కూడా ఊహించలేదు. అలా ఊహించినట్లయితే అది దానికి ఆత్మహత్య సదృశ్యమే అవుతుంది.

**ప్రచారం, ఉపదేశ విధానమే ఆధారం**

ఆచరణా విధానంలోని చివరి ముఖ్య సూత్రమేమిటంటే, ఉద్యమం తన సందేశాన్ని ప్రచార ప్రచురణల ద్వారా తన ధ్యేయాన్ని చక్కగా వివరించడం ద్వారా, తన సిద్ధాంతాలను, విధానాలను ప్రామాణికంగా విశదపర్చడం ద్వారా అందజేస్తుంది. దీని సందేశ కార్యక్రమాలు వివేకవంతమైనవిగా, ప్రామాణిక మైనవిగా ఉంటాయి. కాబట్టి చక్కని హితబోధ ఉత్తమ వాదనా విధానం ద్వారా హృదయాలను ప్రభావితం చేయాలి. సత్యధర్మ సారాన్ని హృదయాలలో ప్రతిష్ఠించాలి. ప్రజల ఆలోచనా తీరును సంస్కరించి, వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్ది తన అనుయాయులుగా మార్చుకోవాలి. నియమావళిలోని ఈ క్రింది వాక్యాలను గమనించండి:

> **"అది ప్రచారం, ప్రబోధనం, భావప్రకటనల ద్వారా మనస్సులను, స్వభావశీలాలను సంస్కరిస్తుంది. ఈ విధంగా దేశ సామూహిక జీవితంలో అవసరమైన సంస్కార ప్రధాన విప్లవం తెచ్చేందుకు ప్రజాభిప్రాయాన్ని మలుస్తుంది."** ***(అధికరణ: 5(3))***

ఇంతకు ముందు తెలియపర్చిన కార్యాచరణ విధానానికి ప్రతిరూపమే ఈ నిబంధనలు. ఈ ఉద్యమం ఎల్లప్పుడు నైతిక విలువలకు కట్టుబడి ఉంటుంది. రుజువర్తనం, నిజాయితీ దాని మౌలిక ఆవశ్యకత. హింసా దౌర్జన్యాలు, కుటిల నీతి, మోసాలు, అలజడులు, వర్గపోరాటాలు ఈ ఉద్యమ నైజానికి విరుద్ధం. అనర్థదాయకం. శాంతియుత నిర్మాణాత్మక విధానమే దానికి ప్రయోజనకరం. అలాంటప్పుడు నిస్సందేహంగా దాని సంస్థాపన మార్గం విజ్ఞతతో కూడిన ప్రచార ప్రసారాలతోనే సుగమవుతుంది. తన గమ్యానికి చేరుస్తుంది. దీన్ని విడనాడితే అన్ని మార్గాలు మూసుకుపోతాయి.

# సామూహిక వ్యవస్థ

## సామూహిక వ్యవస్థ - దాని ఆవశ్యకత

ఇస్లాం ఓ సర్వతోముఖ సందేశ ఉద్యమం అని ఊహించగానే సామూహికత క్రమశిక్షణ వెంటనే గుర్తుకొస్తాయి. వీటి సంబంధం విడదీయరానిది. సంపూర్ణ విప్లవాన్ని ఆశయంగా పెట్టుకున్న ఒక ఉద్యమం పటిష్టమైన సామూహిక వ్యవస్థ- క్రమశిక్షణ లేకుండా విజయవంతమైనట్లు ఒక్క ఉదాహరణ కూడా చరిత్రలో మీకు దొరకదు. ఇంతకు ముందు వివరించినట్లు ఇస్లామీయ సందేశ ఉద్యమం ఓ సర్వతోముఖమైన ఉద్యమం. తన సర్వతోముఖ స్వభావం రీత్యా అదొక సాటిలేని మేటి ఉద్యమం కూడా. దాని ధ్యేయం కేవలం ప్రపంచ ఆర్థిక రాజకీయ వ్యవస్థనే కాదు, యావత్ మానవ జీవితాన్ని మార్చివేసి ఒక నవీన వ్యవస్థను స్థాపించే ధ్యేయం. వ్యక్తి సంస్కరణే గాక సమాజ పునర్నిర్మాణం కూడా దాని ఆశయమే. అది విశ్వాసాలను, భావాలు, భావనలను, గుణగణాలను మంచీ- చెడుల ప్రమాణాలను సామాజిక ఆర్థిక రాజకీయ విధివిధానాలను, మానవ జీవిత సంబంధిత అన్ని వ్యవహారాలను సంస్కరించగోరుతుంది. దానికోసం ఆధ్యాత్మికంగా, భౌతికంగా ప్రత్యక్షంగా, పరోక్షంగా అన్ని విధాలుగా కృషి చేస్తుంది. ఒక ప్రక్కన దైవదాసులకు తన సందేశాన్ని చేరవేయడం వారి హృదయాలలో మేధస్సులో దాని వాస్తవికతను, ఆవశ్యకతను నాటటం, వారిని తన అనుయాయులుగా మార్చుకోవడం, వారి ఆలోచనా విధానాలను వ్యవహార శైలిని తీర్చిదిద్దడం. ఆపైన వారిని ఈ సందేశ కార్యంలో సహవర్తులుగా చేసుకోవడం. కాగా మరో ప్రక్కన మానవ మేధస్సులలో పాతుకొని పోయిన

తప్పుడు విశ్వాసాలను ఆలోచనా విధానాలనేగాక, దేశ సామూహిక జీవన వ్యవస్థపై పెత్తనం చలాయిస్తున్న మిథ్యా వ్యవస్థను కూడా కూకటి వ్రేళ్ళతో పెకలించి పారవేసే ఆవశ్యకత ఉంది. తద్వారా ఇస్లామీయ జీవన వ్యవస్థను స్థాపించుటకు అవకాశం లభిస్తుంది. ఇంత మహోన్నతమైన, విస్తృతమైన, క్లిష్టమైన, ఓపికతో కూడిన ఈ కార్యాన్ని చూడగానే, ఇతర ఉద్యమాల సఫలత ఒక పటిష్టమైన వ్యవస్థ కట్టుదిట్టమైన క్రమశిక్షణ లేకుండా సాధ్యం కానప్పుడు, ఈ ఉద్యమ సాఫల్యం అవి లేకుండా అస్సలు సాధ్యపడదని ఇంగిత జ్ఞానమే ఎలుగెత్తి చెబుతుంది. ఇలాంటి అసాధారణమైన, సమగ్రమైన ఉద్యమం కేవలం జన సందోహాన్ని కూడగట్టుకొని తన ఆశయాన్ని సాధిస్తుంది అనుకోవడం అమాయకత్వమే అవుతుంది. కాబట్టి ఇస్లామీయ ఉద్యమం విజ్ఞతతో చరిత్రాత్మక అనుభవంతో ఈ విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహించింది. మరియు తన కార్యసాధనకు ఒక ఖచ్చితమైన, సముచితమైన సంస్థాగత క్రమశిక్షణ మొదటి రోజు నుండియే ఏర్పరుచుకోవడం తప్పనిసరిగా భావించింది.

ఇది కేవలం విజ్ఞతతో, అనుభవాలను క్రోడీకరించి రూపొందించిన విధానం మాత్రమే కాదు. ఇలా చేయడం ఒక ధార్మిక అవసరం కూడా. అదెలాగంటే, ఈ ఉద్యమం ఏ దైవప్రవక్తల సందేశాల కాంతిపుంజమో, ఎవరి అడుగుజాడలను అనుసరించి ఈ విధానం రూపొందించబడినదో, వారందరి వద్ద ఒక పటిష్టమైన వ్యవస్థ అత్యున్నత స్థాయిలో ఉండేది. ఆ వ్యవస్థ రూపురేఖలు విధివిధానాలు ఈనాడు చలామణిలో ఉన్నటువంటివి కావు. కాని ఆనాటి స్ఫూర్తిదాయకమైన సంస్థాగత క్రమశిక్షణ సాధారణ స్థాయిలో కాక అత్యున్నత స్థాయిలో ఉండేది. ఆధునిక విధానాలకు అలవాటుపడిన ఈనాటి ప్రపంచం, ఆనాటి క్రమశిక్షణను ఊహించనైనాలేదు. గతంలో ఈ సందేశాన్ని స్వీకరించిన వారు జపమాలలోని పూసల వలె పరస్పరం ఒకే బాంధవ్యంలో పటిష్టంగా కూర్చబడి ఉండేవారు. ఏ కార్యాన్నైనా తమ అధ్యక్షుని, మార్గదర్శకుని ఆదేశానుసారం చేసేవారు. వారి దృష్టి ఎల్లప్పుడు అధ్యక్షుని మార్గదర్శకుని ఉపదేశాలపైనే కేంద్రీకరించబడి ఉండేది. వారు తమ కేంద్రంతో పూర్తి

అనుబంధాన్ని కలిగి ఉండేవారు. తమ అభిప్రాయాలు ఆకాంక్షలు, శక్తియుక్తులన్నింటినీ కేంద్రానికి ధారాదత్తం చేసేవారు. కేంద్రం తాను తలచిన విధంగా వారి శక్తిసామర్థ్యాలను ఉపయోగించుకోడానికి వీలు కల్పించేది. ఈ సంఘటన స్వరూపాన్ని గనుక సామూహిక క్రమశిక్షణగా అంగీకరించకపోతే ఇక ఈ ప్రపంచంలో సామూహిక క్రమశిక్షణ అనేది ఎన్నడూ సాధ్యపడదని చెప్పవచ్చు.

ఇదిగాక, సామూహిక క్రమశిక్షణ ఒక ధార్మిక అవసరం అనడానికి మరో కోణం నుంచి పరిశీలించండి. ఈ ఉద్యమం స్థాపించదలచిన ధర్మం ఎంత సామూహికతను ప్రోత్సహిస్తుందంటే, దాని మౌలిక ఆరాధనలు కూడా సాముదాయిక స్ఫూర్తిని విశిష్టతలను ప్రతిబింబిస్తాయి. చివరకు సామూహికతను క్రమశిక్షణను పాటించక ఇద్దరు వ్యక్తులు కలసి ప్రయాణించడానికి కూడా అది ఆమోదించదు. మొత్తానికి ధార్మిక కార్యాలైనా, ప్రాపంచిక కార్యాలైనా అంతర్గత సామూహిక క్రమశిక్షణను అవలంబించడానికి ఇసుమంత అవకాశమున్నా తప్పకుండా ఆచరించాలని ఇస్లాం ఆదేశిస్తుంది. వాస్తవం ఇలా ఉండగా 'ధర్మ సంస్థాపన' వంటి మహోన్నత కార్యసాధన విషయంలో సామూహికతను, క్రమశిక్షణను సుతరామూ విస్మరించలేము. ఈ మహోన్నత కార్యసాధనకు సామూహిక కఠిన క్రమశిక్షణ అవసరం. ఈ కార్యం ఎంత మహత్తరమైనదో సామూహిక అవసరాలు కూడా అంతే మహత్తరంగా ఉంటాయి. ఇలాంటి విభిన్న కారణాలవల్ల ఇస్లామీయ ఉద్యమం ఒక పటిష్టమైన సామూహిక వ్యవస్థను స్థాపించడం తప్పనిసరి అని భావించింది.

## కార్యాచరణ విధానం

ఉద్యమం నెలకొల్పిన సంస్థాగత వ్యవస్థ, దాని విధానపు ముఖ్య అంశాలు ఈ విధంగా ఉన్నాయి.

### 1) ఉద్యమ సభ్యత్వం

దీని సంస్థాగత వ్యవస్థలో సభ్యత్వపు ద్వారాలు ప్రతి భారతీయునికై తెరవబడి ఉంటాయి. ఈ విషయంలో దాని నిబంధనావళి ప్రకటనను గమనించండి.

"ఇండియన్ యూనియన్ (సంస్థానానికి)కి చెందిన ప్రతి పౌరుడు స్త్రీ అయినా పురుషుడైనా ఏ జాతికి ఏ వంశానికి చెందినవారయినా జమాఅతె ఇస్లామీ హింద్ సభ్యులు కావచ్చు." (6వ అధికరణ)

వాస్తవమేమిటంటే, ఏ ఉద్యమమైనా, సంస్థ అయినా ఏషరతులు లేకుండా వ్యక్తులను తమ సభ్యులుగా చేర్చుకోదు. దాని ఆశయాలతో– ఆలోచనలతో ఏకీభవించే షరతుపై వారిని తన సభ్యులుగా చేర్చుకుంటుంది. కాబట్టి స్వాభావికంగా ఈ ఉద్యమం కూడా ఈ క్రింది షరతులను అంగీకరించిన వ్యక్తినే తన సభ్యునిగా చేర్చుకుంటుంది:

**అ) లా ఇలాహ ఇల్లల్లాహు ముహమ్మదుర్రసూలుల్లాహ్ అనే (3వ అధికరణలో ప్రస్తావిత) విశ్వాస వచనాన్ని దాని వివరణతో పాటు అర్థం చేసుకున్న తరువాత, ఇదే తమ విశ్వాసం అని సాక్ష్యం పలకాలి.**

**ఆ) (4వ అధికరణలో ప్రస్తావిత) జమాఅత్ ధ్యేయాన్ని దాని వివరణతోపాటు అర్థం చేసుకుని ఇదే తమ ధ్యేయం అని అంగీకరించాలి.**

**ఇ) (5వ అధికరణలో ప్రస్తావిత) జమాఅత్ ఆచరణా విధానానికి కట్టుబడి ఉంటామని అంగీకరించాలి.**

**ఈ) జమాఅత్ నిబంధనావళిని అర్థం చేసుకున్న తర్వాత తాము ఆ నిబంధనావళికి, దాని కనుగుణంగా జమాఅత్ వ్యవస్థాగత అనుక్రమణకు కట్టుబడి ఉంటామని వాగ్దానం చేయాలి.**

ఈ షరతులను పూర్తిచేసి, సభ్యత్వం కొరకు అభ్యర్థించిన వ్యక్తిని ఈ ఉద్యమం తన సభ్యునిగా చేర్చుకుంటుంది. కాని ఉద్యమ ముఖ్య నాయకులు ఆ వ్యక్తి సభ్యత్వకాంక్షలో చిత్తశుద్ధి గలవాడని, మాటను నిలుపుకునేవాడని సంతృప్తి చెందాలి. ఈ విషయంలో కూడా ఈ ఉద్యమ విధానానికి ఇతర ఉద్యమాల విధానానికి ఎంతో వ్యత్యాసముంది. ఇతర ఉద్యమాలలో సభ్యులుగా

చేర్చుకోడానికి అతని సత్యశీలత, కార్యదక్షత సత్ ప్రవర్తనలే కాదు, అతను ఉద్యమ విధివిధానాలతో ఏకీభవిస్తున్నాడా లేదా అనే విషయాలను కూడా పట్టించుకోరు. కేవలం 10 - 20 రూపాయల సభ్యత్వ రుసుము చాలను కుంటారు. కాని ఇస్లామీయ ఉద్యమ సభ్యత్వానికి రుసుము ఒక్క పైసా కూడా తీసుకోబడదు. కాని ధ్యేయంపై, విశ్వాసం విధానాలపై సంతృప్తి, లక్ష్యసాధన పట్ల అంకితభావం, బలమైన విశ్వాసం, మానసిక ఏకాగ్రత, ఉన్నత గుణగణాలు ప్రశస్తమైన ఆచరణ తప్పనిసరి. సభ్యత్వం కోరే వ్యక్తి వ్యవహారశైలిలో ఈ సుగుణాలు నిరూపితం కానంతవరకు మరియు ఆ వ్యక్తి వాస్తవంగానే అన్నింటిని త్యజించి ఏకాగ్రతతో ఈ సందేశాన్ని అవలంబిస్తాడని నమ్మకం కలగనంతవరకు ఈ ఉద్యమంలో సభ్యునిగా చేర్చుకోబడడు. సభ్యునిగా చేర్చుకున్న తర్వాత కూడా అతనిపై ఉంచిన నమ్మకం ఏమేరకు సరియైనదని తెలుసుకోడానికి కొన్ని బాధ్యతలు అతనికి అప్పగించబడతాయి. ఈ బాధ్యతలను అస్పష్టంగా ఉంచలేదు. పైగా వాటిని ఖచ్చితంగా , సమగ్రంగా వివరించడం జరిగింది. నిబంధనావళిలో అవి ఇలా పొందుపర్చబడతాయి.

**జమాఅత్ సభ్యులు ప్రతి ఒక్కరు తప్పనిసరిగా**

**1)** **ఇస్లామీయ ధార్మిక విధులన్నింటినీ, వాటి షరీఅత్ నిబంధనలతో సహా నెరవేర్చాలి.**

**2)** **మహాపరాధాలకు దూరంగా ఉండాలి. ఒకవేళ క్షణికావేశానికి లోనై ఏ మహాపరాధానికయినా పాల్పడితే దానికి 'తౌబా' చేయాలి. పశ్చాత్తాపంతో దైవం వైపునకు మరలాలి.**

**3)** **ఒకవేళ వారు బహిరంగ పాపం (మాసియతె ఫాహిషా) కోవకు చెందిన బ్రతుకు తెరువు కలిగి ఉంటే దాన్ని వదిలివేయాలి. దాన్ని వదలడం వల్ల ఎంత నష్టం వాటిల్లినా ఖాతరు చెయ్యరాదు. వారి ఆర్జిత ఆదాయాల్లో అలాంటి ఆదాయానికి చెందిన భాగం ఏ మాత్రం ఉన్నా ఆ భాగాన్ని తీసివేసి తమ ఉపాధిని ప్రక్షాళించుకోవాలి.**

4) ఒకవేళ వారి అధీనంలో అధర్మ (హరామ్) విధానాల ద్వారా ఆర్జించిన సొమ్ము లేక ఆస్తి ఉన్నట్లయితే దాన్ని పరిత్యజించాలి. కాని ఒకవేళ ఆ సొమ్ము లేక ఆస్తి నిర్దిష్టంగా తెలియకపోతే తౌబా, ఇస్తిగ్ఫార్ (పశ్చాత్తాపం, మన్నింపునకై వేడుకోలు) తోపాటు సాధ్యమయినంత మేరకు పరిహారానికి ప్రయత్నించాలి.

5) ఒకవేళ వారి సంపద లేక ఆస్తిలో ఒక హక్కుదారు నుండి కాజేసిన హక్కు చేరి ఉంటే అతనికి ఆ హక్కును వాపసు చేయాలి. ఆ హక్కుదారుడు ఎవడో, హక్కు కాజేసి తీసుకున్న సొమ్ము ఏదో, నిర్దిష్టంగా తెలిసిన పక్షంలో ఈ చర్య తప్పనిసరి అవుతుంది. అలాకాని పక్షంలో తౌబా, ఇస్తిగ్ఫార్‌తోపాటు సాధ్యమయినంత మేరకు పరిహారానికై ప్రయత్నించాలి.

6) ఒకవేళ వారు దైవేతర ప్రభుత్వ వ్యవస్థలో ఏదయినా కీలక పదవిలో ఉన్నట్లయితే లేక దాని చట్టసభ సభ్యులయినట్లయితే లేక దాని న్యాయవ్యవస్థలో తీర్పునిచ్చే పదవిలో ఉన్నట్లయితే దానిని పరిత్యజించాలి.

7) శక్తి మేరకు 6వ అధికరణలోని ఆవశ్యకతల్ని నెరవేర్చాలి.

8) తమ శక్తి సామర్థ్యాల మేరకు దేవుని దాసులయిన మానవులకు 3వ అధికరణలోనూ, 4వ అధికరణలోనూ విశదీకరించిన విశ్వాసం, ధ్యేయాల వైపునకు పిలుపు నివ్వాలి. ఈ విశ్వాసం ఈ ధ్యేయాలను స్వీకరించిన వారిని ధర్మసంస్థాపన కొరకు సామూహిక కృషి జరిపేలా సమాయత్తపరచాలి.

ఈ బాధ్యతలను నెరవేర్చడం కూడా సభ్యులు కావడానికి షరతుల్లాంటివి అని భావించాలి. కాబట్టి ఒక సభ్యుణ్ణి ఉద్యమాన్నుండి తొలగించడానికి, ఈ బాధ్యతల నుండి ఏదో ఒక బాధ్యతను నిరంతరం నెరవేర్చకపోవడం కూడా

ఒక కారణం (అధికరణ-68 (2)). స్పష్టంగా దీని అర్థం ఏమిటంటే, సభ్యత్వం పొందిన వ్యక్తి వ్యవహారశైలి పై నిబంధనలకు అనుగుణంగా మారిపోవడం అతని సభ్యత్వం సబబైనదిగా భావించడానికి, కొనసాగడానికి తప్పనిసరి. కాబట్టి ఈ నిబంధనలను బాధ్యతలను నెరవేర్చజాలని ఆ వ్యక్తి ప్రతిజ్ఞ చేయడంలో సత్యవంతుడు కాదనీ లేదా ఇప్పుడు సత్యవంతునిగా లేడని భావించబడుతుంది. తదనుగుణంగా ఉద్యమ వ్యవస్థ నుండి బహిష్కరించడం జరుగుతుంది. అతణ్ణి ఒక ఉద్యమ సానుభూతిపరునిగా, ఉద్యమ విధానాలతో ఏకీభవించిన వ్యక్తిగా మాత్రం పరిగణించటం జరుగుతుంది.

ఉద్యమంలో క్రమబద్ధమైన ప్రవేశం(సభ్యత్వం) పొందే విధానం నిస్సం దేహంగా అసాధారణమైనది. కఠినమైనది. కాని దూరదృష్టిగల ప్రతి వ్యక్తి 'ఒక ఇస్లామీయ సందేశానికి, దైవధర్మ స్థాపన ఉద్యమానికి' ఈ విధానం తప్పనిసరి అని గుర్తించాలి. ఈ షరతులు బాధ్యతలలో దేనిని కూడా ఖుర్‌ఆన్ తన అనుయాయులకు అవసరం లేదని, అవశ్యం కాదని చెప్పలేదు. ఇస్లామీయ ఉద్యమానికి అవసరమైన కార్యకర్తలైనా, ఖుర్‌ఆన్ మరియు ఇస్లాంను ఆచరించే వ్యక్తులైనా వాస్తవంగా ఒకే కోవకు చెందినవారు. మరోవిషయం ఏమిటంటే ఇస్లామ్ ఉద్యమ నైజాన్ని, అది నెరవేర్చదలచిన మహోన్నతమైన, క్లిష్టతరమైన కార్యాన్ని తెలుసుకున్న ఏ వ్యక్తి కూడా, ఉద్యమ ఆశయంపై బలమైన నమ్మకం లేని, విశ్వాసబలంలేని, ఉద్యమ నిబంధనలను గుర్తించని బాధ్యతలను నెరవేర్చని వ్యక్తి ఉద్యమానికి పనికి వస్తాడని చెప్పలేడు. ఈ స్థాయి కంటే తక్కువ ప్రమాణాలు గల వ్యక్తులను సభ్యులుగా చేర్చుకున్నా, కొనసాగించినా వారు ఈ బృహత్తర కార్యాన్ని నెరవేర్చలేరు. అంతేకాదు, వారు ఉద్యమానికి మోయలేని భారంగా తయారవుతారు. దాని శక్తికి కాదు, బలహీనతకు కారకులవుతారు. దాన్ని బలహీనపరుస్తూ పతనావస్థకు చేర్చుతారు. కాబట్టి సభ్యత్వ షరతులు, బాధ్యతలు స్పష్టంగా స్థిరీకరించడం, దాని ప్రకారం వ్యక్తులను పరికించడం మౌలిక అవసరంగా పరిగణించబడింది. ఇది కాఠిన్యవిధానం అసలు కానేకాదు. పైగా ఇదొక స్వచ్ఛమైన, వాస్తవికమైన విధానం.

## 2) సామూహిక వ్యవస్థ రూపురేఖలు

ఈ వ్యవస్థ రూపురేఖలు ఇలా ఉంటాయి.

(1) మొత్తం జమాఅత్ వ్యవస్థపై ఎన్నుకోబడిన ఒక అధ్యక్షుడుంటాడు. అతడిని 'జమాఅత్ అధ్యక్షుడు' (అమీరె జమాఅత్) అని అంటారు. అతని ఎన్నిక నాలుగు సంవత్సరాలకు ఒకసారి జరుగుతుంది. సంస్థాగత మండలాల నుండి ఎన్నికైన సభ్యులు వీరినే నిబంధనావళిలో 'ప్రతినిధి మండలి' అని పేర్కొనటం జరిగింది. తమ ఏకాభిప్రాయంతో గానీ, మెజారిటీ అభిప్రాయంతో గానీ ఎన్నుకుంటారు. ఈ ఎన్నిక ప్రతినిధి మండలి సమావేశంలో తర్జనభర్జనలు, చర్చలు, విశ్లేషణల తర్వాత జరుగుతుంది. ఈ మహోన్నతమైన, ధైర్యసాహసాలతో కూడిన పదవీ బాధ్యతలను నెరవేర్చడానికి ధర్మపరంగాను, యుక్తిపరంగాను, అవసరమైన దృఢవిశ్వాసం, విషయ పరిజ్ఞానం, కార్యనిర్వాహక సామర్థ్యములే ఎన్నికకు ప్రామాణికలు. ఉద్యమాన్ని నిబంధనావళి ప్రకారం సరియైన మార్గంలో నడిపించడమే అధ్యక్షుని అసలైన బాధ్యత అని వేరే చెప్పనవసరం లేదు. (అధ్యక్షునికి ఉండవలసిన లక్షణాలు, అతని బాధ్యతలు అధికారాలను గురించి తెలుసుకోవడానికి నిబంధనావళి (అధికరణలు 22 నుండి 28 చూడండి).

(2) ఏ ప్రాంతంలోనైనా ఒకరికంటే ఎక్కువగా సభ్యులుంటే అక్కడ సంస్థ యొక్క శాఖ ఏర్పాటు చేయబడుతుంది. ఆ సభ్యులలో ఎవరు ధర్మపరంగా, జ్ఞానరీత్యా, ఆచరణాత్మకంగా అందరికంటే శ్రేష్ఠుడో అతడు ఆ ప్రాంతానికి స్థానిక అమీర్‌గా నియమించబడతాడు. అతడు ఆ ప్రాంతం యొక్క జమాఅత్ వ్యవహారాలకు, ఇతర సభ్యుల మార్గదర్శకత్వానికి మరియు క్రమశిక్షణకు బాధ్యత వహిస్తాడు.

(3) ఇది సువిశాలమైన దేశం కాబట్టి, ఇంచుమించు అన్ని ప్రాంతాలలో ఈ ఉద్యమం విస్తరించింది కాబట్టి వ్యవస్థాగత అవసరం సౌలభ్యం నిమిత్తం ఈ వ్యవస్థను వివిధ విభాగాలుగా విభజించడం జరిగింది. వాటిని సంస్థాగత మండలాలుగా భావించవచ్చు. ప్రతి మండలానికి (రాష్ట్రానికి) ఒక అధ్యక్షుడు

ఉంటాడు. అతడినే మండలాధ్యక్షుడు (అమీరె హల్ఖా) అంటారు. అతని నియామకం కూడా స్థానిక అధ్యక్షుల లాగే అవుతుంది. మండలంలో ఉండే స్థానిక జమాఅత్‌లు, ఏ శాఖకు చెందని ఉద్యమ సభ్యులను అతడు పర్యవేక్షిస్తాడు. అతడే అన్నిసంస్థల, సర్వసభ్యుల క్రమశిక్షణకు, మార్గదర్శకానికి బాధ్యత వహిస్తాడు. ఉద్యమం మరియు సంస్థతో సంబంధమున్న విషయాలలో ఈ మండలాధ్యక్షుడు సంస్థకు చెందిన ప్రధాన అధ్యక్షునికి (అమీరె జమాఅత్) మరియు స్థానిక అమీర్లకు సభ్యులకు మధ్య అనుసంధానకర్తగా వ్యవహరిస్తాడు.

(4) స్థానిక, మండల కార్యాచరణ విధానం రూపొందించబడినప్పటికీ జమాఅత్ వ్యవస్థ, ఉద్యమ సారథ్యపు అంతిమ బాధ్యత సంస్థకు చెందిన ప్రధాన అధ్యక్షునిపైనే ఉంటుంది. ఈ మండలాధ్యక్షులు- స్థానిక అధ్యక్షులు వాస్తవంగా ప్రధాన అధ్యక్షునికి సహాయకులుగా, సహచరులుగా ఉంటారు. వారి ద్వారా అతను దేశంలోని సుదూర ప్రాంతాల వరకు విస్తరించి వున్న ఉద్యమ శాఖల పర్యవేక్షణ మార్గదర్శక బాధ్యతలు నెరవేరుస్తాడు. అందువల్లనే మండలాధ్యక్షుల కార్యక్రమాల పర్యవేక్షణ, వారికి ఆవశ్యకమైన దిశా నిర్దేశం అతని తప్పనిసరి బాధ్యతగా పరిగణించబడుతుంది. ఎలాగైనా దీన్ని అతడు నెరవేర్చాలి. లేకుంటే ఉద్యమ సంస్థాగత క్రమశిక్షణ సరిగా ఉండదు. మరియు దాని కార్యక్రమాల్లో సమన్వయం, సమరసం లేకుండా పోతుంది. కాని సంస్థకు చెందిన అత్యున్నత పదవి కావడం వల్ల, అనేక బాధ్యతలు అతనిపై ఉండడం వల్ల మండలాధ్యక్షుల కార్యక్రమాలను పర్యవేక్షించే, మార్గదర్శకత్వం వహించే బాధ్యతలన్నీ స్వతహాగా నెరవేర్చడం సాధ్యం కాదు. కాబట్టి యావత్ కార్యనిర్వహణ కొరకు సంస్థ అధ్యక్షుని అధీనంలో ఉండినట్లు ఒక 'కేంద్రీయ విభాగం' ఏర్పాటు చేయబడింది. సంస్థ ఖయ్యిమె జమాఅత్ (సెక్రటరీ జనరల్) దానికి అధిపతిగా ఉంటాడు. ఖయ్యిమె జమాఅత్, అధ్యక్షుని ఆదేశానుసారం ఉద్యమ కేంద్ర విభాగాలన్నింటి పనితీరును పర్యవేక్షిస్తాడు. క్రమశిక్షణను నెలకొల్పుతాడు. కార్యనిర్వాహక విభాగాలతో అనుబంధం పెట్టుకుంటాడు. వాటి కార్యక్రమాలను పర్యవేక్షిస్తాడు. వారి నుండి ఉద్యమ కార్యకలాపాల

నివేదికలు (రిపోర్టు) తీసుకుంటాడు. అవసరాన్నిబట్టి వారికి ఆదేశాలు జారీ చేస్తుంటాడు. ఈ బాధ్యతలను నెరవేర్చడానికి అతనికి ఇతర సహచరుల (అనేకమంది కార్యదర్శులు) సహకారం లభిస్తుంది. (అధికరణలు 29,30,31)

**జమాఅత్ వ్యవస్థలో సలహా సంప్రదింపులు**

ఈ ఉద్యమ సంపూర్ణ వ్యవస్థ క్రిందిస్థాయి నుండి కేంద్ర స్థాయి వరకు సలహా సంప్రదింపులపై ఆధారపడి ఉంది. దీని వివరాలు నియమావళిలో పొందుపర్చబడ్డాయి.

"జమాఅతె ఇస్లామీ హింద్ వ్యవస్థ సలహా ప్రధానమయింది."

(అధికరణ-10).

ఈ సలహా సంప్రదింపుల ఆవశ్యకత, భావం ఏమిటంటే, చర్చనీయాంశ మైన సమస్యను ఏకాభిప్రాయంతో పరిష్కరించాలి. ఈ ఆదర్శ విధానాన్ని నెలకొల్పడానికి సాధ్యమైనంత మేరకు కృషి చేయాలి అని నిబంధనావళిలో పేర్కొనడం జరిగింది. (అధికరణలు-20, 39 (అ))

ఇది ఎందుకంటే, సలహా సంప్రదింపులు ఐకమత్యాన్ని పెంపొందిస్తాయి. ఇది ఉద్యమానికి ఎంతో లాభదాయకం. అంతేకాకుండా ఈ ఉద్యమానికి మూలాలైన దివ్యఖుర్ఆన్, ప్రవక్త(స) సంప్రదాయాల ప్రబలమైన ఆదేశం కూడా ఇదే. ఖుర్ఆన్ సందేశ ఆరంభ దశలో స్వాతంత్ర్యానికి ,అధికారానికి అవకాశం ఏమాత్రం ఉండేది కాదు. అలాంటి స్థితిలో సలహా సంప్రదింపులు చేయడం విశ్వాసుల విశిష్ఠ లక్షణమని, అది వారి స్వభావమని దివ్యఖుర్ఆన్ తెలిపింది (షూరా-38). అంతేకాదు, దైవప్రవక్త(స)ను కూడా "ముఖ్యమైన సామూహిక కార్యాలలో తన సహచరులతో సంప్రదించవలసిందిగా ఆదేశించబడింది (ఆలి ఇమ్రాన్:159). విజ్ఞతకు, వివేకానికి ప్రతీక ముహమ్మద్ ప్రవక్త (స). అంతేకాదు, ఆయన(స) మార్గదర్శకత్వానికి దివి నుండి దైవాదేశాలు (వహి) అవతరించేవి. కాబట్టి ప్రపంచంలో సలహా సంప్రదింపుల ఆవశ్యకత లేనివారు ఎవరంటే,

ఖచ్చితంగా వారే అని చెప్పవచ్చు. అయినప్పటికీ వారు ఆ దైవాదేశాన్ని పాటించేవారు. అందరితో సలహా సంప్రదింపులు జరిపి ఆదర్శ విధానాన్ని (ఏకాభిప్రాయంతో చేయు నిర్ణయం) నెలకొల్పడానికి ప్రయత్నించేవారు. దీనికి ఎంత ప్రాధాన్యత ఇచ్చేవారంటే తుదకు తమ స్వంత అభిప్రాయాన్ని సహితం విడనాడి అందరి అభిప్రాయం మేరకు నిర్ణయాలు తీసుకొనేవారు. వారు (స) అవలంబించిన ఈ విధానంవల్ల ధర్మ విషయాలలో సలహా సంప్రదింపులకు ఉన్న అనన్య ప్రాధాన్యత తెలిసి వస్తుంది. ఈ ఆదర్శ విధానాన్ని నెలకొల్పడానికి కృషి చేయవలసిన ఆవశ్యకత విదితమవుతుంది.

సలహా సంప్రదింపుల విధానం అవలంబించినప్పటికీ అప్పుడప్పుడు భేదాభిప్రాయాలు తలెత్తడం తప్పనిసరి. భేదాభిప్రాయాలు సమసిపోనప్పుడు ఉద్యమ వ్యవస్థ నిర్ణయాన్ని ఎలా తీసుకోవాలి? అనేది ఒక ముఖ్య ప్రశ్న. ఈ ప్రశ్న ప్రతీ సంస్థకు, ప్రతి పార్టీకి ఎదురయ్యేదే. అక్కడ దానికి సమాధానం– "అంతిమ నిర్ణయాధికారం సంస్థ ఉన్నత అధికారికి ఉందనేదే. అతను సలహామండలి సభ్యులందరి అభిప్రాయాలకు వ్యతిరేకంగా కూడా నిర్ణయం తీసుకోవచ్చు" అని ఇవ్వబడుతుంది. లేదా "అధిక సంఖ్యాకుల అభిప్రాయం మేరకు నిర్ణయం తీసుకోబడుతుంది" అని ఇవ్వబడుతుంది.

మొదటి విధానం నియంతృత్వానిది. రెండవది ప్రజాతంత్రానిది. ఈ రెండు విధానాలలో కొన్ని ప్రత్యేక ఔచిత్యాలు, లాభాలు ఉండవచ్చు. కాని వాస్తవమేమిటంటే ఈ రెండు విధానాలలో భయంకర ఉపద్రవాలు, కీడులు దాగి ఉన్నాయి. ప్రజాస్వామ్యం మనిషి వ్యక్తిత్వాన్ని రక్షించి స్వేచ్ఛాయుత వాతావరణంలో ఎదగడానికి వీలు కల్గిస్తుంది. కాని దానితోపాటు తరచుగా దేశం–సమాజం అనిశ్చిత పరిస్థితులకు గురికావడానికి బలహీన పడటానికి కూడా కారణభూతమవుతుంది. అలాగే నిరంకుశత్వ విధానం దేశ సమైక్యతకు రాజకీయ స్థిరత్వానికి దోహదపడుతుంది. కానీ భావప్రకటనా స్వాతంత్ర్యాన్ని హరించి వేస్తుంది. మనిషి వ్యక్తిత్వాన్ని ఎదగకుండా అణగ ద్రొక్కుతుంది. ఇస్లామీయ సందేశ ఉద్యమానికి ఈ రెండు విధానాలు కూడా అంగీకార

యోగ్యం కావు. ఎందుకంటే ఇందులో ఉన్న ఉపద్రవాలు అది ఎట్టి పరిస్థితుల్లోనూ భరించజాలదు. కాబట్టి అది తన నిర్ణయాలను తీసుకోడానికి ఒక మధ్యంతర, సమతుల్య మార్గాన్ని అవలంబించింది. నియంతృత్వ వ్యవస్థ, ప్రజాస్వామిక వ్యవస్థలోని మేళ్ళు, పరమార్థాల మేళవింపు ఇందులో ఉంది. కాని వాటిలోని ఉపద్రవాలు అపాయాలు- నష్టాలు మినహాయించబడ్డాయి. అదెలాగంటే కీలక అంశాలపై నిర్ణయం గైకొనటంలో ఉద్యమ అధ్యక్షుడు (అమీరె జమాఅత్) నిరంకుశుడూ కాడు, సలహాలిచ్చే వారి స్వల్ప మెజారిటీకి బద్ధుడూ కాడు. అతడు బద్ధుడై ఉండేది భారీ (సుమారు 67%) మెజారిటీకి మాత్రమే. తన అభిప్రాయం ప్రకారం నిర్ణయం తీసుకోదలిస్తే నిర్దేశిత పరిమితులకు లోబడి తీసుకోవాలి. (వివరాల కొరకు అధికరణ-28 చూడండి)

ఈ విధానంలో సలహా సంప్రదింపులకు ఒక సమంజసమైన విశిష్టమైన స్థానాన్ని కల్పించడంతోపాటు, వివేకానికి న్యాయబద్ధతకు సముచిత స్థానం ప్రసాదించబడింది. అదెలాగంటే ఉన్నత వ్యక్తిత్వం, ధార్మికంగా నైతికంగా, జ్ఞాన వివేకాల దృష్ట్యా ఆచరణ రీత్యా ఉన్నత ప్రమాణాలు కలిగి ఉండటం వల్ల మొత్తం ఉద్యమానికి (సంస్థకు) అధ్యక్షునిగా ఎన్నుకోబడిన ఒక వ్యక్తి, ముఖ్య విషయాల సమస్యల పరిష్కార విషయంలో ఇచ్చిన సలహాలను కేవలం ఒక సామాన్య వ్యక్తి ఇచ్చిన సలహాగా పరిగణించకూడదు. దానికీ ఇతరుల సలహాలకిచ్చిన స్థానం మాత్రమే ఇవ్వకూడదు. అత్యంత ప్రాధాన్యత దానికి ఇవ్వాలి. మన వివేచనాశక్తి ఇదే చెబుతుంది. న్యాయపరంగా ఇదే సమంజసమైనది. కాబట్టి ఈ విధానాన్నే ఇస్లామీ ఉద్యమం అవలంబిస్తుంది.

ఇలాంటి సమంజసమైన, సమతుల్యమైన విధానం అవలంబించినప్పటికీ సమస్యలు ఉత్పన్నం కావడానికి ఆస్కారమే లేదని చెప్పలేము. కాని ఇస్లామీయ సందేశ ఉద్యమ ప్రత్యేకతల్లో ఒక ప్రత్యేకత ఏమిటంటే, ఇలాంటి సమస్యలను అధిగమించడానికి శ్రేష్టమైన విధానముంది. ప్రపంచంలోని ఏ ఇతర ఉద్యమా లలో అలాంటి విధానం లేదు. ఆ విధానం ఏమిటంటే, 'బాధ్యతాభావన',

'దైవభీతి' ఒకరిపై మరొకరికి ఉన్న నిర్మలమైన ప్రేమానురాగాలు. వీటిని ఈ ఉద్యమం తన కార్యకర్తల్లో ముఖ్యంగా తమ నాయకుల్లో జనింపజేస్తుంది. వారు వాటితో అలంకార భూషితులై ఉంటారు. విశ్వాసపరమైన నైతికమైన ఈ విశిష్ఠతలు వారిని అహంకారం నుండి, అనవసర వాదోపవాదాల నుండి రక్షిస్తాయి. ప్రతిఫలంగా ప్రజాస్వామ్యం, నియంతృత్వ విధానంలో ఉన్న కీడు నుండి రక్షణ లభిస్తుంది. సలహా సంప్రదింపుల విధానంలో ఉన్న మేలు మనకు ప్రాప్తమవుతుంది.

**క్రమశిక్షణ**

ఈ సంస్థకు చెందిన పూర్తి వ్యవస్థ 'ఆజ్ఞాపాలన' (విన్నాము, శిరసావహించాము) పై ఆధారపడి ఉంది. సభ్యులందరూ తమ అధ్యక్షుని ఆదేశాలను ఉపదేశాలను ఆలకించి తప్పనిసరిగా ఆచరించాలి. ఈ ఆజ్ఞాపాలన స్వచ్ఛందంగానే జరుగుతుంది. బలవంతంగా తలవంచడానికి ఇచ్చట ప్రభుత్వ అధికారం చలామణిలో లేదు. సమీప కాలంలో కూడా. అది సాధ్యపడదు. కాబట్టి ఈ ఆచరణ మనస్ఫూర్తిగానే ఉంటుంది. అధ్యక్షుని ఆదేశాలు పాటిస్తే ప్రాపంచిక లాభాలు లభిస్తాయనే ఆశ కూడా లేదు. ఎందుకంటే ఇచ్చట అలాంటి ప్రాపంచిక ప్రయోజనాలు పొందే అవకాశమే లేదు. కాబట్టి ఇక్కడ ఆచరణ స్వచ్ఛందంగానే సాధ్యమవుతుంది. కాని స్వచ్ఛంద ఆచరణ అంటే నామమాత్రపు ఆచరణ కాదు. పనికి వచ్చే ఆచరణ. ఛట్టప్రభావం, శిక్షపడే భయం లేదా లాభాపేక్షతో చేసే ఆచరణ దాని ముందు దిగదుడుపే. ఇదెందుకంటే ఆచరణ ఒక రాజకీయ జాతీయ అవసరం కాదు. ఒక ధార్మిక అవసరమని విశ్వసించబడుతుంది. దానివల్ల దైవప్రీతి లభిస్తుందని భావించి ఆచరించడం జరుగుతుంది. ధార్మిక ఆవశ్యకత అని భావించి ధార్మిక ఉత్తేజంతో అవలంబించే ఆచరణా విధానానికి సాటి మరేదీ లేదు అనేది అందరికీ తెలిసిన విషయమే. ఇతర ఆచరణా విధానం దాని సరిజోడు కాజాలదు.

కాని ఈ విధేయత ఇంత అనుపమమైనదైనప్పటికీ బేషరతుగా ఉండదు.

సత్కార్యాలలోనే విధేయత చూపాలని షరతు విధించబడి వుంది. ఇక్కడ సత్కార్యాలంటే అల్లాహ్ పంపిన షరీయత్, ఆదేశం లేదా తీర్పును అతిక్రమించకుండా ఆచరించడం. ఈ షరతుకు కారణం స్పష్టంగానే ఉంది. ఇస్లామీయ ఉద్యమ సారధ్యానికి ఒక వ్యక్తిని ఎన్నుకోవడం, లేదా నియమించడానికి ముఖ్యకారణం అతను ఈ ఉద్యమ లక్ష్యాలను సాధించాలి, సత్యధర్మాన్ని స్థాపించడానికి తన శాయశక్తులా ప్రయత్నించాలి. మరియు ఇతరులకు కూడా మార్గదర్శిగా ఉండాలి. ఒకవేళ అతను ధర్మాదేశాలకు, దాని నైజానికి భిన్నంగా ఏదైనా ఆదేశం లేదా తీర్పు ఇచ్చినట్లయితే అది నిస్సందేహంగా ఈ ధర్మాన్ని స్థాపించడం కాదు దానిని పడగొట్టడమే అవుతుంది. అదే విధంగా ఒక సభ్యుడు వాస్తవంగా ఉద్యమంలో చేరింది దాన్ని బలపరచడానికి అయినప్పటికీ ఇటువంటి తప్పుడు ఆదేశాలపై, తీర్పుపై అమలు చేసినట్లయితే ధర్మమూలాలను నిర్మూలించిన వాడిలా భావించబడుతాడు. ధర్మాభీష్టానికి వ్యతిరేకంగా ఇచ్చిన ఆదేశం సరియైనది కానట్లే, ఆ ఆదేశాన్ని ఆచరించడం కూడా ధర్మపరంగా సరియైనది కాదు. కాబట్టి దైవప్రవక్త (స) "సత్కార్యాలలో అధికారుల ఆదేశాలను తప్పక శిరసావహించాలి. అయితే పాప కార్యాలలో ఎవరికీ విధేయత చూపకూడదు అని విశదపర్చారు.

ఇతర ఉద్యమాలు తమ వ్యవహారాలలో - సత్కార్యాలు, దుష్కార్యాలు, సత్యాసత్యాలు, ధర్మాధర్మాలు, న్యాయాన్యాయాలు, సద్గుణాలు-దుర్గుణాలు ఏమాత్రం పట్టించుకోవు. అయినప్పటికీ నా పార్టీయే సరియైనది అని భావిస్తారు. ఆ పార్టీ నాయకుల ప్రతీ ఆదేశం అది తప్పయినా, ఒప్పయినా తప్పనిసరిగా పాటించవలసిందే. కాని ఇస్లామీయ ఉద్యమంలో అధ్యక్షుని ఆదేశాలను సత్కార్యాలలోనే పాటించాలని షరతు విధించబడింది. ఈ షరతువల్ల నిస్సందేహంగా ఇతర ఉద్యమాల వ్యవస్థలన్నింటికంటే ఇస్లామీయ వ్యవస్థకు ఉన్నతమైన విశిష్టమైన స్థానం లభిస్తుంది.

# సభ్యుల శిక్షణ

## శిక్షణ అంటే అర్థం

ఈ ఉద్యమ దృష్టిలో అత్యంత ప్రధానమైన విషయాలలో మొట్టమొదటిది తన సభ్యుల శిక్షణ. ఈ శిక్షణకు ఒక ప్రత్యేకమైన విశాల భావముంది. అదేమిటంటే, ఆలోచనా ధోరణి, ఆచరణా విధానాల్ని సంస్కరించటానికి చేసే సకల ప్రయత్నాలు. దాని ఫలితంగా మానవుల సంబంధం తమ దైవంతో అత్యంత బలీయమైపోవాలి. వారి ఆలోచనా విధానంపై పరలోక చింతన పెరుగుతూ పోవాలి.వారి విశ్వాసంలో జీవం ఉట్టిపడాలి. వారి ధార్మికత నిరంతరం వృద్ధి చెందాలి. ఇస్లాం పట్ల వారి పరిజ్ఞానం పెరుగుతూ ఉండాలి. వారి సుగుణాలలో ఔన్నత్యం, ఆచరణలో సాధుత్వం, స్వభావంలో స్వచ్ఛత ప్రాధాన్యతను సంతరించుకుంటూ పోవాలి. ధర్మం కోసం పాటుపడటం, ధర్మస్థాపనా తపన, వారి జీవిత పరమార్థంగా మారిపోవాలి. ఉద్యమం ఆశయంపై, దాని సత్యసంధతపై వారి విశ్వాసం దృఢ విశ్వాసంగా మారాలి. వారి ఉద్యమ పరిజ్ఞానం నిరంతరం పెరుగుతూ దానిపై ఆత్మస్థయిర్యం కలగాలి. ధర్మం కోసం తన అభీష్టాలను, అభిరుచులను, స్వలాభాలను, భావోద్వేగాలను పరిత్యజించుటకు పట్టుదల పెరుగుతూపోవాలి. ఇంతకు ముందు చెప్పినట్లు శిక్షణ యొక్క ఈ భావార్థం అసాధారణమైనది. విశాల దృక్పథం కలది. అంతేకాదు, సర్వసామాన్యంగా భావించే అర్థం కన్నా విభిన్నమైంది. ఇతర ఉద్యమాలు పార్టీలు కూడా తమ సభ్యులకు శిక్షణ ఇస్తాయి. కాని వారు ఇచ్చే శిక్షణకు ఇస్లామీయ ఉద్యమం ఇచ్చే స్ఫూర్తిదాయక శిక్షణకు ఎంతో వ్యత్యాసముంది. వాటికంటే దీని స్ఫూర్తి

దాయక శిక్షణ ఎంత విశాల దృక్పథం, మహోన్నతం, అసాధారణమైనదంటే సామాన్యులు దాన్ని అర్థం చేసుకోలేరు. కాబట్టి ఇస్లామీయ ఉద్యమాన్ని అర్థం చేసుకోడానికి దాని శిక్షణా స్ఫూర్తిని సరిగ్గా అర్థం చేసుకోవాలి. ప్రాచుర్యంలో ఉన్న అర్థాన్ని దానికి ఆపాదించకూడదు.

**అసలు ఉద్దేశం**

ఇస్లామీయ ఉద్యమానికి పైన పేర్కొనబడిన విధంగా తన సభ్యులకు శిక్షణ ఇవ్వడం ఎంతో అవసరం. దానిఈ ప్రత్యేకతను తెలుసుకోడానికి ఇంతకు క్రితం 'ఉద్యమ ఆశయం', 'ఆచరణా విధానం' వివరణలు, విశ్లేషణలపై ఒకసారి దృష్టిసారిస్తే సరిపోతుంది. వాటిలో రెండు ప్రముఖ విషయాలు స్పష్టంగా గోచరిస్తాయి. ఒకటి: ఈ ఉద్యమం తన ఉన్నత ఆశయ సాధనలోనూ తన మార్గంలోనూ ఎదుర్కొనే కష్టాలు అసాధారణమైనవి. రెండవది: దాని సభ్యుల విశ్వాస దృఢత్వం, నైతికబలం, సైద్ధాంతిక స్థయిర్యం, ఏకాగ్రత, నిరాడంబరమైన నడవడిక, ధర్మపరిజ్ఞానం, ఉద్యమం పట్ల ఉత్తేజం ఉద్యమానికి సిసలైన మూల ధనం లాంటివి. వీటి ద్వారానే ఉద్యమానికి ఎదురయ్యే కష్టాలను అధిగమించి పోరాటాన్ని సఫలంగా ముందుకు నడిపించగలరు. ఈ విధానం కాక దాని వద్ద మరో శక్తిలేదు. మరోశక్తిని వినియోగించజాలదు. వినియోగించడం దానికి శోభించదు. మొదటి విషయం కోరేదేమిటంటే ఉద్యమ సారధులు, కార్యకర్తలు తమలో పులిలాంటి ధైర్యసాహసాలు పెంపొందించు కోవాలి. ఎగిసిపడుతున్న తుఫాను అలలకు ఎదురొడ్డి నిలవాలి. అన్ని ప్రమాదాలను ఎదుర్కొనడానికి, సకల ప్రయోజనాలు వదులుకోడానికి సంసిద్ధులు కావాలి. వారి ప్రాథమిక హక్కులను హరించి వేసే దుస్థితి వస్తే తట్టుకోడానికి సిద్ధంగా ఉండాలి. ముస్లిమే తరుల నుండేకాదు, ముస్లింల నుండి కూడా తప్పకుండా విపరీతమైన విరోధాలు ఎదురవుతాయి. వాటిని సమర్థవంతంగా ఎదుర్కొనే ధైర్యసాహసాలు పెంపొందిం చుకోవాలి. అదేవిధంగా రెండవ విషయం వాంఛించేది సభ్యుల్లో మచ్చలేని శీలము. వారి నైతిక వర్తనలో ప్రజల హృదయాలను దోచుకొనే ఆకర్షణ,

చెడును మంచితో జయించే పరిజ్ఞానం ఉండాలి. ఇక ఆలోచించండి, ఈ రెండు విషయాల ఆకాంక్షలను పూర్తి చేయడం ఎవరివల్ల, ఎలాంటి వారి వల్ల సాధ్యమవుతుంది? ఉద్యమ కార్యకర్తలు ఎప్పుడు ఎలా తయారు కాగలరు? ఈ ప్రశ్నకు నిస్సందేహంగా ఒకటే సమాధానం ఉంది. అదేమిటంటే, ఈ విశిష్ఠతలు గల వ్యక్తులు తయారు కావాలంటే వారికి తమ దైవంతో బలమైన బంధముండాలి. అతడి ప్రసన్నత పొందే తపనే తన హృదయ స్పందన కావాలి. ప్రపంచం అతని దృష్టిలో తృణప్రాయంగా మారాలి. అంతిమ దిన సాఫల్యతయే పరమావధిగా కావాలి. అంతేకాదు, ఉద్యమ ఆశయం, సత్యశీలత, ఆవశ్యకత లపై సరియైన విశ్వాసముండాలి. ఉద్యమ విధానాలు, ఆశయాలపై ఎలాంటి ప్రగాఢ నమ్మకముండాలంటే, ఇతర ఆలోచనా విధానాలు సిద్ధాంతాలు వారిని ప్రభావితం చేసినా ఇసుమైంతనా కదల్చలేకపోవాలి. ఇలాంటి విశ్వాసం, మానసిక తృప్తి సులభంగా ప్రాప్తం కావు, ప్రాప్తించినా నిలకడగా ఉండవు. దానిని పొందడానికి, సంరక్షించుకోడానికి నిరంతర సాధన చేయాలి. ఈ కారణాల వల్లనే ఇస్లామీయ ఉద్యమం తన సభ్యుల శిక్షణకు ఇంతగా ప్రాము ఖ్యాన్ని ఇచ్చింది. ఇవ్వాలి కూడా. అలా చేయకుంటే అది సాధించదలచిన మహోన్నత ఆశయం కష్టతర కార్యాలను సాధించే గురుతర బాధ్యతను ఏమాత్రమూ నెరవేర్చజాలదు. దివ్యఖుర్ఆన్ ప్రవక్త(స) విధానాన్ని అధ్యయనం చేసినట్లయితే, వారికి (స) తన సహచరుల శిక్షణపై ప్రత్యేక శ్రద్ధ వహించాలని ఎంత గట్టిగా ఆదేశింపబడిందో దానిపై అమలు చేయడానికి ప్రవక్త (స) ఎంత శ్రద్ధ వహించారో విదితమవుతుంది.

వాస్తవంగా వ్యక్తులను బాగా పరికించి, ధర్మపరంగా ఉద్యమ పరంగా వారి ఆలోచనా తీరు నడవడికలు సరిగా ఉన్నాయని సంతృప్తి పొందిన పిదపే ఉద్యమ వ్యవస్థలో చేర్చుకోవడం జరుగుతుంది. అయినప్పటికీ ప్రప్రథమంగా వారు ఏ త్యాగశీలత, విశ్వాసంతో, ధృఢమైన ఆలోచనా ధోరణితో, కార్యదీక్షతో ఉద్యమంలో ప్రవేశిస్తారో రానురాను వాటిలో తరుగుదల రాదని భావించలేము.

అలాగే ఉద్యమ సభ్యత్వం లభించగానే ఆ వ్యక్తులు సభ్యత్వానికి ఆవశ్యకమైన, వాంఛనీయమైన ఉన్నత ప్రమాణాలకు చేరుకున్నారనీ, ఇక ఉన్నత శ్రేణికి చేర్చవలసిన అవసరం లేదని అర్థం కాదు. కాబట్టి ఉద్యమ సభ్యుల శిక్షణకు శ్రద్ధ వహించకపోవడమంటే, ఉద్యమం తన శక్తిసామర్థ్యాలను తుప్పుపట్టడానికి వదిలేసిందని, తన భవిష్యత్తును తానే చేజేతులా అంధకారంలో ముంచివేసిందని అర్థం. ఈ శక్తిసామర్థ్యాల పునరుత్తేజం, అకుంఠిత కార్యదీక్షల పైనే అది చేసే పోరాట సఫలత ఆధారపడి ఉంది.

**ఈ శిక్షణ రెండు రకాలు:** ఒకటి నకారాత్మమైనది. రెండవది : సకారాత్మకమైనది. మొదటిది : ఉద్యమ సభ్యులు దాని వ్యవస్థలో చేరినప్పుడు ధర్మసంస్థాపన ధ్యేయం పట్ల వారికున్న అవగాహన విశ్వాసము, కార్యాచరణలో వారి ఉత్తేజం ఏమాత్రమూ తగ్గకుండా చూడాలి. దానికోసం మనోకాంక్షల ప్రభావాలు, షైతాన్ చెలరేపే దుశ్శంకలు, నేటి దైవధిక్కార సంస్కృతికి చెందిన నిర్వీర్య విధానాల వల్ల వారి మనోమస్తిష్కాలపై పడుతున్న చెడు ప్రభావాల నుండి వారిని పరిరక్షించాలి. రెండవది: ఉద్యమ ధ్యేయం పట్ల వారికున్న అనుబంధం దినదినాభివృద్ధి చెందుతూ పోవాలి.

**ఆచరణాత్మక శిక్షణా వ్యవస్థ**

ఉద్యమ సంస్థాగత వ్యవస్థ, తన సభ్యుల శిక్షణకొరకు అవలంభించిన ఆచరణాత్మక శిక్షణా విధానంలో దిగువ పేర్కొనబడిన విషయాలకు అత్యంత ప్రాధాన్యత కల్పించింది.

**1) దివ్యఖుర్‌ఆన్ మరియు హదీసుల వ్యక్తిగత అధ్యయనం నేరుగా అరబీ భాషలో గాని లేదా అనువాదాలతోగాని.**

**2) ఖుర్‌ఆన్ లేదా హదీస్‌ల పాఠం.**

**3) ప్రవక్త (స) జీవిత చరిత్ర, ఆయన సహచరుల చరిత్ర మరియు ముస్లిం సమాజ (ఉమ్మత్) మహాత్ముల చరిత్ర పఠనం.**

4) **ఉద్యమ సాహిత్యం, ముఖ్యంగా ప్రాథమిక విషయాలు ఉమ్మడిగాను వ్యక్తిగతంగాను పఠనం.**

5) **శిక్షణాపరమైన ఉపన్యాసాలు.**

6) **ఆత్మ పరిశీలన**

7) **పరస్పర సంస్కరణ (ధర్మ ప్రబోధన).**

వాస్తవంగా చెప్పాలంటే, సంస్కరణ-శిక్షణా కార్యం పూర్తిగా ఉద్యమ సభ్యులపై వదలిపెట్టబడలేదు. శిక్షణా ఆశయం సరియైన రీతిలో నెరవేరడానికి కొన్ని పద్ధతులు, విధానాలు రూపొందించబడ్డాయి. సంక్షిప్తంగా వాటి వివరాలు ఇవి :

- ప్రతి స్థానిక జమాఅత్ తప్పనిసరిగా వారానికి కనీసం ఒక్కసారైనా తన సమావేశాన్ని ఏర్పాటు చేసుకోవాలి. అందులో ప్రతి సభ్యుడు తప్పకుండా పాల్గొనాలి. ఈ సమావేశం వాస్తవంగా శిక్షణార్థమై ఉంటుంది. దీనిలో ఖుర్ఆన్ ప్రబోధనం, హదీస్ ప్రబోధనం, ఉపన్యాసాలు, ఉద్యమ సాహిత్య పఠనం వంటి కార్యక్రమాలుంటాయి. దానితోపాటు స్థానిక అధ్యక్షుడు ప్రతి సభ్యుని నుండి ఆ వారంలో అతను నిర్వర్తించిన సందేశ, శిక్షణా కార్యక్రమాలు ఖుర్ఆన్-హదీస్, ఉద్యమ సాహిత్యపఠనం ప్రగతి నివేదికలు తీసుకుంటాడు - తగు సూచనలు ఇస్తాడు.

- ప్రతి స్థానిక అమీర్‌పై మండలాధ్యక్షునిపై నియమావళి విధించిన బాధ్యత ఏమిటంటేవారు తమ పర్యవేక్షణలో ఉన్న సభ్యులకు శిక్షణ ఇవ్వాలి. దానికోసం అప్పుడప్పుడు జిల్లా రాష్ట్రస్థాయి సమావేశాలు ఏర్పాటు చేయబడ తాయి. దాని పూర్తి కార్యక్రమం కేవలం శిక్షణా ప్రధానమైనదిగా ఉంటుంది.

- తప్పనిసరిగా నిర్ణీత గడువు తరువాత స్థానిక అధ్యక్షుల నుండి మండలాధ్యక్షునికి, మండలాధ్యక్షుని నుండి కేంద్ర వ్యవస్థకు పూర్తి ఉద్యమ స్థితిగతులు వాటి కార్యక్రమాల వివరణాత్మక నివేదికలు పంపబడాలి. ఈ నివేదికల ద్వారా కేంద్ర వ్యవస్థకు ఇతర విషయాలతోపాటు, అధ్యక్షుల శిక్షణా

కార్యక్రమాలు ఎలా ఉన్నాయి? ధార్మికంగా నైతికంగా కార్యాచరణ పరంగా సభ్యుల స్థితిఏమిటి? అనే విషయాలు తెలుస్తాయి. తదనుగుణంగా అవసరమైన ఆదేశాలు జారీ చేయబడతాయి. అమీరె జమాఅత్, ఖయ్యిమె జమాఅత్ వారి సహాయకులు సమావేశాలలో అవసరాన్ని బట్టి, అవకాశాన్ని బట్టి దేశమంతటా పర్యటిస్తారు. దీని అసలు ఉద్దేశం స్థానిక జమాఅత్‌ల స్థితిగతులను దగ్గరగా ఉండి పరిశీలించడం మరియు అక్కడి సభ్యులకు శిక్షణ ఇవ్వడం.

★ స్థానిక జమాఅత్‌ల వారాంతపు సమావేశాలేకాక, వివిధ సందర్భాలలో జిల్లా, రాష్ట్ర మరియు అఖిల భారత సమావేశాలు కూడా ఏర్పాటు చేయబడతాయి. వాటిలో కూడా అధికభాగం సభ్యుల శిక్షణ కొరకే ఉంటుంది.

**కార్యరంగ శిక్షణ**

సభ్యుల శిక్షణకు చేపట్టిన ఈ ఉపాయాలు, ప్రయత్నాలు సైద్ధాంతికమైనవి. దానితోపాటు కార్యరంగ శిక్షణ కూడా ఉంటుంది. అది వారికి సందేశ రంగంలో స్వతహాగా లభిస్తుంది. వారు సత్యానికి సాక్షులుగా, దైవధర్మ ప్రచారకులుగా, స్థాపకులుగా కార్యోన్ముఖులై ముందుకు సాగుతారు. తద్వారా సహజంగానే వారి శిక్షణకు ఎన్నో మార్గాలు తెరుచుకుంటాయి. ఉదాహరణకు ఒక వ్యక్తి ఇతరులకు దైవదాస్యానికి సందేశ మిస్తున్నప్పుడు విశ్వాస ప్రమాణాలను పాటించమని ప్రబోధిస్తున్నప్పుడు ఆ వ్యక్తి అంతరాత్మ ఘోషిస్తుంది. మరియు బాహ్యా ప్రపంచం కూడా సునిశిత దృష్టితో అతని నడవడికను గమనిస్తుంది. ఈ విషయంలో స్వయంగా నీ సంగతేమిటి? అని ప్రశ్నిస్తుంది. ఏ ధర్మ ప్రబోధాన్ని ఇతరులకు నీవు చేస్తున్నావో దాని మాధుర్యాన్ని నీవు కూడా ఆస్వాదిస్తున్నావా? అని నిలదీస్తుంది. ఆ వ్యక్తి ఆత్మాభిమానం కలవాడై ఉంటే నలుదిశల నుండి వచ్చిపడుతున్న ఈ విమర్శలకు తప్పకుండా స్పందిస్తాడు. తన అంతరంగం వైపు దృష్టిసారించి తన విశ్వాసం ఆచరణలో ఉన్న లోటుపాట్లకు పశ్చాత్తాప పడుతూ వాటిని సరిదిద్దుకుంటాడు.

అదేవిధంగా ఈ సందేశ ప్రచారంలో నలుదిశల నుండి ఎదురయ్యే

విరోధాలు, శత్రుత్వాలు కష్టాలవల్ల కొలిమిలో కాలి అతని విశ్వాసం మరింత మేలిమి అవుతుంది. కేవలం దైవధర్మం కోసం కృషిచేసిన నేరానికి ప్రపంచం అతడికి సకల సౌలభ్యాల నుండి దూరం చేసినప్పుడు, సహజంగా అతడు తన ప్రభువు వైపు మరలుతాడు. అతడి సాన్నిధ్యంలో శరణు వేడుకుంటాడు. తద్వారా తన ప్రభువుతో అనుబంధం పెరిగిపోతుంది. ఆపద్బాంధవుడు అతడే అనే విశ్వాసం దృఢతరమవుతుంది. ప్రజలు అతని సందేశాన్ని పట్టించుకోకుండా వినాశనం కల్గించే విధానాలను విడనాడుటకు ఏమాత్రమూ అంగీకరించనప్పుడు, అతని సందేశ స్ఫూర్తి చల్లారిపోయే బదులు మరింతగా ప్రజ్వరిల్లుతుంది. శ్రేయోసాఫల్యాలు, విముక్తిని ప్రసాదించే సక్రమ మార్గంవైపు ప్రజలను మరల్చడానికి ద్విగుణీకృత ఉత్సాహంతో పని చేస్తాడు. మొత్తానికి ఒక సత్యసందేశహరుని సందేశ ప్రచార ప్రయత్నాలు విభిన్నకోణాల నుండి అతడి శిక్షణకు దోహదపడతాయి. స్వచ్ఛత – సత్యసంధత పాటించక కేవలం పేరుకు మాత్రమే సందేశహరునిగా చలామణి అవుతున్న వ్యక్తిని వదిలేయండి. అలాంటి వ్యక్తి తన సందేశ ప్రచార ప్రయత్నాల ద్వారా విశ్వాస–ఆచరణల పరిపక్వతలను పొందజాలడు. పైగా తన దౌర్బల్యాన్ని బహిర్గతం చేసి కార్యరంగం నుండి పారిపోతాడు. కాని ఇక్కడ కేవలం చిత్తశుద్ధి గల వ్యక్తుల గురించి చెప్పుకుంటున్నాం. నామమాత్రపు వ్యక్తుల గురించి కాదు. ఇంతకు ముందు నియమావళిలో తెలిపినట్లుగా ప్రతి ఉద్యమ సభ్యునికి సందేశ ప్రచారం తప్పనిసరి విధిగా చేయబడింది. కాబట్టి సందేశ కార్యరంగంలో ఈ విశిష్ఠ శిక్షణ కొంత వరకైనా తప్పకుండా ప్రాప్తమవుతుంది.

ఇస్లామీయ ఉద్యమ దృష్టిలో తన సభ్యుల శిక్షణ నిమిత్తం ఈ సైద్ధాంతిక, కార్యరంగ శిక్షణలు రెండూ సమంగా అవసరమే. వీటిలో ఏది విడనాడినా తన శిక్షణా లక్ష్యాన్ని అది సాధించలేదు. ఈ రెండింటి ఆవశ్యకత ఎలాంటిదంటే ఏ ఒకదానిని ఉపేక్షించినా రెండవదాని ప్రాముఖ్యత చాలావరకు తగ్గిపోతుంది. అంటే వీటి ఆవశ్యకత ఒక వాహనానికి ఉన్న రెండు చక్రాల్లాంటివి. ఏకచక్రంపై సందేశ వాహనం ముందుకు సాగదు.

**కావలసిన ప్రమాణం**

ఇస్లామీయ ఉద్యమం తన సభ్యులను ఏ మేరకు 'సుశిక్షితులుగా' చేయదలచిందో వారి శిక్షణకు వాంఛనీయ ప్రమాణాలేమిటో రెండు మాటల్లో చెప్పాలంటే, 'ప్రజలు దాని విధానాలను పూర్తిగా ఆచరించాలి. వారి విశ్వాసం గుణగణాలు, వ్యవహారాలు, ఆలోచనా తీరు ప్రతి విషయంలో ఒక సత్యవం తుడైన విశ్వాసిగా (మోమిన్‌గా), నికార్సయిన దైవ సందేశహరునిగా ఉండాలి." ఈ విషయాన్ని అది నిగూఢంగా, అస్పష్టంగా ఉంచలేదు. చాలా స్పష్టంగా విశదీకరించింది. ప్రతి సభ్యుని కళ్ళముందు ఎల్లప్పుడూ ఉండటానికి నియమా వళిలో పొందుపర్చింది. వాటిని ఈ దిగువన పేర్కొనటం జరిగింది.

**ప్రతి జమాఅత్ సభ్యుడు-**

1) ఇస్లాం అంటే ఏమిటో, అజ్ఞానం (ఇస్లామేతర విషయాలు) అంటే ఏమిటో, వాటి మధ్య గల వ్యత్యాసం ఏమిటో తెలుసుకోవాలి.

2) అల్లాహ్‌తో సంబంధ బాంధవ్యాలను ఇతోధికంగా పటిష్టవంతం చేసు కోవాలి. దీనికి గాను విద్యుక్త ఆరాధనల(ఫరాయెజ్)తోపాటు అదనపు (నవాఫిల్) ఆరాధనలు, దైవసంస్మరణ ఖుర్‌ఆన్ పారాయణం, ఇత్యాదివి క్రమబద్ధంగా పాటించాలి.

3) అన్ని వ్యవహారాలలోనూ తమ దృక్కోణాన్ని, అభిప్రాయాన్ని ఆచరణను, దైవబోధనల కనుగుణంగా మలుచుకోవాలి. తమ జీవిత ధ్యేయం, తమ ఇష్టం, విలువల ప్రమాణాలను, తమ విశ్వసనీయతా కేంద్రాన్ని మార్చు కుని దైవప్రసన్నత కనుగుణంగా మలచుకోవాలి. తమ అహంకారాన్ని, మనోవాంఛ ప్రియత్వాన్ని రూపుమాపి దైవాదేశాలకు లోబడిపోవాలి.

4) షరీఅత్ ఆదేశాలకు విరుద్ధమయిన అజ్ఞానపు ఆచారాలను తమ జీవితం నుండి దూరం చేసుకోవాలి.

5) మనోవాంఛలు, ప్రాపంచిక వ్యామోహం ఆధారంగా ఏర్పడే, ధర్మంలో ఎలాంటి ప్రాముఖ్యంలేని అభిమానాల నుండి, అభిరుచుల నుండి తమ

అంతర్యాన్ని పరిశుద్ధం చేసుకోవాలి. అలాగే అలాంటి కార్యకలాపాల నుండి, వివాదాల నుండి, వాదోపవాదాల నుండి తమ జీవితాన్ని పరిశుద్ధ పరుచుకోవాలి.

6) పాపాత్ములతోనూ, అవిధేయులతోనూ, దైవాన్ని మరచిన వారితోనూ ప్రేమాభిమానాలను, మైత్రి సంబంధాలను, మానవీయ సంబంధాలను పెంచుకోవటం కాదు, తెంచుకోవాలి. సజ్జనులతో, దైవభక్తి పరాయణు లతో సంబంధాలు ఏర్పరచుకోవాలి.

వివరణ: పాపచరితులు, ధర్మదోషులతో దగ్గరి కుటుంబ సంబంధాలున్న ట్లయితే షరీఅత్ రీత్యా వారి హక్కులను ఎట్టి పరిస్థితుల్లోనూ నెరవేర్చ వలసి ఉంటుంది. సముచిత రీతిలో వారితో సామాజిక సంబంధాలు కలిగే ఉండాలి. అయితే వారి తప్పుడు పనులకు మాత్రం దూరంగా మసలుకోవాలి. ఓరిమితో, వివేకంతో వారి సంస్కరణకు ప్రయత్నిస్తూ ఉండాలి.

7) దైవేతర ప్రభుత్వ వ్యవస్థలో భాగంగానో, లేక దాని శాసనాలను అమలు పర్చడంలో సహాయకులుగానో ఉన్నట్లయితే అటువంటి జీవనోపాధి నుండి వీలయినంత త్వరగా విముక్తి పొందాలి.

8) ఇస్లామేతర న్యాయస్థానాల్లోకి గత్యంతరం లేని స్థితిలో తప్ప తమ వ్యవహారాల తీర్పునకు వెళ్ళరాదు.

9) తమ వ్యవహారాలన్నింటినీ, నిజాయితీ, న్యాయం, దైవభక్తి, నిష్పక్షపాతం సత్యప్రియత్వం ఆధారంగా ఏర్పరుచుకోవాలి.

10) తమ కార్యకలాపాలు, కృషిని ధర్మసంస్థాపనా ధ్యేయం కొరకే కేంద్రీకృతం చెయ్యాలి. తమ జీవితంలోని నిజ అవసరాలు తప్ప ఈ ధ్యేయానికి దూరం చేసే ఇతర కార్యకలాపాలన్నింటినీ పరిత్యజించాలి.

పై విశదీకరణలకు అనువుగా రూపొందే ఆలోచనలు, ఆచరణల స్వరూపమే, ఈ శిక్షణ యొక్క వాంఛనీయ ప్రమాణం. ఉద్యమం తన సభ్యులను

ధర్మపరంగాను, విశ్వాస పరంగాను అలాంటి ఉన్నత స్థితిలో చూడదలుస్తుంది. దాని యావత్తు శిక్షణా విధానం తన సభ్యులను ఆ ఉన్నత స్థితికి చేర్చడానికి రూపొందించబడింది.

**సామూహిక వ్యవస్థ ప్రక్షాళన**

పైన తెలిపినట్లుగా శిక్షణ కొరకు రూపొందించబడిన ఈ క్రియాత్మక వ్యవస్థ అంతా ఉభయుతారకమైనది. ద్వైపాక్షికమైనది. కాని శిక్షణ ఉద్దేశమేమిటంటే, దానిని పొందడమే కాదు, దానిని పరిరక్షించుకోవాలి కూడా. దానికోసం ఇస్లామీయ ఉద్యమం సులువైన విషయాలనే కాకుండా మనసుకు భారమనిపించే విషయాలను కూడా రూపొందించింది. శిక్షణ సత్ఫలితాలను సంరక్షించడానికి ఇది ఎంతో అవసరం. అదెలాగంటే, ఏ సభ్యుడైనా, శిక్షణ, సంస్కరణల సకల ప్రయత్నాల తర్వాత కూడా అధమ స్థాయి నుండి పైకి రానప్పుడు, ఒక ఉద్యమ సభ్యునికి తప్పనిసరిగా ఉండవలసిన విశ్వాసం-ఆచరణస్థాయి దిగజారినప్పుడు అతని సభ్యత్వం రద్దుచేయబడుతుంది. ఉద్యమ వ్యవస్థకు వెలుపల ఉంటూ తనను సంస్కరించుకోవల్సిందిగా సలహా ఇవ్వ బడుతుంది. ఒక వ్యక్తిని సభ్యత్వం నుండి తొలగించడానికి గల కారణాలు నియమావళిలో వివరంగా తెలుపబడ్డాయి. పనికిరాని వ్యక్తుల నుండి ఉద్యమ వ్యవస్థను ప్రక్షాళనం చేసే ఈ విధానం చలామణిలో ఉన్న పద్ధతుల అనుకరణ కాదు. శిక్షణా ఆశయాన్ని పరిపూర్తిగా పొందడానికి ఈ ప్రక్షాళన అవసరం. ఇంకా రెండు కారాణాల వల్ల దాని ఆవశ్యకత ఉంది. ఒక కారణం : శిక్షణ ఉద్దేశాన్ని పనికిరాని వ్యక్తులు విపరీతంగా నష్టపరుస్తారు. ఉద్యమ ఔన్నత్యానికి సాక్షులయ్యే బదులు, ఉద్యమ పతనానికి కారకులవుతారు. రెండోకారణం-వారి అంటురోగం ఇతర పుణ్యాత్ములకు కూడా అంటుకునే అవకాశం ఉంది. విశ్వాసం, ఆచరణ, స్వభావం, గుణగణాలు అధమ స్థాయిలో ఉన్నప్పటికీ ఇస్లామీయ ఉద్యమ సభ్యునిగా కొనసాగవచ్చని ఇతర సభ్యులు కూడా భ్రమపడి అధమస్థాయికి దిగజారవచ్చు.

# ఇస్లామీయ ఉద్యమం నేటి సామాజిక వ్యవస్థ

## ముఖ్య ప్రశ్న

ఇతర ఉద్యమాల విషయంలో ఈ ప్రశ్న తలెత్తదు. తలెత్తినా దాని ప్రాధాన్యత అంతగా ఉండదు. కాని యావత్ జీవన వ్యవస్థను మార్చివేసి సరికొత్త వ్యవస్థను నిర్మించదలచిన ఇస్లామీయ ఉద్యమ విషయంలో మాత్రం "దేశంలో చలామణిలో ఉన్న నేటి సామాజిక వ్యవస్థతో దాని సంబంధ బాంధవ్యాలు ఎలా ఉంటాయి?" అనే ప్రశ్న ప్రత్యేక ప్రాధాన్యతను సంతరించు కుంటుంది. కాబట్టి భారత ఇస్లామీయ ఉద్యమ విషయంలో దీనిని గూర్చి వివరంగా తెలుసుకోవాలి. ఇది ఒక రాజకీయ సామాజిక సమస్య కాబట్టి దీనిపై చర్చించటానికి సరియైన పద్ధతి ఏమిటంటే- మొదట ఈ వ్యవస్థ మౌలిక విధానాలు స్పష్టంగా- ఖచ్చితంగా ముందుంచుకోవాలి. తర్వాత దానికి ప్రతిగా ఇస్లామీయ ఉద్యమ రాజకీయ విధానాలేమిటి? వాటి నైజం, స్థాయి ఏమిటి అనేది చూడాలి. ఇలా పోల్చి చూసిన తర్వాత ఆ ప్రశ్నకు సమాధాన మేమిటో సలువుగా అర్ధమవుతుంది.

## ఈనాటి రాజకీయ వ్యవస్థ యొక్కసైద్ధాంతిక పునాదులు

ఈనాటి మన వ్యవస్థ రాజకీయంగా, సామూహికంగా ఏ ప్రాథమిక సిద్ధాంతాలపై ఆధారపడి ఉన్నదో చూడండి.

**1) మానవ ఆధిపత్యం:** అంటే దేశప్రజలు తమకు తామే అధిపతులు-

సర్వాధికారులు. పరిపాలించడానికి చట్టాలు చేయడానికి వారికే అధికారముంది. తమకోసం జీవన విధానాన్ని చట్టాలను ఆదేశాలను రూపొందించడంలో వారికి ఎవరి అనుమతీ అవసరం లేదు. ఎవరిముందు కూడా సంజాయిషీ చెప్పే అవసరం లేదు. ప్రతి విషయంలో అంతిమ నిర్ణయం వారిదే.

**2) ప్రజాస్వామ్యం (డెమోక్రసీ) :** అంటే తమ జీవన వ్యవస్థను, చట్టాలను, విధానాలను రూపొందించడానికి, వారికి ఉన్న హక్కును ఎన్నికలలో ప్రాతినిధ్యం వహించిన వారి ద్వారా సాధించుకుంటారు. వారు తమ అధికారం చలాయించే హక్కును తమ స్వేచ్ఛతో ఇష్టపూర్వకంగా ఎన్నుకున్న ప్రతినిధులకు అప్పగిస్తారు. వారు ప్రజల అభీష్టం మేరకు దేశం కొరకు చట్టాలు చేసి వాటిని ఆచరణలో పెడ్తారు.

**3) మత ప్రమేయం లేని వ్యవస్థ (సెక్యులరిజమ్) :** అంటే ప్రజలచే ఎన్నుకోబడిన ప్రతినిధులు, చట్టాలను, విధానాలను రూపొందించడంలో ఏదేని మతాన్ని గానీ, దైవమార్గదర్శకత్వాన్ని గానీ అంగీకరించరు. తమ పరిజ్ఞానం, అభీష్టానుసారం చట్టాలు విధానాలు రూపొందిస్తారు. అంటే మతాన్ని సామాజిక, రాజకీయ వ్యవస్థ నుండి పూర్తిగా దూరం చేస్తారు. కాని ఒక పరిమితమైన పరిధిలో, దేశ శాంతిభద్రతలు, ప్రజల జీవన వ్యవస్థపై దాని దుష్ప్రభావాలు, పడనంతవరకు మతాన్ని అనుమతిస్తారు. ఈ విధంగా మత స్వాతంత్ర్యపు హద్దులు స్పష్టంగా మత ఆచారాలు, ఆరాధనల వరకే పరిమితమై ఉంటాయి. వాటిని తప్పించి మానవ జీవిత ప్రతి వ్యవహారం, ప్రతి సమస్య ప్రభుత్వ అధికార పరిధిలో, అధీనంలో ఉంటుంది. చివరకు ఆస్తిపంపకాలు, వివాహం, విడాకుల విషయాలు కూడా మత పరిధిలో లేకుండాపోతాయి. రానురాను జీవితంలోని ఏ విభాగం మతపరమైనదీ, ఏది కాదనే విషయం నిర్ణయించడం, మతాధీనంలో ఉండదు. పూర్తి నిర్ణయాధికారం ప్రభుత్వానికి దాని చట్టాలకు దక్కుతుంది. వివిధ మతాలతో ప్రభుత్వ వ్యవహారశైలి ఎలా ఉంటుందంటే, సూత్రప్రాయంగా అది నిష్పక్షపాతంగా ఉంటుంది. అధిక సంఖ్యాకులు, అల్ప సంఖ్యాకుల మతమని ఆలోచించదు. అన్నిటితో ఒకే విధంగా వ్యవహరిస్తుంది.

అన్నిటినీ సమానంగా చూస్తుంది. ( ఈ విధానానికి అది ఎంత వరకు కట్టుబడి ఉంటుందనేది వేరే ప్రశ్న).

## ఇస్లామ్ మౌలిక రాజకీయ సిద్ధాంతాలు

నేటి వ్యవస్థకు ప్రతిగా ఇస్లామీయ వ్యవస్థ– ఇస్లామీయ ఉద్యమ మౌలిక రాజకీయ సిద్ధాంతాలు ఇవి:

### 1) అల్లాహ్ ఆధిపత్యం

అంటే సమస్త మానవ జీవితపు అసలు అధిపతి, సర్వోన్నత అధికారి అల్లాహ్. ఎందుకంటే మానవులంతా ఏ విశ్వానికి చెందిన చిన్న అంశమో, దానిని సృష్టించినవాడు, పోషకుడు అల్లాహ్‌యే. కాబట్టి ఈ విశ్వానికి సర్వమానవాళికి స్వామి, సర్వాధికారి వాస్తవంగా అతడే. అధికారం చలాయించే హక్కు సర్వోన్నత అధికారం అతనికే చెందుతుంది. అతడే మానవునికి సరియైన జీవిత విధానాన్ని ఇవ్వగలడు. చట్టాలు– విధానాలు రూపొందించగలడు. ఇతరులకెవరికీ అతడిని శాసించే హక్కు లేదు. ఎవరూ అతనికి నిజ అధికారులు కారు. చట్టాలను రూపొందించేవారు కాజాలరు. ఇతరులెవరూ నిజ ప్రభువులు కారు.

### 2) మానవుల ప్రాతినిధ్యం

అంటే మానవుడు ఈ ప్రపంచంలో తన నిజప్రభువు అల్లాహ్ యొక్క ప్రతినిధి. మరియు రాయబారి. అతనికి స్వతహాగా ఎలాంటి అధికారమూలేదు. సర్వవిశ్వానికి వాస్తవ ప్రభువు, సర్వోన్నత అధికారి ప్రసాదించిన అధికారం– స్వేచ్ఛకు అతడు కేవలం అమానతుదారుడు. మానవ వాస్తవ స్థితి ఏమిటంటే నిజప్రభువు ప్రసాదించిన అధికారాన్ని అతని అభీష్టానుసారం ఉపయోగించాలి. తన జీవిత విధానాలు అల్లాహ్‌కు ఆమోదయోగ్యంగా ఉండాలి. వ్యక్తిగత సామూహిక ఆలోచనలు విధానాలు, అతని ఆదేశాలకు అనుగుణంగా ఉండాలి. ఈ విషయంలో మానవులంతా సమంగా బాధ్యులు. తమ తమ పరిధిలో అందరూ ఈ బాధ్యతను నెరవేర్చవలసిందే. రాజకీయ రంగంలో ఈ బాధ్యతను ప్రజాస్వామ్యం మాదిరిగానే ఎన్నుకోబడిన ప్రతినిధుల ద్వారానే నెరవేర్చగలరు.

కాని ఎన్నుకోబడిన ఈ ప్రతినిధులు, ప్రజాస్వామ్యంలోని ప్రతినిధుల వలె తమ విధులను నెరవేర్చడానికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కలిగి ఉండరు. దైవా దేశాలకు ఉపదేశాలకు కట్టుబడి ఉంటారు. నిజం చెప్పాలంటే వారు తమ నిజప్రభువు అభీష్టాన్ని నెరవేరుస్తారని, ప్రజలది ప్రజాస్వామ్యానిది కాదని చెప్పవచ్చు.

### 3) షరీయత్ చట్టం

అంటే మానవ జీవితానికి ఏ పద్ధతి చట్టము ఆవశ్యకమైనదో దానిని ఏ వ్యక్తి గానీ, ఏ చట్టసభగానీ రూపొందించవలసిన అవసరం లేదు. నిజస్వామి అధిపతి వాటిని అవసరమైనంత మేరకు తన ప్రవక్తల ద్వారా స్వయంగా ప్రసాదించాడు. అతనే స్వామి అధిపతి కావడం వల్ల అలా చేయడం అతని ఆవశ్యకత. మానవులంతా ఈ దైవాదేశాలను అరమరికలు లేకుండా ఆచరిం చాలి. హెచ్చుతగ్గులు లేకుండా దైవాదేశాలన్నింటినీ, వ్యక్తిగత సామాజిక జీవితా లలో సంపూర్ణంగా స్థాపించాలి. అది కాకుండా అతను మరే చట్టాన్నీ తయారు చేయలేడు. దానిని ఆచరించలేడు. అలా చేస్తే తన వాస్తవిక స్థానము (దైవ ప్రాతినిధ్య స్థానం) ఉల్లంఘించినవాడుగా, తన ప్రభువుపై తిరుగుబాటుచేసిన నేరస్తునిగా పరిగణించబడతాడు. కాని వివరణావశ్యకతగల విషయాలలో షరీయత్ యందు స్పష్టమైన ఆదేశాలు లేనప్పుడు లేదా నాగరికత అభివృద్ధి చెందడం వల్ల కొత్త సమస్యలు ఉత్పన్నమైనప్పుడు అతను పరస్పర సలహా సంప్రదింపులతో చట్టాలు చేయవచ్చు. తప్పకుండా చేయాలి కూడా. కానీ ఈ విషయంలో కూడా షరీఅత్ ఆశయాలు, దాని తీరు తెన్నులు, దాని మౌలిక విధానాలు, సిద్ధాంతాలు దృష్టిలో పెట్టుకోవాలి. అంటే అవసరమైనప్పుడు ఈ వివరణాత్మక చట్టాలు చేయడం కూడా దైవ షరీయత్‌ను అధిగమించి కాదు, దానికి లోబడి చేయాలి. (వివరణ కోసం 'నిర్మాణం విచ్ఛిన్నం, ఇస్లామీయ జీవన వ్యవస్థ పుస్తకాలు చదవండి). ఇంతవరకు ఇస్లాంలో రాజకీయ వ్యవస్థకు చెందిన మౌలిక విధానాల పరిచయం చేయటం జరిగింది. ఇక ఈ సిద్ధాంతాల స్థానం ఏమిటో తెలుసుకోవాలి. వీటిస్థానం ఒక సిద్ధాంతానిది కాదు,

విశ్వాసానిది. ఈ సూత్రాలు శాస్త్రీయ, సైద్ధాంతిక సూత్రాలు కావు, ఇవి ధార్మిక సూత్రాలు. వీటిని ఆచరించడం ఇస్లాంపై విశ్వాసమున్న వారి జ్ఞానపరమైన అవసరం కాదు ధార్మిక అవసరం. వాటి ఆచరణపై కేవలం ప్రాపంచిక ఫలితాలే కాదు, పరలోక ఫలితాలు కూడా ఆధారపడి ఉన్నాయి. వాటిని విడిచి పెట్టడం సమంజసత, నియమబద్ధతల పట్ల విముఖతే కాదు, ధర్మం-దైవారాధన పట్ల కూడా విముఖతే.

## ఇస్లామీయ ఉద్యమ దృష్టిలో నేటి వ్యవస్థకు ఉన్నస్థానం

నేటి రాజకీయ వ్యవస్థ మరియు ఇస్లామీయ వ్యవస్థ యొక్క మౌలిక విధానాలను, భావనలను ఒక దానితో ఒకటి పోల్చి చూసినట్లయితే తూర్పు పడమరలకున్న వ్యత్యాసం వాటి మధ్యలో ఉంది. వాటిలో స్పష్టమైన వైరుధ్యం కనబడుతుంది. నిస్సందేహంగా ఈ వైరుధ్యం సామాన్యమైనది, పరిమితమైనది కాదు. ఎంత తీవ్ర వైరుధ్యమంటే, నేటి ప్రజాస్వామ్య విధానం ఇస్లాం యొక్క రాజకీయ వ్యవస్థనే కాదు, దాదాపు దాని సంపూర్ణ జీవన వ్యవస్థనే వ్యతిరేకిస్తుంది. ప్రజాస్వామిక రాజకీయ సిద్ధాంతాలపై, విధానాలపై స్థాపించబడిన రాజ్యము రానురాను తన అధికారాన్ని విస్తరించుకుంటూ మానవ జీవిత రంగాలన్నింటినీ తన గుప్పిటలో బంధించింది. చివరకు అది మత విశ్వాసాలు ఆరాధనలలో కూడా జోక్యం చేసుకోవడం మొదలుపెట్టింది. ఇలాంటి స్థితిలో ఈ వైరుధ్యం ఇంకా అధికమవుతుంది. కాబట్టి ఇస్లామీయ ఉద్యమానికి నియమానుసారం నైతిక, ధార్మికపరంగా ఈ ప్రజాతంత్ర విధానానికి అనుకూలంగా ఉండడానికి దానిని భరించడానికి ఏమాత్రం అవకాశం లేదు. ఎందుకంటే అలా చేసిన పక్షంలో అది తనను తాను తప్పుబట్టినట్లు లేదా తన్ను తాను రద్దు చేసుకున్నట్లు- చివరకు ధర్మసంస్థాపన ఆశయం లేని సంస్థగా మారినట్లు అర్థం స్ఫురిస్తుంది. ఇది ఒక ధర్మసంస్థాపన ఉద్యమం కనుక ప్రస్తుతం చలామణిలో ఉన్న జీవిత విధానం సరియైనది కాదని, ధర్మవిరుద్ధమని భావించాలి. కేవలం భావించడమే కాదు స్పష్టంగా ప్రకటించాలి. సమంజసమైన ప్రామాణికమైన ఆధారాలతో అది సరియైనది కాదని నిరూపించి, దానిని ఏకాకిని

చేయాలి. దైవదాసులకు దానివల్ల కలిగే నష్టాలను వివరించి, వారిని ఆ వ్యవస్థను మార్చడానికి ప్రేరేపించాలి. అందువల్లనే ఈ ఉద్యమం, ఈ వ్యవస్థను నడపడానికి జరిగే ఎన్నికలలో పాల్గొనడం సమంజసం కాదని భావిస్తుంది. ఎప్పుడైనా ఇస్లామీయ ఉద్యమం పాల్గొన్నా అది కేవలం ఈ వ్యవస్థను ఇస్లామీయ వ్యవస్థగా మార్చడానికి లేదా దాని మార్గం సుగమం చేయడానికి మాత్రమే పాల్గొంటుంది కానీ దానిని బలపర్చడానికి ఎంతమాత్రం కాదు.

## స్వచ్ఛంద సహకారం తగదు

ప్రస్తుత వ్యవస్థ గురించి ఇస్లామీయ ఉద్యమ వైఖరి ఎలా వుందో, దాని సభ్యుల వ్యవహార శైలి కూడా స్వాభావికంగా అలాగే ఉంటుంది. వారు మన స్ఫూర్తిగా ఆ వ్యవస్థతో సహకరించరు. ఆ వ్యవస్థకు పావులుగామారటం వారికి ఇష్టముండదు. దాని న్యాయస్థానాలలో జడ్జీలుగా, న్యాయమూర్తులుగా పదవులు చేపట్టరు. దాని విద్యావిధానం ద్వారా అది సాధించదలచిన ఆశయాన్ని సాధించడానికి తన పరిజ్ఞానాన్ని బోధనా నైపుణ్యాలను అంకితం చేయజాలరు. ఎందుకంటే ఒక మత ప్రమేయంలేని ప్రజాస్వామిక వ్యవస్థను నమ్మిన వ్యక్తే దాని కార్యనిర్వహణ విభాగంలో చేరి దాన్ని నడపడం నిజాయితీ సమంజసత్వం అనిపించుకుంటుంది. కాని అది సరియైనది కాదని, అదొక భ్రష్టుపట్టిన వ్యవస్థ అని భావిస్తూ కూడా ఆ వ్యవస్థను నడపడానికి ఇష్టపూర్వకంగా సహకరించినట్లయితే అతడు అత్యంత నీచమైన కపట వర్తనుడని లేదా ఆత్మాభిమానాన్ని అమ్ముకొనే వాడని భావించబడుతుంది. కాబట్టి మీరు ఒక నిజమైన కమ్యూనిస్టు 'బూర్జువా' వ్యవస్థను నడపడానికి తన శక్తియుక్తుల్ని అమ్ముకున్నట్లు లేదా ఒక నిజమైన ప్రజాస్వామ్యవాది ఒక నియంతృత్వ వ్యవస్థను స్థాపించడానికి తన సేవలను అందించినట్లు ఎక్కడా చూడరు. ఎవరైనా అలాచేస్తే ప్రపంచమంతా అతడిని అంతరాత్మను చంపుకున్నవాడనీ, అవకాశవాది అని ముద్ర వేస్తుంది. ఇస్లామీయ ఉద్యమ ధ్వజవాహకులు మరియు దైవధర్మస్థాపన కార్యదీక్షగల ముస్లింల పరిస్థితి ఇతరులకంటే ఎన్నోరెట్లు ప్రముఖమైనది. ఇతరులకొరకు సామ్యవాదం, ప్రజాస్వామ్యం అనేవి కేవలం అభిప్రాయం, సిద్ధాంతం వరకే

పరిమితమైన వ్యవహారం కావచ్చు. కాని ఒక ముస్లిం విషయంలో విశ్వాసం-ధర్మసంస్థాపన ఒక ధార్మిక బాధ్యత. జీవిత పరమార్థానికి చెందిన సమస్య. ఒక సమసమాజ స్థాపకుడు, పెట్టుబడిదారి వ్యవస్థకు, ఒక ప్రజాస్వామ్యవాది, నిరంకుశ వ్యవస్థకు చెందిన విధి విధానాలను అందలమెక్కించినట్లయితే, అతను కేవలం తన ఆత్మ వంచన చేసుకుంటాడు. ప్రపంచ నగుబాటుకు గురవుతాడు. మరి ఒక ముస్లిం గనుక భ్రష్టుపట్టిన ఇస్లామేతర వ్యవస్థకు ఇష్టపూర్వకంగా సహకరించినట్లయితే, తన ఆత్మనేకాదు, విశ్వాసాన్ని కూడా ఖూనీ చేస్తాడు.

కేవలం ఇహలోకంలోనే కాదు, పరలోకంలో కూడా భంగపడతాడు. ఇది అసలు విషయం. కాగా, ఇస్లామీయ ఉద్యమ సభ్యులకు ప్రాపంచిక లాలసత్వం, ధనాపేక్షకు లోనై ఈ ప్రజాస్వామ్య ప్రభుత్వంలో సంతోషపూర్వకంగా భాగస్వాములు కావడానికి హక్కులేదు. ఇతరులు కూడా వారిపై అలాంటి ఆశ పెట్టుకోరాదు. ఒకవేళ ఏ వ్యక్తియైనా ఆ భాగస్వామ్యానికి సమాయత్తమైతే మాత్రం అతను తన గురించి ఎంతగొప్పగా భావించుకున్నాగాని, ధర్మసంస్థాపన ఉద్యమ ధ్వజవాహకునిగా మాత్రం ఖచ్చితంగా ఉండలేడు.

ఈ స్వచ్ఛంధ సహకార విషయాన్ని మరో దృక్కోణం నుండి కూడా చూడండి. ఇస్లామీయ ఉద్యమ ఆశయం ఇస్లామీయ వ్యవస్థను స్థాపించడం. ఖచ్చితంగా దాని అర్థమేమిటంటే, నేడు చలామణిలో ఉన్న వ్యవస్థను మార్చ డానికి అది అన్ని విధాల కృషి చేస్తుంది. ఎందుకంటే, చలామణిలో ఉన్న వ్యవస్థను అధికారం నుండి తొలగించనంతవరకు, మరో వ్యవస్థకు చోటుండదు. వాస్తవికత ఇలా ఉండగా, ఇస్లామీయ ఉద్యమ సభ్యులు అలాంటి వ్యవస్థతో స్వచ్ఛంధంగా సహకరించడానికి మదిలో ఆలోచన కూడా రాదని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఎందుకంటే దేనితోనైనా సంతోషపూర్వకంగా సహకరించినట్లయితే, దాని అస్తిత్వాన్ని దృఢపర్చడానికి, దాని ఆశయాలను బలపర్చడానికి అది దోహదపడుతుంది. కాబట్టి నేటి ఇస్లామేతర వ్యవస్థకు ఇష్టపూర్వకంగా సహకరించడం అంటే అధికార పీఠం నుండి తొలగించడానికి కాకుండా

బలోపేతం చేయడానికి తప్పకుండా దోహదపడినట్లవుతుంది. వాస్తవంగా ఇస్లామీయ ఉద్యమ సభ్యులు "మా సర్వశక్తులు ఇస్లామీ జీవన వ్యవస్థను స్థాపించడానికి ధారపోస్తాము" అని సృష్టికర్త ముందు వాగ్దానం చేశారు. సర్వజీవరాసుల ముందు ప్రకటించారు. ఇలాంటి స్థితిలో ఒకవేళ వారు ప్రస్తుత మున్న ఇస్లామేతర వ్యవస్థ విధానాలకు తమ హార్ధిక సహకారం, సేవలతో బలోపేతం చేసినట్లయితే నిస్సందేహంగా వారు తమ ప్రకటనలో సత్యవంతులు కారు. తమ వాగ్దానంలో విశ్వాసపాత్రులు కారు. ఎందుకంటే ఈ వ్యవస్థ ఇస్లామీయ వ్యవస్థకు బద్ధ శత్రువు. దీని ప్రగతి– స్థిరత్వమునకు ముందుకు వేసే ఒక్క అడుగు ఇస్లామీయ వ్యవస్థ స్థాపనను పది అడుగులు వెనక్కి నెట్టివేయ గలదు. కాబట్టి ఎవరైనా ఇస్లామీయ వ్యవస్థను స్థాపించే కాంక్షలో, కృషిలో సత్యవంతుడైతే, ఏకాగ్రత కలిగి ఉంటే, నిష్కల్మష హృదయంతో దానిని తన జీవితాశయంగా రూపొందించుకొని ఉంటే సహజంగా అతని మదిలో ప్రస్తుత వ్యవస్థకు స్వచ్ఛంద సహకారం అందజేసే ఆలోచన కూడా రాకూడదు. ఈ రెండు సైద్ధాంతిక అవరోధాల మూలంగా, ప్రస్తుతమున్న వ్యవస్థకు స్వచ్ఛంద సహకారాలు అందించకుండా దూరంగా ఉండటం అవసరం.

ప్రస్తుతమున్న వ్యవస్థకు స్వచ్ఛంద సహాయ సహకారాలు అందించకపోవ డానికి అసలు కారణం ఇదే. అందువల్లే ఇస్లామీయ ఉద్యమ సభ్యులు ఆ వ్యవస్థలో ప్రభుత్వ ఉద్యోగాలు పొందడానికి ఇష్టపడరు. పాపకార్యాలకు కారణ భూతమయ్యే ఉద్యోగాల నుండి తప్పనిసరిగా దూరంగా ఉండాలని అది ఆదేశిం చింది. తక్కిన ఉద్యోగాలను గత్యంతరం లేని పరిస్థితిలో చేపట్టడానికి అనుమతిం చింది. ఎందుకంటే వాటిలో షరీయత్ చట్టాలను ఉల్లంఘించే పరిస్థితి ఏర్పడదు. ధర్మశాస్త్రపరంగా వాటిని స్వీకారయోగ్యమనవచ్చు. అయినప్పటికీ, దేనినైతే తొలగించి, దాని స్థానంలో ఇస్లామీ ఉద్యమాన్ని నెలకొల్పడానికి వాగ్దానము చేశారో ఆ భ్రష్టమైన ప్రభుత్వ వ్యవస్థను బలపరచడానికే కదా ఈ ఉద్యోగం సేవలు సహకారాలు! అందువల్లనే ఈ ఉద్యోగాలలో పాపకార్యాలకు ప్రత్యక్షంగా

ఏమాత్రం ప్రమేయం లేకున్నా (మద్యపానం, వడ్డీ ఆధారిత వ్యవహారాలతో అనుబంధమున్న ఉద్యోగాలలో పాపకార్యాలకు తప్పకుండా ప్రమేయముం టుంది), ఒక తప్పుడు వ్యవస్థకు సేవ చేయడమే కాబట్టి పరోక్షంగా తప్పే అవుతుంది. అది ఎంత చిన్న ఉద్యోగమైనాసరే. స్వచ్ఛమైనవి కానేకావు. అభిలషిం చబడేవికావు. అవలంబించడానికి అనువైనవి కావు. మీరు పడగొట్టదలుచుకున్న గోడకు కేవలం సిమెంటు, ఇటుకలే కాకుండా ప్లాస్టింగ్ చేయడం దాన్ని అందంగా తీర్చిదిద్దడం పిచ్చితనమే అవుతుంది. అలాగే ఇచ్చటి తప్పుడు వ్యవస్థను ప్రక్కకునెట్టి దానిస్థానంలో ఇస్లామీ ధర్మవ్యవస్థను స్థాపించేందుకు ప్రతిజ్ఞ చేసిన వారందరికీ, ఈ భ్రష్టమైన వ్యవస్థ అడుగులకు మడుగులు ఒత్తుతూ దాని చివరి వరుసలలో సహితం విధేయులై నిలబడటం శోభిల్లగలదా? వారు చేయవలసిన పని ఏమిటంటే, నిరంతర ప్రయత్నాల ద్వారా దానిని మార్చడానికి ప్రయత్నించాలి. దాని అస్తిత్వానికి దోహదపడటం అదెంత స్వల్ప విషయమైనాసరే, సమంజసం కాదు.

**దేశ చట్టాలకు క్రియాత్మకంగా కట్టుబడటం**

ప్రస్తుతమున్న వ్యవస్థను, సిద్ధాంతపరంగా, విశ్వాసపరంగా తప్పని భ్రష్ట మైనదని, రద్దుచేయ తగినదని భావించినప్పటికీ, దేశం కోసం రూపొందించిన సాధారణ చట్టాలను రద్దు చేయడం సమంజసం కాదని ఇస్లామీయ ఉద్యమం భావిస్తుంది. ఆ చట్టాలను వాస్తవంగా తప్పుడు, అసత్యమైనవని భావించినప్పటికీ వాటికి తప్పకుండా కట్టుబడి ఉండాలని అది ఆదేశిస్తుంది. కాకపోతే ఏదైనా చట్టాన్ని ఆచరించడం వల్ల షరీయత్‌ను అతిక్రమించవలసి వస్తే, అల్లాహ్, మరియు దైవప్రవక్తల అవిధేయత అనివార్యమైనప్పుడు దానినాచరించకూడదు. సాధారణమైన దేశ చట్టాలను ఆదరించాలనే విధానాన్ని ప్రాపంచిక ఉద్దేశాల తోనో లేదా రాజకీయ లబ్ధికోసమో కాకుండా ప్రవక్తలు చూపిన విధానాలకు అనుగుణంగా అవలంబించింది. వారి జీవిత చరిత్రల ద్వారా తెలిసేదేమిటంటే; చలామణిలో ఉన్నది ఏ తప్పుడు విధానమైనప్పటికీ, దాని సాధారణ చట్టాలను

ఆచరించడానికి ఆక్షేపించకూడదు. మానవుల సామూహిక జీవనం ఏదో ఒక విధానాన్ని చట్టాన్ని కాంక్షిస్తుందనీ, అది లేకుండా జీవితం మనజాలదనే వాస్తవ దృక్పథంతో ఈ విధానాన్ని అవలంబించడం జరిగింది. ఇక చలామణిలో ఉన్న సిద్ధాంతాలను విడనాడినట్లయితే జీవితం దుర్భరమవుతుంది. లేదా దానిలో క్రమశిక్షణ కొరవడుతుంది. మొదటి విధానం ఆచరణ రీత్యా సాధ్యం కాదు. రెండవ విధానం వల్ల గందరగోళం, అరాచకం, అల్లకల్లోలం సంక్షోభం చెలరేగుతుంది. కాబట్టి అది కూడా అంగీకారయోగ్యం కాజాలదు. ఎందుకంటే అత్యంత తప్పుడు విధానాలు హీనాతిహీనమైన చట్టాలు, అధికారం, మానవజీవిత సామూహిక సంక్షేమానికి, అరాచకం కంటే తక్కువ నష్టాన్ని కల్గజేస్తాయి. కాబట్టి ఈ విషయంలో ఇస్లామీయ షరీయత్ దృష్టికోణం ఏమిటంటే: అత్యంత దుర్భరమైన వినాశకరమైన ఘోర నష్టాలనుండి రక్షణ పొందడానికి, పనికిమాలిన ప్రభుత్వ విధానాలను అవలంబించడం వల్ల కలిగే అల్పస్థాయి నష్టాలను అయిష్టంగానైనాసరే భరించాలి. ప్రస్తుతం వున్న ప్రభుత్వ చట్టాల విషయంలో ఈ దృష్టికోణం వల్ల మరో అత్యంత ప్రముఖ విషయం ప్రస్ఫుటమవుతుంది. అదేమిటంటే, ఇస్లామీయ ఉద్యమ సభ్యులు ప్రస్తుతమున్న ప్రభుత్వ విధానాలను వాస్తవంగా తప్పని, అసత్యమైనవనీ భావించినప్పటికీ వాటిని వారు ఎంత నమ్మకంగా సక్రమంగా ఆచరిస్తారంటే, వాటిని సరియైనదిగా నమ్మినవారు కూడా అంత నమ్మకంగా సక్రమంగా ఆచరించరు.

దానికి కారణం ఏమిటంటే, ఇతరులు ఆ చట్టాలను ప్రభుత్వ శిక్ష పడుతుందనే భయంతోనో లేదా అంతరాత్మ ప్రబోధం వల్లనో ఆచరిస్తారు. కాని ఇస్లామీయ ఉద్యమ కార్యకర్తలు ఆ చట్టాలను ధార్మిక దృష్టితో, షరీయత్ ఆదేశాన్ని శిరసావహించాలనే తపనతో ఆచరిస్తారు. ఈ ధార్మిక ప్రేరణకంటే, మరే ఇతర ప్రేరణలు ప్రభావశీలమైనవి, బలమైనవి లేనేలేవు అనే విషయం అందరికీ తెలిసిందే. ప్రత్యేకంగా, ధర్మాన్ని షరీయత్‌ను ఆచరించి మానవాళి

సమక్షంలో సాక్షులుగా నిలబడటమే తమ ధ్యేయంగా పెట్టుకున్నవారి, మాటలకు చేతలకు పొంతన లేకుంటే వారి జీవితాశయాలకు మనుగడలేదు. సద్వర్తన బాహ్య అంతరంగాల సమతుల్యతపైనే తమ ఉద్యమ సాఫల్యత ఆధారపడి ఉందని భావించేవారు ఆ చట్టాలను ధార్మిక షరీయత్ దృష్టి కోణంతో సర్వోత్త మంగా ఆచరిస్తారు.

**ప్రస్తుతమున్న వ్యవస్థకు విరుద్ధంగా పోరాట విధానం**

ఇస్లామీ ఉద్యమం ప్రస్తుత వ్యవస్థతో ఎలాంటి అనుకూలవైఖరి అవలంబించజాలదని, దానిని సంపూర్ణంగా మార్చివేయాలనుకుంటుందని మనకు తెలుసు. అయితే అది ఎలా సాధించాలనుకుంటుంది అనే విషయాన్ని తెలుసుకోవడం అవసరం. ఆ కార్యసాధనకు ప్రముఖ విధానాలు సంక్షిప్తంగా ఇవి:

1) ఇస్లామీయ వ్యవస్థ సమంజసత్వం, సర్వతోముఖమైన ఆధిక్యతను అన్ని కోణాల నుండి విశదీకరించాలి. అదెలాగంటే-

ఈ వ్యవస్థ పునాదులు ఏకేశ్వరవాదం, మానవ ఏకత్వం- ముహమ్మద్(స) ప్రవక్త దౌత్యం, అంతిమ దినం గురించి వ్యవహారిక భాషలో ప్రామాణికంగా సమంజసమైన ఉదాహరణలతో సత్యమైనవని నిరూపిస్తూ అవి విశ్వాసానికి, మానవ జీవితానికి చెందిన సహజ మౌలిక వాస్తవాలని విశదపర్చాలి.

- మానవ నైజానికి అనుకూలమైన దాని విశిష్ఠతలను బహిర్గతం చేసి, అది జీవిత సమస్యలన్నింటినీ సమర్ధంగా పరిష్కరించగలదనీ, మానవాళిని ఈనాటి విపత్కర పరిస్థితులనుండి రక్షించగలదనీ వివరించాలి.

- దాన్ని ఆచరించడం వల్ల మానవాళికి కలిగిన మేలును ప్రపంచానికి, చారిత్రక ఆధారాలతో నిరూపించాలి. తద్వారా మానవ జీవితంపై ఈ వ్యవస్థ స్థాపించబడినప్పుడల్లా, న్యాయం, ధర్మం, దయాదాక్షిణ్యాలు, సోదరభావం, మానవత్వము, సత్యసంధత, కార్యదక్షత, పుణ్యకార్యాలు, శ్రేయోకాంక్షలతో విలసిల్లాయని, శాంతి సుస్థిరతలు, సౌభాగ్యాలు పరిఢవిల్లాయని ప్రపంచంలో

అన్నిటికన్నా ప్రశస్తమైన, శ్రేష్ఠమైన, ఆదర్శవంతమైన, సమాజం ఉనికిలోకి వచ్చిందనీ ప్రజలు గ్రహించేలా చేయాలి.

2) ప్రస్తుత వ్యవస్థలో ఉన్న వివిధ లోపాలను ఎత్తిచూపడం, వాటిని ఖండించడం, వాటి ముఖ్యాంశాలు ఇవి:

– ఈ వ్యవస్థకు చెందిన మౌలిక ఆలోచనా విధానాలు, సిద్ధాంతాలను ప్రామాణికాధారాలతో విమర్శించి, అవి పూర్తిగా తప్పని, ప్రమాణబద్ధతలేనివని, అసత్యమైనవని, సరియైన ఆలోచన ఆచరణా విధానాలతో దానికి ఏమాత్రం సంబంధం లేదని నిరూపించాలి.

– దాని సహజ విశిష్టతలను విపులంగా విశ్లేషించి, విచ్ఛిన్నం – వినాశనం దాని నైజంలోనే ఉందనే విషయం తేటతెల్లం చేయాలి. దానివల్ల మానవాళికి మేలు జరుగుతుందని, జీవిత సమస్యలకు సరియైన పరిష్కారం లభిస్తుందని ఆశించడం తమను తాము మోసగించడమే అవుతుంది అని విశదపర్చాలి.

దాని పని తీరుకు దాని గత చరిత్రనే సాక్షిగా చూపుతూ, అది మానవాళికి చేదు ఫలాలనే ప్రసాదించిందని, జీవితాలలో అశాంతి, అనైతికత, అల్లకల్లోలాలనే బహూకరించిందని, నేటి వరకు మానవాళి వాస్తవ సఫలత పొందడానికి అది దోహదపడలేదని నిరూపించాలి.

ఇవే ఆ ముఖ్య విధానాలు. వీటి ద్వారానే ఇస్లామీయ ఉద్యమం ప్రస్తుత వ్యవస్థతో పోరాడడానికి ప్రణాళికలను రూపొందించింది. తాత్వికంగా ఈ విధానమే సరియైనది. వీటి ద్వారానే ఆ వ్యవస్థ సిద్ధాంతాలపై దేశ ప్రజలకున్న నమ్మకాన్ని తప్పని నిరూపించాలి. ఇస్లామీయ వ్యవస్థ గురించి వారిని సంతుష్టుల్ని చేయాలి. కాబట్టి ఆరంభం నుండే ఈ ఉద్యమం ఈ విధానాన్నే అవలంబిస్తూ వస్తుంది. భవిష్యత్తులో కూడా దానినే అవలంబించడానికి దృఢసంకల్పంతో ఉంది.

# వ్యతిరేక పవనాలు

## వ్యతిరేకత అనివార్యం

ఈనాటి వరకు ఏ విప్లవాత్మక ఉద్యమం కూడా వ్యతిరేక తాకిడిని తప్పించుకొని ముందుకు సాగలేదు. పురాతన విధానాలను గుడ్డిగా ఆచరించే మనస్తత్వంవల్ల అలా సాధ్యపడదు కూడా. అలాంటప్పుడు కేవలం ఇస్లామ్ ఉద్యమానికి ధర్మసందేశ విషయంలో ఎలాంటి వ్యతిరేకత ఎదురుకాదని సంబరపడటం ఎందుకు? ఇస్లామీయ ఉద్యమాల చరిత్ర ద్వారా, ముఖ్యంగా ప్రవక్తల సందేశ చరిత్రల ద్వారా తెలిసేది ఏమిటంటే, వారు ఒకటి రెండు కాదు, లెక్కలేనన్ని వ్యతిరేకతలను ఎదుర్కొవలసి వచ్చింది. అంత కఠిన వ్యతిరేకత ఇతర ఉద్యమాల చరిత్ర పుటలలో వెతికినా దొరకదు. ఇలా జరగడం సహజమే. ఎందుకంటే కేవలం ఇస్లామీయ ఉద్యమాలు, సందేశాలు మాత్రమే అసలైన 'విప్లవాలు'. ఈ ఉద్యమాలు మానవ జీవితంలో మౌలికంగా, బహుముఖంగా ఎలాంటి విప్లవాత్మక మార్పులు తేగలవో ఇతర ఉద్యమాలు అలా తేజాలవు.

రెండవ వైపు: అవి తమ మౌలిక సిద్ధాంతాల విషయంలో సూటిగా వ్యవహరిస్తాయి. పరిస్థితులతో అవి రాజీపడవు. ప్రాపంచిక సౌఖ్యాలు సమకూర్చుకొనే నైజానికి అవి దూరంగా ఉంటాయి. మూడవ వైపు : తమ సందేశం మాత్రమే సత్యమైనదని ధర్మబద్ధమైనదని, తనకు విరుద్ధంగా ఉన్నవన్నీ అధర్మమైనవనీ పూర్తిగా ఖండించదగినవనీ నిరూపిస్తాయి. అంతేకాదు, ఘంటా పథంగా ఆ విధంగా ప్రకటించడం అత్యవసరమని భావిస్తాయి. నిస్సందేహంగా ఖరాఖండిగా వ్యవహరించే ఇలాంటి ఉద్యమాలకు ముందుకు సాగడానికి ఆహ్లాదకర మార్గం అసలు లభించదు. వాటిని స్వీకరించని వారు కేవలం

స్వీకరించకుండా ఉండటంతోనే సరిపుచ్చుకోరు. ప్రత్యర్థులుగా రంగంలో దిగుతారు. కాబట్టి ఈనాడు కూడా ఇస్లామీయ ఉద్యమానికి నలుదిశల నుండి ఎడతెగని వ్యతిరేకులు ఎదురవుతున్నారంటే ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు. అలాంటి పరిస్థితి ఎదురు కాకుంటేనే ఆశ్చర్యపడాలి!

ఇన్ని విధాల వ్యతిరేకతలు పుట్టుకొని రావడానికి ఆస్కారమున్నట్లే అవి శాశ్వతంగా కొనసాగడానికీ ఆస్కారముంది. ఎందుకంటే ఈ వ్యతిరేకతలకు కారణాలు సహజంగా మానసికమైనవి, పురాతనమైనవి. కాబట్టి అవి ఎల్లప్పుడూ ఉంటాయి. ఇస్లామీయ ఉద్యమం సహనంతో, స్థిరచిత్తంతో, వివేకంతో వ్యవహరించి వాటిని అధిగమించవచ్చు. వాటి ప్రభావాన్ని తగ్గించవచ్చు. కానీ పూర్తిగా తడిచివేయజాలదు. ఈ విషయాన్నే ప్రతి ధార్మిక ఉద్యమ గత చరిత్ర సాక్ష్యమిస్తుంది. అన్నిటికంటే మహోన్నత సాక్ష్యం ఖుర్ఆన్ సందేశానిది. దాని సందేశ ఆరంభం నుండి - అధికార పీఠాన్ని అధిరోహించేవరకు ఏ క్షణం కూడా అది ప్రతికూల వాతావరణం నుండి సురక్షితంగా ఉండలేదు.

**మూల కారణాలు**

ఈనాడు ఇస్లామీయ ఉద్యమంతో విరోధానికి మూలకారణాలు విశ్లేషించి నట్లయితే ఒకటి రెండు కాదు, అనేక కారణాలు కనిపిస్తాయి. ఎందుకంటే విరోధించేవారి ఆలోచనా తీరు, మనస్తత్వం, భావోద్రేకాలు, స్వార్థప్రయోజనాలు, అభిరుచులు ఒకేవిధంగా ఉండవు. కాబట్టి వారి విరోధానికి మూల కారణాలు కూడా ఒకే విధంగా ఉండవు. పరిశీలించినట్లయితే అవి అనేకంగా ఉన్నాయి. వాటిని సూత్రప్రాయంగా రెండు విధాలుగా విభజించవచ్చు.

అ) సర్వసామాన్యంగా ప్రబలివున్న మరియు అన్ని సముదాయాల్లో, వర్గాల్లో నెలకొని ఉన్న కారణాలు.

ఆ) ఒక ప్రత్యేక సముదాయం, వర్గంలో మాత్రమే నెలకొని ఉన్న నిర్దిష్టమైన, పరిమితమైన కారణాలు.

## అ) సామాన్యంగా ప్రబలివున్న కారణాలు

ముస్లిం-ముస్లిమేతరులలో, సామాజిక - రాజకీయ వర్గాలలో, ప్రజలు-ప్రభుత్వాధినేతలలో సర్వసామాన్యంగా ప్రబలి ఉన్న కారణాలు ఈ క్రింది విధంగా పేర్కొనవచ్చు.

**1) మొదటి కారణం:** సరియైన పరిజ్ఞానం లేకపోవడం, అపార్థం, జన బాహుళ్యానికి ఉద్యమ అసలు సందేశం, దాని విధానాలు ఆశయాలు యథాతథంగా చేరకపోవడం. ఒకవేళ చేరివుంటే దాన్ని సరిగ్గా అర్థం చేసుకోకపోవడం. అందువల్ల వారు తమ తప్పుడు, అసంపూర్ణ పరిజ్ఞానం మూలంగా ఏర్పరుచుకున్న అభిప్రాయాలు అనుకూలంగా ఉండజాలవు. ఉన్నప్పటికీ అవి పూర్తిగా ఉండవు. అవి ఆ సందేశానికి అవరోధంగా ఉండకపోయినా అనుకూలమని కూడా చెప్పజాలము.

**2) రెండవ కారణం:** మన సమాజంలో నలువైపులా విపరీతంగా వ్యాపించి ఉన్న 'అపనమ్మకం'. ముఖ్యంగా ధార్మిక ఉద్యమాల విషయంలో అది ఒక అంటురోగంగా ప్రబలింది. ఎక్కడైనా ఇలాంటి ఉద్యమం ప్రారంభం కాగానే వెంటనే ఇది మోసపూరితమైన వ్యాపకమని, ప్రాపంచిక పదవులు, అధికారం పొందడానికి మతాన్ని వాడుకుంటున్నారని అభిప్రాయాన్ని వెల్లడిస్తారు. ఇలాంటి అపవాదు పూర్తిగా నిరాధారం కూడా కాదు. ఎందుకంటే ఈ మానవ మహాశయునికి మతాన్ని పణంగా పెట్టి మానవాళిని మోసం చేసిన కళంకిత చరిత్ర ఉంది. ఇది తిరుగులేని వాస్తవం.

అలాగని ప్రతి ధార్మిక ఉద్యమాన్ని అనాలోచితంగా అదొక నాటకమని ముద్రవేయడం సరియైన విధానం కాదు. అలా చేయడం మానవ ఔన్నత్యాన్ని, నీతి నిజాయితీని ఖూని చేసి రక్తసిక్తం చేసినట్లు అవుతుంది. శోచనీయమైన విషయం ఏమిటంటే, ఆ రక్తం మానవుల ముఖాలకు గాఢంగా పులుముకుంది. ఇలాంటి పరిస్థితుల్లో ఇస్లామీయ ఉద్యమం అపనమ్మకాల నుండి తమను తాను రక్షించుకుంటే, ఈ ధరణిపై ఇంతవరకు దర్శించని మహాత్యమే

అవుతుంది. కాబట్టి స్థాపించబడినప్పటి నుండి నేటి వరకు జరిగిన సంఘటనలు గమనిస్తే అది అనునిత్యం అపనిందల ప్రవాహానికి ఎదురీత సాగిస్తూనే ఉంది.

**(3) మూడవ కారణం:** నవయుగంలో మానవులలో మతం విషయంలో నెలకొని ఉన్న నిరాశా నిస్పృహలు, అపనమ్మకం. ఎటు చూచినా ఈ ప్రపంచం, దైవం–మతం నుండి దూరంగా పరుగెత్తుతుంది. చివరకు మతాభిమానులలోని ఓ పెద్ద వర్గం కూడా ఏకాగ్రతతో మనస్ఫూర్తిగా దానితో అనుబంధం కలిగిలేదు. సామూహిక జీవిత సమస్యల్ని పరిష్కరించడంలో మతం చూపిన సఫలమైన పరిష్కార విధానంపై విశ్వాసమున్నవారు మరియు నమ్మకమున్నవారు కనిపిస్తారు. మతానికి ఉన్న ఈ మార్గదర్శక శక్తిసామర్థ్యాలపై అపనమ్మకం ఇస్లాం– ఇస్లామీయ ఉద్యమ విషయంలో **తన** ప్రభావాన్ని చూపకుండా ఎలా ఉండగలదు? కాబట్టి మత రాహిత్యులే కాదు ప్రగాఢ మతావలంబీకులు సహితం ఈ ఉద్యమ విరోధులుగా ఎందుకు తయారయ్యారంటే, ఇది తన కుప్పిగంతుల ద్వారా వినువీధిలో విహరించదలుస్తుందని భావించడం వల్లనే!

**(4) విరోధానికి నాలుగవ కారణం:** మతం నుంచి రాజకీయాలను విడదీసే సిద్ధాంతం. ఇది ఈనాడు అమిత ప్రాచుర్యంలో ఉంది. దీనిని 'షేఖ్‌లు' 'బ్రాహ్మణులు' అందరు కూడా విశ్వసిస్తారు. ఈ సిద్ధాంతం వెనుక ఏ ప్రామాణిక ఆధారాలు ఉన్నాయి? వాస్తవంగా వాటిని ప్రామాణిక ఆధారాలు అనడానికి అర్హత ఉందా? అనేది వేరే విషయం. ఇచట వాస్తవ పరిస్థితిని గురించి ప్రస్తావించడం జరుగుతుంది. ఇది అందరికీ తెలిసిన విషయమే. ఈ సిద్ధాంతం కేవలం సిద్ధాంతం కాదు. ఇంచుమించు అందరూ అంగీకరించిన ఒక యదార్థం. బహుశా ఒక విశ్వాసంగా రూపాంతరం చెందింది. భౌతికవాదుల, రాజకీయ నాయకుల సంగతి అలా ఉంచండి. దైవం, మతం అని గొప్పలు చెప్పుకొనే వారిలో అధిక సంఖ్యాకులు కూడా తమ మతం విషయంలో ఈ ఆలోచనా సరళినే అనుసరిస్తున్నారు. చివరకు ఈ తప్పుడు ఆలోచనా సరళికి గురికాని వారు కూడా దాని ముందు లొంగిపోయారు. దానికి వ్యతిరేకంగా మాట్లాడటానికి

కూడా జంకుతున్నారు. ఇలాంటి స్థితిలో ఈ ఉద్యమంతో విరోధము తప్పనిసరి. "మతం -రాజకీయం వేరుకాదని, రాజకీయం కూడా మతానికి చెందిన అత్యంత ఆవశ్యకమైన, ప్రముఖమైన అంశమని, అది లేకుండా పరిపూర్ణ ధర్మ ఆచరణా బాధ్యత నెరవేరదనీ, స్వచ్ఛమైన మానవ జీవిత వ్యవస్థ సాధ్యపడదనీ" ప్రకటిస్తూ రంగంలో దిగిన ఇస్లామీయ ఉద్యమంతో తప్పకుండా విరోధం తలెత్తుతుంది. కాబట్టి ఇతరుల దృష్టిలో ఇది క్షమించరాని ఘోరనేరంగా పరిగణించబడుతుంది. ఈ కారణం వల్లనే దేశ ప్రజల్లో అధిక సంఖ్యాకులు, ముఖ్యంగా ఏలినవారు ఈ ఉద్యమాన్ని మతతత్వ తిరోగమన, సంకుచిత స్వభావ ఉద్యమమని పేర్కొన్నారు. అంతేకాదు, మతం వేరు– రాజకీయం వేరని విశ్వసించనందుకు దాని అంతు చూడవలసిందే అని భావిస్తున్నారు.

**5) ఐదవ కారణం:** స్వప్రయోజన కాంక్ష. ఈ ఉద్యమాన్ని సంపూర్ణంగా అవగతం చేసుకొని, ఇదే సత్యమైనదని గ్రహించినప్పటికీ కొందరు తమ దుష్ట స్వభావం వల్ల, స్వప్రయోజన కాంక్షవల్ల దీనికి విరోధులుగా మారుతున్నారు. ఎందుకంటే ఈ ఉద్యమ పురోభివృద్ధే కాదు, దాని ప్రకటన, ప్రస్తావన కూడా వారి ఆకాంక్షలపై వ్రేటు వేస్తాయి. కాబట్టి స్వాభావికంగా వారు ఈ ఉద్యమాన్ని ఎట్టి స్థితిలోనూ సహించజాలరు.

**6) ఆరవ కారణం:** అసలు ఈ సందేశమే తప్పు. ధర్మవిరుద్ధమనే ఆలోచన లేదా విశ్వాసం.

## ఆ) ప్రత్యేక, పరిమిత తరహా కారణాలు

ఒక ప్రత్యేకమైన సముదాయము, వర్గము వరకు మాత్రమే పరిమితమైన కొన్ని కారణాలు గమనించండి. దాని వివరాలు ఇవి:

(1) మొదటి కారణం ముస్లిం సమాజానికి చెందినది. అది నిర్దిష్టమైన మత మనస్తత్వం. చిరకాలంగా ఇస్లామేతర వ్యవస్థతో సహజీవనం కొనసాగించడం వల్ల అది వారిలో ఉత్పన్నమైంది. శుచిశుభ్రత పాటించే ఒక వ్యక్తిని

కూడా దుర్గంధభరితమైన ఒక స్థలంలో నిర్బంధించినట్లయితే, మొదట్లో ఆ దుర్గంధం వల్ల అతని శ్వాస ఆడకుండా ఉక్కిరిబిక్కిరి అయినా, రానురాను అతని దుర్గంధ విచక్షణ అలాగే ఉండదు. కాలక్రమంలో అది తప్పకుండా తగ్గుతూపోతుంది.

చివరకు ఆ దుర్గంధ వాతావరణానికి పూర్తిగా అలవాటు పడతాడు. దానివల్ల అసలు అతనికెలాంటి ఇబ్బందులు ఉండవు. పరిస్థితుల ప్రభావంవల్ల, మారిపోయిన ఇలాంటి మానసిక స్థితియే, ఇస్లాం ధ్వజవాహకులు, ధర్మానికి సాక్షులు అయిన ముస్లిం సముదాయాన్ని ఈనాడు తమ నిజస్థానమేమిటో తెలియకుండా చేసింది. అందువల్లనే వారు ఇస్లాంకు చెందని అధర్మవ్యవస్థకు విధేయులై సంతోషంగా, సంతృప్తిగా జీవితాన్ని గడపడానికి సిద్ధపడ్డారు. పరిస్థితి ఎంతగా దిగజారిందంటే సాధారణ ముస్లింల సంగతి విడిచిపెట్టండి, అనేక మంది ప్రముఖులు, ధర్మపరిజ్ఞాన పారంగతుల హృదయాలు మేధస్సులు కూడా ఇస్లాం జీవన వ్యవస్థను స్థాపించాలనే తాపత్రయం- ఆకాంక్షలతో ఖాళీ అవుతున్నాయి. ఇప్పుడు దాని స్థానం వారివద్ద కేవలం ఒక పవిత్రమైన పురాతన స్మృతి పథం కంటే ఎక్కువ ఏమీకాదు. ప్రపంచంలో తిరిగి అదొక వాస్తవిక రూపం దాల్చే ప్రశ్నే లేదు. తమకు ప్రియమైన, ఇష్టపడిన జీవితవిధానం పట్ల నిరాశా నిస్పృహలకు గురికావడం వల్లనే ముస్లింల విశ్వాసం, విచక్షణా జ్ఞానం నేడు పరిపాలనా వ్యవస్థలో ఉన్న 'దుర్గంధాన్ని' పసిగట్టలేకపోతోంది. దానితో ఎంతమేరకు మమేకమై పోయారంటే, దాని కరుణా కటాక్షపు నీడలో వారి వంశపరంపరలు అభివృద్ధి చెందుతూ పోయాయి. దానితో పాలుపంచుకోవడం కోసం, సహకరించడం కోసం–సేవ చేయడం కోసం అమితోత్సాహంతో వారు పోటీపడసాగారు. ఈ వ్యవస్థ జిమిక్కులతో ఇంతగా ప్రభావితులైన తర్వాత వారు ఇస్లామీయ ఉద్యమానికి స్వాగతం పలుకుతారని, ప్రస్తుతమున్న వ్యవస్థ వారి కంటిలో ముల్లులా గుచ్చుకుంటుందనీ, సమూలంగా దానిని పెకలించి పారవేస్తారనీ, దాని స్థానంలో ధర్మవ్యవస్థను స్థాపించగోరే సందేశాన్ని తమ

హృదయ స్పందనగా భావిస్తారని ఎలా ఆశించగలం? ఇస్లాం, ఖుర్‌ఆన్ ధ్వజ వాహకుల ఒక పెద్ద సమూహం ఈ ఉద్యమాన్ని తమ హృదయ స్పందనగా భావించడానికి బదులు దానిని ఒక 'విపత్తు'గా భావిస్తోంది. దానిని నీరు గార్చడానికి తమ శక్తియుక్తుల్ని ధారబోయడానికి కూడా వారు వెనుకంజ వేయడం లేదు. ఇది చూసి దిగ్భ్రాంతి, దుఃఖం కలుగుతుంది. దైవగ్రంథం, ప్రవక్త సంప్రదాయాల ప్రకారం ఈ ఉద్యమ ధ్యేయం తప్పనీ, దాని మౌలిక విధానం ఆధార రహితమని ప్రామాణికంగా రుజువు చేయలేక, దాన్ని నిరోధిం చడానికి కొన్ని విధానాలు రూపొందించుకున్నారు. ముఖాముఖిగా ఎదుర్కొనే ధైర్యం చాలక, వెనుక నుండి కుడి ఎడమల నుండి దాడి చేయనారంభించారు. రకరకాల సాకులు చెప్పనారంభించారు. "ఈ కాలంలో ఇలాంటి దేశాలలో, ధర్మం మరియు ఇస్లామీయ వ్యవస్థను స్థాపించడానికి ఉద్యమించడం, కష్టాలలో ఉన్న ముస్లిం సముదాయాన్ని భయంకర వినాశనానికి గురిచేయడమే అవుతుందనీ, "వలా తుల్‌ఖూ బిఅయ్‌దీకుమ్ ఇలత్తహ్‌లుకతి" అనే దైవ ఆదేశానికి విరుద్ధమనీ వారు వాదిస్తారు. లేదా ఈ ఉద్యమ నాయకులు, కార్యకర్తలు నమ్మశక్యంగా లేరు కాబట్టి వారితో సహకరించే ప్రసక్తే లేదంటారు. లేదా ఇస్లామీయ వ్యవస్థ స్థాపించాలనేది ఒక పిచ్చివాని కల మాత్రమే. కాబట్టి సాధించజాలని ధ్యేయం కోసం తమ శక్తుల్ని వ్యర్థపరచడం వివేకవంతమైన పనికాదు" అని ప్రబోధిస్తారు. లేదా ఇస్లామీయ ప్రభుత్వం అల్లాహ్ తరఫు నుండి తన పుణ్య భక్తులకు, వారి సదాచారానికి ప్రతిఫలంగా ప్రసాదించబడే బహుమానం, దానిని ధ్యేయంగా చేసుకొని పోరాడటానికి అది ముస్లింల బాధ్యత కాదు. దాని ఆవశ్యకత కూడా లేదు అని నచ్చజెప్పడానికి ప్రయత్నిస్తారు. మొత్తానికి ఇలాంటి లెక్కలేనన్ని ఉపమానాలు ఈ ఉద్యమానికి విరుద్ధంగా, విపరీతంగా ప్రచారంలో ఉన్నాయి. ఇంతకుముందు వివరించినట్లు వ్యాధిగ్రస్తమైన ఈ మతమనస్తత్వం వల్లనే ఇదంతా జరుగుతుంది. ఈ మనస్తత్వం ఉన్నవారు, ఇస్లాం గురించి పొగడ్తల వర్షం కురిపించి అదొక సంపూర్ణ జీవన

వ్యవస్థ అని ప్రపంచంలో అన్నిటికంటే శ్రేష్ఠమైన, ఉన్నతమైన, సఫలీకృతమైన జీవన వ్యవస్థ అని నిరూపించడానికి ఊక దంపుడు ఉపన్యాసాలు ఇస్తారు. సాంస్కృతిక కార్యక్రమాలు అంగరంగ వైభవంగా నిర్వహిస్తారు. కాని ఆ 'ఇస్లాం'నే, ఆ సఫల సంపూర్ణ జీవిత వ్యవస్థనే మానవ జీవితాలపై స్థాపించడానికి ప్రయత్నించాలని పిలుపు ఇవ్వగానే వారిలోని వైరిభావం, ఆగ్రహం పెల్లుబుకుతాయి.

వారిలో ధర్మసంస్థాపనా ప్రయత్నానికి ధైర్యం సరిపోనప్పుడు కనీసం మౌనంగానైనా ఉంటారని ముందుకు సాగేవారితో వైరభావం వీరి మనసులో ఉత్పన్నం కాదని ఆశించటం విపరీతం కాదు. కాని శోచనీయ విషయమేమిటంటే, వారిలో అధిక సంఖ్యాకులు ఈ ఆశను కూడా వమ్ముచేశారు. "మేమెవరితో కలిసిలేమో వారు మా శత్రువులు" అని ప్రకటించినట్లుగానే వ్యవహరించారు. ఈ ఉద్యమాన్ని ఎదిరించడం తమ బాధ్యత అని, అలా చేయకపోతే, ఈ ఉద్యమం సత్యవంతమైనదని స్వయంగా తామే అంగీకరించినట్లు అవుతుందనీ, తద్వారా తాము నేరస్తులుగా పరిగణించబడతామని బహుశా వారి మనసులో ఉండవచ్చు. కాని అలా వ్యవహరించడం అంత సులువైన విషయం కాదు కాబట్టి వారికి ఉద్యమ విరోధుల సమూహంలో చేరిపోవడం ఆవశ్యకమై పోయింది.

(2) ముస్లిమేతరులు ఈ ఉద్యమానికి విరోధులుగా మారడానికి, ముస్లిం సముదాయం పట్ల వారికున్న దురభిమానమే ముఖ్యకారణం. ఈ దురభిమానమే మానవ మస్తిష్కానికి చెందిన ఒక భయంకరమైన అంటువ్యాధి. ఇది ఒక మతావలంబీకులలో ఇతర మతస్తులకు విరుద్ధంగా సర్వసామాన్యంగా ఉంటుంది. ఒక విషయాన్ని కేవలం దాని విశిష్టతల ఆధారంగా స్వీకరించే, తృణీకరించే, సత్యవంతులు, పుణ్యాత్ములు చాలా అరుదుగా ఉంటారు. ఈ విద్వేషమే ఈనాడు ఇస్లామీయ ఉద్యమ మార్గంలో పెద్ద అవరోధంగా తయారైంది. ఈ దేశంలో ఇస్లాంను స్థాపించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయని

ముస్లిమేతరులకు తెలిసినప్పుడు స్వాభావికంగా వారి మనసులో ఇది మా వారిని ముస్లింలుగా మార్చడానికి లేదా ఇక్కడ ముస్లిం రాజ్యస్థాపనకు ఒక ప్రమాదకరమైన ప్రణాళిక రూపొందించబడుతుందనే భావన చెలరేగుతుంది. వెంటనే వారు ఈ ఉద్యమాన్ని ఎదిరించడం తమ సాముహిక కర్తవ్యంగా భావిస్తారు. వారి ఆలోచనా తీరు, ఇస్లామీయ రాజ్యానికి, ముస్లిం రాజ్యానికి మధ్యవున్న బేధమేమిటో తెలుసుకొనే స్థితిలో ఉండదు. ఒక నిజమైన ఇస్లామీయ సందేశ ఉద్యమం మరియు ఒక సామాన్య సందేశం రెండు ఒకటి కావని వారు గుర్తించరు. ముస్లింల సంఖ్యాబలాన్ని పెంచి, ముస్లింల ప్రభుత్వాన్ని స్థాపించాలనే ఆలోచనే సరియైనదైతే ముస్లింలు ఈ ఉద్యమాన్ని స్వాగతించే బదులు దానితో విరోధానికి ఎందుకు దిగుతున్నారు? దానితో సహకరించేవారి సంఖ్య పిండిలో ఉప్పులా ఎందుకంత తక్కువగా ఉంది? అని వారు ఏ కాస్త కూడా ఆలోచించరు. వీరి ఈ ఆలోచనా తీరుకు కారణం వెదికితే నిస్సందేహంగా అది ముస్లింలపై ఉన్న దురభిమానమే అని తేలుతుంది. వాస్తవంగా వారు "ఈ ఉద్యమం ఒక ధర్మ సంస్థాపనార్థం ఆవిర్భవించింది. ఆ ధర్మం మా కొరకు పరాయిది. మా ధర్మానికి పూర్తిగా భిన్నమైనది. దాని అభ్యున్నతి మా ధర్మానికి, మా సంస్కృతికి, మా జాతికి, మా సమాజానికి అన్నింటి పతనానికి కారణమవుతుంది" అనే దృక్కోణంతో చూస్తారు. ఈ ముస్లిం విద్వేషం ఎంత తీవ్రమైనదంటే, ప్రజలను ఇస్లాం స్థాపన ఉద్యమానికి కఠిన విరోధులుగా మార్చడానికి, రెచ్చగొట్టడానికి ఇదొక్కటే సరిపోతుంది. అగ్నికి అజ్యంపోసినట్లు దానికి మరో బలమైన కారణం కూడా అనుకోకుండా తోడైంది. అది జాతీయతా వాదం, మతతత్వ భావన. హిందూ ముస్లింల మధ్య కొన్ని సంవత్సరాల క్రితం (దేశ స్వాతంత్ర్య సమయంలో) సంబంధాలు ఉద్రేక పూరితంగా ఉండేవి. వాటి దుష్ప్రభావాలను సులువుగా మరువజాలము. ఆ వివాదాలు ముస్లిమే తరులను కేవలం ముస్లిం విరోధులుగానే కాదు, ఇస్లాం విరోధులుగా కూడా మార్చివేశాయి. స్వాభావికంగా ఇస్లామీ ఉద్యమం కూడా ఈ దౌర్భాగ్య స్థితివల్ల

కలిగే దుష్ప్రభావాలకు గురికాకుండా ఉండలేదు. కాబట్టి అనేక మంది ముస్లిమేతరులు ఈ ఉద్యమాన్ని ముస్లిం జాతి ఆకాంక్షల సరికొత్త రూపమని భావిస్తారు. వారి దృష్టిలో అది ఒక నియమబద్ధమైన సైద్ధాంతిక ఉద్యమానికి బదులు, వారితో పోరాడుతున్న వారిని ఎనలేని వ్యధలకు గురిచేయుచున్న ఒక జాతికి, ఒక ధర్మానికి, ఒక కొత్త ఛాలెంజ్ అని భావిస్తారు. అందువల్ల వారి నుండి వైరం తప్ప మరొకటి ఆశించలేము.

**(3) మూడవ కారణం:** ఇది ప్రత్యేకంగా పరిపాలకుల విషయంలో వినుతికెక్కింది. అదేమిటంటే, 'ప్రభుత్వానికి కేవలం చెవులుంటాయి. కాని కనులుండవు" అనేది. ఇస్లామీయ ఉద్యమ మాటలు, చేతలు అన్నీ స్పష్టంగా ఉన్నప్పటికీ, చాలాకాలం గడిచినప్పటికీ, ఇస్లామీ ఉద్యమం గురించి నేటి వరకు ప్రభుత్వానికి అందిన పరిజ్ఞానం చాలా స్వల్పమైనది. అసత్యమైనది. కడు శోచనీయ విషయమిది. ప్రభుత్వం ఈ విషయంలో నెరవేర్చిన బాధ్యత ఎంతమాత్రం సముచితంకాదు. దాని సమాచార సేకరణ సాధారణంగా, ఉద్యమ నియమావళిని, దాని విధానాలను, దాని పరిభాషను, చివరికి దాని సాహిత్యాన్ని కూడా సరిగా అర్థం చేసుకోలేని అధికారులు సమర్పించిన సమాచార నివేదికలతో జరుగుతుంది. అంతేకాదు, పరిస్థితుల ప్రభావం వల్ల వారి ఆలోచనా తీరు కూడా ఇస్లామీయ ఉద్యమానికి వ్యతిరేకంగా విద్వేషభరితమై, అపార్థాలకు లోనై ఉంటుంది. ఇలాంటి సమాచార నివేదికల ఆధారంగా ఇస్లామీయ ఉద్యమంపై ఏర్పరుచుకొనే అభిప్రాయం సరియైనదిగా ఉంటుందని నమ్మడానికి వీల్లేదు. అందువల్లనే ఈ ఉద్యమం గురించి ప్రభుత్వం దాని నాయకులు చేసే ప్రకటనలు, అవలంబించిన వైఖరి గమనించినట్లయితే ఈ ఉద్యమం పట్ల దానికి సరియైన అవగాహన గాని, సత్యమైన న్యాయబద్ధమైన వైఖరిగాని ఉన్నట్లు అవగతం కాదు. ప్రభుత్వం దానిపై మోపిన అభాండాలు ఎంతో విచిత్రంగా, విభ్రాంతికరంగా ఉన్నాయి. దాని ఆశయం, దాని కార్యాచరణ, దాని నిబంధనావళి, దాని క్రమశిక్షణ, దాని నైజము, దాని చరిత్రను అర్థం చేసుకున్న

ఏ వ్యక్తి అయినా ఆ అభాండాలను ఉద్యమం పట్ల దౌర్జన్యంగానే పరిగణిస్తాడు. చివరకు ప్రభుత్వం తన వద్ద ఉన్న సమాచారాన్ని క్రోడీకరించినా ఈ ఉద్యమం ఉనికిలోకి వచ్చినప్పటి నుండి నేటి వరకు అదిగో ఈ తప్పు చేసింది అని వేలుపెట్టి చూపజాలదు. అయినప్పటికీ ఈ అభాండాన్ని ఉద్యమంపై వేస్తుందంటే అది దాని విషయలేమిని సూచిస్తుంది లేదా ఆధార రహితమైన అపార్థాలే దానికి కారణమని చెప్పవచ్చు. అలాకాకుంటే అన్నీ తెలిసి కూడా నిందారోపణ చేయబడుతుందని భావించవలసి వస్తుంది. ఈ భావన ఎట్టి పరిస్థితిలోనూ నిజం కాకుండా దైవం కాపాడుగాక.

## వ్యతిరేకతల నుండి బయట పడవలసిన ఆవశ్యకత

ఇస్లామీయ ఉద్యమానికి ఇలాంటి ఎడతెగని వ్యతిరేకతలు ఎదురవుతుండడం వల్ల అవి పరిసమాప్తమయ్యే సూచనలే కానరానందువల్ల, వాటిని సరియైన పంథాలో ఎదుర్కోడానికి, ఒక సముచిత విధానాన్ని అవలంబించవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. ఇవి దాని మార్గంలో పెద్ద అవరోధాలు. వాటిని తొలగించనంతవరకు, సరియైన చర్య తీసుకోనంతవరకు మార్గం సుగమం కాదు. కాబట్టి ఇస్లామీయ ఉద్యమం ఈ ఆవశ్యకతపై ప్రత్యేక దృష్టి సారించింది. సర్వత్రా ప్రబలిపోయిన ఈ వ్యతిరేకతలను అధిగమించడానికి స్పష్టమైన ప్రత్యేక విధానాలను అవలంబించింది.

## ఖుర్ఆన్ మార్గదర్శక సూత్రాలు

ధర్మసంస్థాపన ధ్యేయాన్ని, దానిని సాధించే విధానాన్ని దివ్యఖుర్ఆన్ నుండి గ్రహించినట్లే, వ్యతిరేకతలను అధిగమించే విధానాలు సహితం దివ్యఖుర్ఆన్ నుండి గ్రహించబడ్డాయి. కాబట్టి దీనిని అర్థం చేసుకోవాలంటే ఖుర్ఆన్‌లో ఈ విషయంపై పొందుపరచబడిన ఆదేశాలను దృష్టిలో ఉంచుకోవాలి. ఆ ఆదేశాలు వరుసగా ఇవి:

**ఈ విధంగా మేము మా వచనాలను మాటిమాటికి భిన్న రీతులలో వివరిస్తూ ఉంటాము, తద్వారా నీవు ఎక్కడో పాఠాలు నేర్చుకుని**

వచ్చావని వీరు అనాలనీ, మరేమో జ్ఞానవంతులయిన వారికి యధార్థాన్ని ప్రస్ఫుటం చెయ్యాలని. *(అన్ఆమ్ : **105**)*

ప్రజలతో ఉత్తమోత్తమమైన రీతిలో వాదించు. నీ ప్రభువుకే బాగా తెలుసు ఆయన మార్గం నుండి తప్పిపోయిన వాడు ఎవడో, రుజు మార్గంలో ఉన్నవాడు ఎవడో. *(నహ్ల్ : **125**)*

ప్రవక్తా! మంచీ, చెడూ ఒకటి కావు, నీవు చెడును శ్రేష్ఠమైన మంచి ద్వారా తొలగించు. అప్పుడు నీపట్ల శత్రుభావం కలవాడు నీవు ప్రాణ స్నేహితుడైపోవటాన్ని నీవు గమనిస్తావు. *(హామీమ్ సజ్దా: **34**)*

ప్రవక్తా! మృదుత్వం, మన్నింపుల వైఖరిని అవలంబించు, మంచిని ప్రబోధించు, మూర్ఖులతో వాదానికి దిగకు. *(ఆరాఫ్ : **199**)*

ఈ వాక్యాల ఆంతర్యమేమిటంటే, సత్యధర్మ సందేశహరునికి తన సందేశాన్ని ప్రజలకు చేరవేయడానికి విశ్లేషణలతో, వివరణలతో, సమాలోచనలు చేయవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. తద్వారా ఈ సందేశానికి చెందిన ఏ కోణము కూడా అస్పష్టంగా ఉండకూడదు. చివరకు సంబోధితులు కూడా సంపూర్ణ ఉద్యమ పరిజ్ఞానం లభించిందని తృప్తిపడాలి. దాని తర్వాత కూడా ధర్మాన్ని స్వీకరించడానికి సంసిద్ధులు కాకపోతే, ధర్మానికి వ్యతిరేకంగా తన భావాలను వెల్లడిస్తున్నట్లయితే, వారిని సమాధానపర్చడానికి నిరూపణలు, సంభాషణలు, చర్చల ద్వారా మరింతగా ప్రయత్నించాలి. కాని ఈ సంభాషణల చర్చల వైఖరి ప్రామాణికంగా ప్రశాంతంగా సముచిత రీతిలో ఉండాలి. సంబోధితుని హృదయాన్ని ఆకట్టుకొనే విధంగా ఉండాలి. ఇలా పూర్తిగా జాగ్రత్త వహించినప్పటికీ ఎవరైనా, వ్యతిరేకతను వీడకుంటే చివరకు బూతుమాటలతో, హింసా దౌర్జన్యాలకు సహితం పాల్పడినట్లయితే దానికి బదులుగా సహన స్థయిర్యాలతోనే కాకుండా, మధుర సంభాషణ సద్వర్తనతో వ్యవహరించాలి. చెడును మంచితో జయించాలి. అప్పుడు విరోధ భావము సమసిపోతుంది.

కాని కొందరు కఠోర హృదయులు కూడా ఉంటారు. మానవత్వం, వివేకం, సమంజసత్వాన్ని విడనాడి సందేశాన్ని గుడ్డిగా వ్యతిరేకించడమే తమ దినచర్యగా ఎంచుకుంటారు. సందేశ ప్రదాత అలాంటి మూర్ఖులను వారి మానాన వదిలేసి, వారిని దైవానికి అప్పజెప్పి ముందుకు సాగాలి.

సత్య పిలుపుకు వ్యతిరేకంగా ప్రబలిన ధోరణికి సమాధానంగా దివ్య ఖుర్‌ఆన్ ప్రతిపాదించిన ఈ ప్రామాణిక విధానాలు సమంజసమైనవని, సఫలమైనవని, వాటికంటే ఉన్నత విధానాలను ఊహించజాలమని ప్రతి వ్యక్తి అంగీకరిస్తాడు.

## వ్యతిరేకతలకు జవాబుగా ఉద్యమ వైఖరి

దైవోపదేశాల ప్రకారం, పైన పేర్కొనబడిన వివిధ రకాల వ్యతిరేకతల నుండి ఇస్లామీయ ఉద్యమం బయటపడటానికి అనుసరించే విధానాలు సంక్షిప్తంగా ఇవి:

(అ) సర్వసాధారణంగా ప్రచారంలో ఉన్న విషయాల వల్ల ఏర్పడిన వ్యతిరేకతలు :

- పరిజ్ఞాన రాహిత్యం, అపోహల వల్ల ఒక వ్యక్తి వ్యతిరేకిస్తే ఉద్యమం, తన సందేశ విశ్లేషణ వివరణల ద్వారా అతడిని సంతృప్తిపరచడానికి శతవిధాలా ప్రయత్నిస్తుంది. మొదట పేర్కొన్న ఖుర్‌ఆన్ ఆదేశం ప్రకారం ఈ విషయమే విదితమవుతుంది. అంతేకాదు, ఇంగిత జ్ఞానం కూడా దాన్నే కాంక్షిస్తుంది. వాస్తవంగా ఒక వ్యక్తి సందేశ నిజస్వరూపం తెలియక విరోధిస్తున్నప్పుడు అది సమసిపోవాలంటే, అతనికి చక్కని ఉపదేశాల ద్వారా వాస్తవాన్ని తెలియపర్చడానికి ప్రయత్నించబడుతుంది.

- అపనమ్మకము వల్ల చేయబడే వ్యతిరేకతకు సరియైన సమాధానము, ఉద్యమ విధివిధానాలు దాని అనుయాయుల వ్యవహారశైలే ఇవ్వగలదు. కొంత మేరకు ఉద్యమ విధానాలు, ఆశయాల ప్రామాణిక విశ్లేషణ కూడా

ఉపయోగపడుతుంది. కాబట్టి ఈ విషయంలో ఉద్యమం పై మూడు విధానాల పైనే ఆధారపడుతుంది. తన విధి విధానాలలో ఏ లోటు రాకుండా చూస్తుంది. ప్రజలకు అనవసరమైన అనుమానాలు కలుగకుండా జాగ్రత్త పడుతుంది. న్యాయశీలుడైన వ్యక్తి ఈ విధి విధానాలు, అవకాశవాదుల, మోసపూరిత వ్యక్తుల సముదాయానికి చెందినవి కాజాలవని గుర్తించేలా ప్రయత్నిస్తుంది. అలాగే అది తన కార్యకర్తల వ్యవహారశైలి, నైతిక ప్రమాణాలు సక్రమంగా ఉన్నాయా లేవా అనే విషయంపై దృష్టిపెడుతుంది. చూచేవారికి కూడా వారి ముఖార విందాలు మోసగాళ్ళు-స్వార్ధపరుల్లా ధర్మాన్ని అమ్ముకునే వారివి కావని తెలిసి పోవాలి. చివరకు, ఇతరుల ఆంతర్యాలు కూడా, ఇస్లామీయ ఉద్యమ కార్యకర్తల మాటలలో చేతలలో వైరుధ్యము ఉండదనీ, వారి హృదయాలలో స్వచ్ఛత, సత్యశీలత ఉంటుందని ఘోషించాలి. కాని ఇన్ని జాగ్రత్తలు వహించినప్పటికీ ఈ అపనమ్మకాల తుఫాను ప్రభావం తొలిగిపోవడం సులభం కాదు. అందువల్ల ఉద్యమం సహనంతో వ్యవహరిస్తుంది. అపనమ్మకాలు- అపనిందల ద్వారా కమ్ముకుంటున్న పొగలతో సత్యాన్ని ఎంతో కాలం కప్పిపుచ్చలేరని, ఒకానొక రోజు పొగలు పటాపంచలై సత్యమేమిటో అందరికీ తెలిసిపోతుందని అది ఆశిస్తుంది. దైవకృపవల్ల కొన్నాళ్ళకే ఈ ఆశ చాలా వరకు ఫలించింది. ఆరంభంలో ఇది ఒక విచ్ఛిన్నకర ఉద్యమమని, కలహ కారకమని ఎడతెగకుండా నిందించేవారు. కానీ ఈనాడు అలా మాట్లాడటానికి సంశయిస్తున్నారు. దానికి బదులు కొన్ని కొత్త ఆక్షేపణలు లేవదీసి వ్యతిరేక బాధ్యతను నెరవేరుస్తున్నారు. ఉదాహరణకు: ఈ ఉద్యమ సిద్ధాంతాలు జాతికి విరుద్ధమైనవనే ఆక్షేపణ.

★ మతపరమైన నాయకత్వ విషయంలో ఈనాడు నిరాశ, అపనమ్మకం జనించింది. దానివల్ల వ్యతిరేక భావం ఇంకా పెరిగింది. దాన్ని నివారించడానికి ఈ ఉద్యమం, వాస్తవాలను తగిన సాక్ష్యాధారాలతో వివరిస్తుంది. ప్రామాణిక ఆధారాలతో ఇస్లాం ఒక సంపూర్ణ జీవిత విధానమని, అందులో మానవ జీవిత సమస్యలన్నింటికీ సర్వోత్తమ పరిష్కారముందని, పరలోక జీవితంతోపాటు

ఇహలోక జీవిత సకల సాఫల్యాలను సౌభాగ్యాలను సమకూరుస్తుందని అది నిరూపిస్తుంది. గత కాలంలో అది తన శక్తిసామర్థ్యాలను ఆచరణాత్మకంగా నిరూపించింది. భవిష్యత్తులో ఆ అవకాశం లభిస్తే నిరూపించగలదు. ఈనాడు అది సామాజిక జీవనంలో, సాంస్కృతిక, ఆర్థిక, రాజకీయ సామూహిక రంగాలలో కనుమరుగు కావడానికి కారణం అది ఈ కాలంలో పనికిరాదని అర్థం కాదు, కాలమే దానికి అనువుగా నడుచుకునే సామర్థ్యాన్ని కోల్పోయింది. ఇస్లామీయ వ్యవస్థ సిద్ధాంతాల ఔచిత్యం, ఆశయాల ఔన్నత్యం, ప్రశస్తమైన నైతిక విలువలు, స్వచ్ఛమైన విధానాల పట్ల అవగాహన వాటిపై ఆచరణ ఉన్నట్లయితే ఈనాడు కూడా అది వారి జీవన సమస్యలను పరిష్కరించడానికి ఇస్లాం ప్రవేశపెట్టే సిద్ధాంతాల ప్రకారం సమస్యలు ఎలా చక్కగా పరిష్కారమవుతాయో తెలియపర్చింది.

మత, రాజకీయాల విభజన సిద్ధాంతం వల్ల నెలకొని ఉన్న ఉద్యమ వ్యతిరేకతను నివారించడానికి, ఆ (విభజన) సిద్ధాంతం తప్పని ఖచ్చితమైన ఆధారాలతో అది నిరూపిస్తుంది. ఇతర మతాల విషయం ఏమైనప్పటికీ ఇస్లాం విషయంలో మాత్రం మతాన్ని రాజకీయం నుండి విభజించడానికి వీల్లేదు. అనేక ధార్మిక సూత్రాలు ఈ విభజన సిద్ధాంతాన్ని ఘోరమైన మత రాహిత్యమని, సన్మార్గభ్రష్టత్వమని పేర్కొంటున్నాయి.

ఉదాహరణకు: అల్లాహ్-ధర్మము-దైవారాధనలకు సంబంధించి దివ్య ఖుర్‌ఆన్ ప్రసాదించిన ఆలోచనా విధానాన్ని గమనించండి. అదొక అవిభాజ్యమైన ఏకాంకం. ఉదాహరణకు, 'రాజకీయం' అందులో అంతర్లీనమై ఉన్న ఒక అంశం. ప్రవక్త ప్రబోధనాలలో నమాజ్, జకాత్, రోజా, హజ్‌లపై స్పష్టమైన ఆదేశాలు ఉన్నట్లే రాజకీయాలపై కూడా ఉన్నాయి. ఇతర ఆదేశాలను పాటించడం ఎంత ఆవశ్యకమో రాజకీయంపై ఉన్న ఆదేశాలను పాటించడం అంతే ఆవశ్యకమని, ధార్మికమని ప్రబోధించబడింది. అంతేకాదు, అనేక ఇతర ఆదేశాల ఆచరణ కూడా ఈ రాజకీయ ఆదేశాల ఆచరణపై, వాటి స్థానంపై ఆధారపడి

ఉంది. కాబట్టి ఇస్లాం కూడా రాజకీయాలతో సంబంధం లేని ఒక మతమని చెప్పడం పట్టపగలు సూర్యుడే లేడన్నట్లుగా ఉంటుంది.

మతం వేరు – రాజకీయం వేరు అనే సిద్ధాంతం తప్పని నిరూపించడానికి పేర్కొన్న ఈ ధార్మిక ఆధారాలతో పాటు శాస్త్రీయమైన ఆధారాలను కూడా ఇస్లామీయ ఉద్యమం ప్రవేశపెడుతుంది. సర్వలోకాల ప్రభువు నుండి వచ్చిన ఏ ధర్మం కూడా మానవ జీవిత ముఖ్య సమస్యలకు పరిష్కారమార్గం చూపకుండా ఉండజాలదు. భౌతికంగా మానవ మనుగడకు లెక్కలేనన్ని ఏర్పాట్లు చేసిన దైవం, అతని నైతిక–ఆధ్యాత్మిక అవసరాలను తీర్చడానికి ఎలాంటి ఏర్పాట్లూ చేయలేదని భావించడం లేదా వ్యక్తిగత సమస్యలకే పరిష్కారం చూపించాడు, సామూహిక విషయాలలో చూపించలేదని తలచడం దైవౌన్నత్యానికి తగనిది.

★ ఈ నకారాత్మక భావాలకు మూల సరోవరం అంతర్యమని తెలిసినప్పుడు ఒకే విధానాన్ని అవలంబించడానికి ఆస్కారముంది. అదే నిగ్రహం, సంయ మనం. దానిని పట్టించుకోకుండా మౌనంగా ఉండటం. ఎందుకంటే, తన అహంకారంతో సత్యాన్ని బలిచేసే వ్యక్తులను, వాస్తవమేమిటో తెలిసి కూడా శత్రుత్వానికి దిగే వారిని వారి మానాన వదిలేయడమే ఉత్తమమైన పద్ధతి. వారిపై కనికరముంటే, వారిలో ఉన్న అహంకార రోగాన్ని నయం చేయమని అల్లాహ్‌ను ప్రార్థించడం తప్ప మరేమీ చేయజాలము. ఇలాంటి వ్యక్తుల విషయంలో ఈ ఉద్యమ విధానం ఇదే !

★ ఈ ఉద్యమం సరియైనది కాదు. సత్య విరుద్ధమైనది అని భావించి చేసే వ్యతిరేకతను నివారించుటకు అది నిర్విరామంగా తన సత్యసంధతను–ఆవశ్యకతను తగిన ప్రమాణాలతో చక్కగా నిరూపిస్తుంది. అందుకొరకు అది మూడు ముఖ్య వాస్తవాలను విశదీకరిస్తుంది.

మొదటిది: మానవుని సరియైన మార్గదర్శకత్వం, సఫలీకృత జీవితం అతని వాస్తవ సాఫల్యత కోసం అల్లాహ్ ఉపదేశాలు తప్పనిసరి.

రెండవది: అల్లాహ్ పంపిన ఈ మార్గదర్శకత్వం కేవలం ఖుర్‌ఆన్‌లో ఉంది. ఇస్లాం రూపంలో ఉంది.

మూడవది: ఖుర్‌ఆన్, ఇస్లాంల ఈ ఆదేశాలను సంపూర్ణంగా ఆచరించనంతవరకు ముస్లింలపై ఉన్న దాని బాధ్యత నెరవేరదు. దాని ప్రతిఫలాలు ప్రాప్తించవు. వాస్తవంగా ఈ సంపూర్ణ విధేయతకు, ఆచరణకు మారు పేరే 'ధర్మసంస్థాపన.'

మూడవ ప్రయత్నమేమిటంటే : ఇస్లామీయ ప్రభుత్వం 'ముస్లిం ప్రభుత్వం' ఒక్కటే అనే అపార్థాన్ని తొలగించడానికి తన శాయశక్తులా ప్రయత్నిస్తుంది. హేతుబద్ధంగా, షరీఅతు పరంగా, చారిత్రకంగా సాక్ష్యాధారాలతో ఇస్లాం ప్రభుత్వం వేరు 'ముస్లిం ప్రభుత్వం' వేరని మౌలికంగా ప్రామాణికంగా వాటిలో ఎంతో వ్యత్యాసముందని విశదపరుస్తుంది. అది తన సిద్ధాంతాలు, తన ఆశయాలు, తన విలువలు, తన కార్యకలాపాలు తన ఫలితాలు అన్నింటిలోనూ భిన్నమైనది. ఇస్లామీయ ప్రభుత్వాన్ని 'ముస్లింల ప్రభుత్వాన్ని' నడిపే వారు కూడా ముస్లింలే అయినప్పటికీ వారి ఆలోచనా తీరు భిన్నంగా ఉంటుంది. ఇస్లామీయ ప్రభుత్వం నైతిక విలువలను, దైవాదేశాలను సంపూర్ణంగా పాటించడానికి, ధరణిపై దైవాభీష్టాన్ని పూర్తి చేయుటకు కట్టుబడి ఉంటుంది. కాని ముస్లిం ప్రభుత్వం ముస్లిం జాతికి చెందిన కోరికలను తీర్చడానికి కట్టుబడి ఉంటుంది. 'ఇస్లామీయ ప్రభుత్వ' లక్ష్యం ధర్మాన్ని, న్యాయాన్ని స్థాపించడం, సత్కార్యాలను, సదాచారాలను పెంపొందించడం. అధర్మం దౌర్జన్యం దురాగతాలను రూపుమాపడం.

కానీ 'ముస్లిం ప్రభుత్వం' ఎల్లప్పుడు ముస్లిం జాతి ప్రయోజనాల పైనే తన దృష్టిని కేంద్రీకరిస్తుంది. ముస్లిం జాతి ప్రయోజనాలకు భంగం వాటిల్లకుండా ఉంటేనే వేరే విషయాలకు అది ప్రాముఖ్యత ఇస్తుంది. కాబట్టి ముస్లిం ప్రభుత్వం ముస్లిమేతరులకే కాదు ఒక నిజమైన ముస్లింకు కూడా అంగీకారయోగ్యం కాదు. దానికి బదులుగా ఇస్లామీయ ప్రభుత్వం, ఇస్లామీయ వ్యవస్థ శ్రేయోకాంక్షల-విజ్ఞుల దివ్యనేత్రాలకు చల్లదనాన్ని చేకూర్చే మహాభాగ్యం వంటిది. ఈ విషయంలో ఉద్యమం చేసే నాల్గవ ప్రయత్నమేమిటంటే: భారతదేశ విభజనకు ముందు అవాంఛనీయ రాజకీయ పరిణామాల వల్ల జాతుల మధ్య రగిలిన వైషమ్యాలను రూపుమాపడం. దీనికోసం అది ప్రత్యేకంగా ముస్లింలను

వైరుధ్యానికి కారణమయ్యే అన్ని విధానాలకు, వాదోపవాదాలకు, కోరికలకు దూరంగా ఉండాలని కోరుతుంది. ఒక జాతిగా కాకుండా ఒక సైద్ధాంతిక పార్టీగా హుందాతనాన్ని అలవర్చుకోవాలి. మరియు దైవధర్మ ప్రచారకులుగా, సాక్షులుగా స్థాపకులుగా తమ ధ్యేయాన్ని రూపొందించుకుని, సర్వశక్తి యుక్తుల్ని దానికోసం ధారబోయాలి. వారి పోరాటం కేవలం వక్ర విధానాలతో, తప్పుడు విశ్వాసాలతో, దైవధిక్కారంతో, దైవానికి సాటికల్పించడంతో, మత రాహిత్యంతో, అధర్మంతో, ఇస్లామేతర విధానాలతో. అలాగే వారి ప్రయత్నాలన్నీ కేవలం సరియైన విధానాల కోసం, నిజమైన విశ్వాసాల కోసం, ధర్మ పరాయణత కోసం నైతిక విలువల కోసం కావాలి. దైవారాధన, ధర్మనిరతి కోసం కావాలి. వారి వ్యవహార శైలి దైవసందేశ మార్గంలో ఎలాంటి అవరోధానికి కారణం కాకూడదు.

మూడవ రకపు వ్యతిరేకత ప్రభుత్వ అధికారుల ద్వారా ఎదురవుతుంది. దానికి కొన్ని ప్రత్యేక కారణాలున్నాయి. ఈ విషయంలో ఉద్యమం చేసే పని ఏమిటంటే, సమాజంలోని ఈ బాధ్యతాయుత వ్యక్తులకు తమ సందేశపు ప్రతి కోణాన్ని స్పష్టంగా విశదీకరించాలి. తుదకు వారు ఉద్యమాన్ని పూర్తిగా అర్థం చేసుకోవాలి. దాని విధానాలను ఆశయాలను తెలుసుకోగలగాలి. ఈ ఉద్యమం కోరుకుంటున్నది ఏమిటి? ఎందుకు కోరుకుంటుంది? అనేది వారికి తెలిసి రావాలి. దీనికోసం అది సర్వప్రయత్నాలు చేస్తుంది. తన విధానాలను ఆశయాలను తెలియపర్చడానికి తన నియమావళిని, పాలసీ ప్రోగ్రాంలను, తన సాహిత్యాన్ని వారికి అందజేస్తుంది. సందర్భానుసారం ప్రభుత్వ అధికారులతో ప్రత్యక్షంగా కలసి వారిలో ఉన్న అపార్థాలను తొలగించడానికి, వారికి ఉన్న అవగాహనా లేమిని దూరం చేయడానికి ప్రయత్నిస్తుంది. ఇలాంటి ప్రయత్నాలు ఇప్పటి వరకు ఆశించిన ఫలితాలు ఇవ్వలేకపోయినప్పటికీ అవి పూర్తిగా విఫలమైనాయని కూడా భావించలేము. అది పూర్తిగా విఫలమైపోయినప్పటికీ, తన వంతు కర్తవ్యం నెరవేర్చకుండా ఉండజాలదు. ఎందుకంటే ఇతరులు తమ కర్తవ్యాన్ని నెరవేర్చినా, నెరవేర్చకపోయినా, తన కర్తవ్యాన్ని మాత్రం తప్పకుండా నెరవేర్చాలన్న సిద్ధాంతాన్ని అది పాటిస్తుంది. అందువల్లనే అది

ప్రభుత్వ అధికారుల వైఖరి ఏమైనప్పటికీ తన సందేశాన్ని వారికి పూర్తిగా అందజేయడానికి నిరంతరం ప్రయత్నిస్తుంది. ఇక ముందు కూడా ప్రయత్నించగలదు. అదెందుకంటే ఇతరులకంటే వీరి ప్రాముఖ్యత ఎంతో అధికమైనది. వీరు ప్రభుత్వ అధికారులే కాక ఒక ఉన్నత వ్యక్తిత్వమున్నవారు. సమాజంలో కీలక పాత్ర వీరికి ఉంది. ఖుర్‌ఆన్ పరిభాషలో వీరిని "మలాయే ఖౌమ్" (జాతి ప్రముఖులు) అని పేర్కొనటం జరిగింది. కాబట్టి సూత్రప్రాయంగా వారు ఉద్యమానికి ప్రథమ సంబోధితులు కూడా! అంటే వారికి తన సందేశాన్ని చేరవేయడం, దాన్ని స్పష్టంగా విశదీకరించడం మూడు విధాలుగా ఆవశ్యకమైపోయింది. (1) వారు ప్రభుత్వ అధికారులు కాబట్టి ఉద్యమం గురించి ఎలాంటి అపార్థాలకు - అపనమ్మకాలకు గురికాకుండా చూడాలి. (2) సమాజంలో ఉన్న వ్యక్తులు కాబట్టి ఇతరులతో పాటు వారిని తప్పకుండా సంబోధించాలి. (3) ప్రభుత్వ అధికారులు కాబట్టి సూత్రప్రాయంగా వారు చాలా ముఖ్యమైన సంబోధితులు.

ఈ సందర్భంలో ఒక విషయాన్ని తప్పకుండా గుర్తుంచుకోవాలి. ప్రభుత్వ అధికారులకు తప్పుడు సమాచారం అందడం వల్ల అపార్థాలు పెరిగి, వ్యతిరేకత ఏర్పడిందనీ, ఈ అపార్థాలు తొలగించినట్లయితే ప్రతికూలత సమసిపోతుందని సంబరపడవలసిన అవసరం లేనేలేదు. ఇతర వ్యక్తుల వలెనే, ప్రభుత్వ వ్యతిరేకతకు ఇతరత్రా కారణాలు కూడా ఉండవచ్చు. ఉద్యమం గురించి సరియైన సమాచారం అందినప్పటికీ వ్యతిరేకతకు పూనుకోవచ్చు అనే వాస్తవాన్ని అది గ్రహిస్తుంది. కాబట్టి వ్యతిరేకతకు కారణం అపార్థం లేదా అవగాహనలేమి ఒక్కటే కాదు, ఇతర కారణాలున్నాయని తెలిసినప్పుడు కూడా దానిని పరిష్కరించడానికి సమంజస వైఖరి అవలంబిస్తుంది. అన్ని ప్రయత్నాలు చేసినప్పటికీ ప్రభుత్వ వ్యతిరేకత సమసిపోదని అది భావిస్తుంది. ఎందుకంటే ఈ ఉద్యమం ఒక ప్రత్యేకమైన సామూహిక వ్యవస్థను స్థాపించదలుస్తుంది. దానికోసం అది కృషి చేస్తుంది. కాబట్టి ప్రస్తుత సామూహిక వ్యవస్థను నడిపే ప్రభుత్వం స్వాభావికంగా ఈ ఉద్యమాన్ని బద్ద శత్రువుగానే పరిగణిస్తుంది. బద్ధ శత్రువును ఎవరూ భరించలేరు కదా!

# ముస్లిం సమాజానికి, దేశానికి చెందిన ముఖ్య సమస్యలు

**సమస్యలు - ఉద్యమం**

నిస్సందేహంగా ఇస్లామీయ ఉద్యమ దృష్టిలో రెండే రెండు సమస్యలున్నాయి. దైవదాసులందరికీ సత్యధర్మ సందేశాన్ని అందజేయడం మరియు తన సభ్యులను మానసికంగా, విశ్వాసపరంగా బలోపేతం చేసి వారు కార్యోన్ముఖులు కావడానికి శిక్షణ ఇవ్వడం. కాని కొన్ని కారణాల వల్ల ముస్లిం సమాజం, దేశం ఎదుర్కొంటున్న ముఖ్య సమస్యలను అది చూస్తూ నిర్లిప్తంగా ఉండజాలదు. ఆ కారణాలు క్లుప్తంగా చెప్పాలంటే ఇవి :

**1) మొదటి కారణం:** స్వయంగా ఈ ఉద్యమ ప్రయోజనానికి సంబంధించినది. ఈ ధరణిపై జరుగుతున్న కార్యకలాపాలను పట్టించుకోకుండా ఉండటానికి లేదా వాటి ప్రభావం తనపై పడకుండా ఉండటానికి ఈ ఉద్యమం తన కార్యకలాపాలను గగనతలంలో కొనసాగించటం లేదు. భూమిపైననే నడిపిస్తోంది. ఈ ప్రపంచమే, ఈ జీవన రంగమే దాని కార్యక్షేత్రం. అందులోనే అది తాను కోరుకునే సత్యప్రధానమైన వ్యవస్థను స్థాపించదలుస్తుంది. ఆ ప్రజలనే అది సంబోధిస్తుంది. వారి ధర్మంతో, దైవంతో మానసికంగా, ఆధ్యాత్మికంగా వారి బాంధవ్యాన్ని కోరుకుంటుంది. ఆ బాంధవ్యాన్ని పెంపొందించదానికి అన్ని విధాలుగా ప్రయత్నిస్తుంది. అలాగే ముస్లిం సమాజానికి ఇస్లాం, ఖుర్ఆన్‌తో ప్రస్తుతమున్న బాంధవ్యాన్ని పరిరక్షించదానికి, బలహీనపడకుండా ఉండటానికి సకల ప్రయత్నాలు చేస్తుంది. ఇస్లాంతో, ఖుర్ఆన్‌తో ముస్లింలకున్న ఈ

బాంధవ్యం ఎంత బలహీనమైనప్పటికీ, ఈ సందేశ ప్రచారానికి వారి అవసర
మెంతైనా ఉంది. ఈ బలహీన ముస్లింలను అవిరళ కృషితో శక్తిమంతులుగా
తీర్చిదిద్దవచ్చు. అలా చేయకపోతే ధార్మికంగా పతనావస్థకు దోహదపడే ముస్లిం
సమాజ అంతర్గత బలహీనతలు పెరగడానికి ప్రేరేపించినట్లే అవుతుంది.
తద్వారా ఆ ముస్లింలు ఉద్యమానికి పనికి రాని వారిలా మారిపోయే ప్రమాద
ముంది. కాబట్టి అలా చేయడం అవివేకం. దూరదృష్టి లోపమే అవుతుంది.
అలాగే ఇస్లాం ఆలోచనలకు విధానాలకు వ్యతిరేకంగా, అధికారుల అండదండ
లతో ఎదురవుతున్న వ్యతిరేకతలకు కారణాలను విప్పారిన నేత్రాలతో నిశితంగా
పరిశీలించి కనుగొనలేకపోవడం, రానున్న భయంకర పరిస్థితులను గమనించక
పోవడం కూడా అవివేకమే, దూరదృష్టి రాహిత్యమే అవుతుంది. ఈ విషయంలో
ముస్లింల తప్పిదాలు ఉన్నప్పటికీ, స్వాతంత్ర్యానంతరం ప్రభుత్వం రూపొం
దించిన విద్యావిధానాలు, సాంస్కృతిక కార్యక్రమాలు ముస్లింలలో మిగిలి ఉన్న
ధర్మపరాయణతను, ఇస్లామీ జీవన విధానాన్ని జలగలా పట్టి చివరి రక్తపు
బొట్టును కూడా పీల్చడానికి సన్నద్ధంగా ఉన్నాయి. ఇలాంటి పరిస్థితిలో సర్వమాన
వాళిని దైవదాసులుగా మార్చడానికి యావత్ మానవ జీవితాన్ని ఇస్లాం
విధానాలకు అనుగుణంగా తీర్చిదిద్దడానికి ప్రయత్నించే ఇస్లామీయ ఉద్యమం
వేడుక చూస్తూ ఎలా ఊరుకుంటుంది? ప్రస్తుత ప్రభుత్వ విధానాలు దానికి
వ్యతిరేకంగా బలమైన నిరంతర దాడిగా భావించవచ్చు. ఆ దాడి నుంచి రక్షించు
కోవడం దాని ప్రథమ కర్తవ్యం. అలా కాకుండా సకారాత్మక సందేశ కార్యక్రమాల
వరకే అది పరిమితమైపోతే, అది తన వద్దనున్న స్వల్ప వనరులతో కొందరికి
సత్యధర్మ అవగాహన కల్పించిన సమయంలోనే అధికారంలోవున్న ప్రభుత్వ
యంత్రాంగం అపారమైన వనరులతో వేలాది మానవుల మస్తిష్కంలో అధర్మపు
అంధకారాన్ని ప్రవేశపెట్టగలదు. అందువల్లనే ముస్లింలలో మిగిలివున్న ధార్మిక
సంబంధంపై దాడిచేసే ఇలాంటి విధానాలన్నింటినీ అది ప్రతిఘటించింది,
ప్రతిఘటిస్తూ ఉండాలి కూడా. ముస్లిం సముదాయంలో మిగిలివున్న కాస్తోకూస్తో
ధార్మిక చైతన్యాన్ని అయినా సజీవంగా ఉంచుకోవాలి కదా!

రెండవ కారణం ఏమిటంటే: ఇస్లాం తన అనుయాయులకు తన తోటి ధార్మిక సోదరుల మరియు ఇతర దైవదాసుల అనేక హక్కులను నెరవేర్చవలసిన బాధ్యత అప్పగించింది. ధర్మపరంగాను, విశ్వాసపరంగానూ దానిని నెరవేర్చడం తప్పనిసరి. ఉదాహరణకు: పేదరికంలో వారికి సహాయపడటం, నిస్సహాయుల, బలహీనుల హక్కులను పరిరక్షించడం. కష్టాలలో ఆదుకోవడం. దౌర్జన్యాల నుండి వారిని రక్షించడం, సత్కార్యాలలో వారితో సహకరించడం. ఇలాంటి అనేక కార్యాలు ముస్లింల విధుల్లో పొందుపర్చబడి ఉన్నాయి. కాబట్టి ఇస్లామీయ ఉద్యమంతో సంబంధం ఉన్న వ్యక్తులు ఈ బాధ్యతలను నెరవేర్చడానికి వెనుకంజ వేయరు. దైవధర్మ సందేశ ప్రదాతలు కావడం వల్ల వారు ఇతర ముస్లింలకంటే అధికంగా ఈ ధార్మిక బాధ్యతలు నెరవేర్చాలి. ఈ దేశంలో నెలకొని ఉన్న అసాధారణ పరిస్థితుల్లో ఈ విషయాలను పట్టించుకోకపోవడం చలనం లేని విశ్వాసానికి తార్కాణమవుతుంది. ఒక ఇస్లామీయ ఉద్యమం- ధర్మసంస్థాపనా ఉద్యమం- ఏమి లేకున్నా ఇస్లామీయ ఉద్యమంగా మనగలదు. కానీ తన అనుయాయుల, కార్యకర్తల ధ్వజవాహకుల విశ్వాసం చలన రహితమైతే మాత్రం అది ఇస్లామీయ ఉద్యమంగా మనజాలదు.

## సమస్యలు అనూహ్యం కావు

ఈనాడు దేశం, సమాజం (మిల్లత్) ఎదుర్కొంటున్న సమస్యలు అసంఖ్యాకం. ఇవి అనూహ్యం కావు. ముఖ్యంగా ముస్లిం సమాజానికి దాపురించిన కష్టాలు-సమస్యలు తక్కువగానే భావించాలి. ఎందుకంటే ఒక ఇస్లామేతర ప్రభుత్వ వ్యవస్థలో ముస్లిం ఇస్లాంలకు అనేక సమస్యలు ఎదురవ్వడం స్వాభావికమైన విషయమే. ఏ జీవిత రంగాన్ని కూడా అది సక్రమంగా ఉండనీయదు. అందువల్లనే ఈనాడు దేశానికి ముఖ్యంగా ముస్లింలకు ఎనలేని సమస్యలు ఎదురవుతున్నాయంటే ఆశ్చర్యపడలసిన అవసరం లేదు. ఇన్ని ప్రధాన సమస్యలున్నప్పటికీ ఇస్లామీయ ఉద్యమం తన కార్యకలాపాలలో వాటికి ప్రథమస్థానమివ్వదు. దానికి అనేక ముఖ్యకారణాలున్నాయి. మొదటి ముఖ్య కారణం: ప్రస్ఫుటమైనదే. అదేమిటంటే ఇస్లామీయ ఉద్యమ ముఖ్య ఆశయం దైవధర్మ ప్రచారం, ఉపదేశం. మరియు తన కార్యకర్తల శిక్షణ.

**రెండవ కారణం:** ఈ సమస్యల సరియైన శాశ్వతమైన పరిష్కారం కూడా వాస్తవంగా ఈ సందేశ సాఫల్యతపైనే ఆధారపడి ఉంది. దీనిని విడనాడి ఏ తరుణోపాయం కోసం ప్రయత్నాలు చేసినాఈ సమస్యల ప్రభావాన్ని కొంత మేరకే తాత్కాలికంగా తగ్గించవచ్చుగాని వాటిని పూర్తిగా నిర్మూలించజాలము.

**మూడవ కారణం ఏమిటంటే:** తాత్కాలికంగా కొంతమేరకు ఈ సమస్యలను పరిష్కరించడానికి ప్రయత్నించేవారు అనేకమంది వున్నారు. అంతేకాదు, ఎన్నో ఉద్యమాలు, పార్టీలు ఈ సమస్యలను పరిష్కరించడానికి ఉనికిలోకి వచ్చాయి. కాని దైవధర్మ సంస్థాపన వంటి మహోన్నత ఆశయం కోసం కృషి చేసే వారు చాలా అరుదుగా ఉన్నారు.

**నాల్గవ కారణం:** ఇస్లామీయ ఉద్యమ వనరులు చాలా పరిమితంగా ఉన్నాయి. ఇలాంటి పరిస్థితుల్లో ఇస్లామీయ ఉద్యమం దేశ సమాజ సమస్యలపై ఒక పరిమిత పరిధి వరకే దృష్టిసారించగలదు. తన కార్యక్రమాలలో వాటికి రెండవ స్థానాన్నే ఇవ్వగలదు.

## ప్రాధాన్యతా క్రమంలో సమస్యల విభజన

ఈ సమస్యల పరిష్కారానికి అది ఒక నియమిత హద్దును ఏర్పరుచుకుంది. అలా చేయడానికి అది రెండు విషయాలను ప్రాతిపదికగా చేసుకుంది. ఒకటి: తనకున్న శక్తిని-వనరులను, రెండవది: ఆ సమస్యల ప్రాధాన్యతను, అంటే ఈ ఉద్యమం తన వద్ద ఉన్న వనరులెన్ని? అందులో ఎంత భాగము ఈ సమస్యల పరిష్కారానికి కేటాయించాలి? అని నిర్ణయిస్తుంది. అలాగే దేశానికి మిల్లత్‌కు ఎదురవుతున్న అనేక సమస్యలలో ఏ సమస్య ప్రధానమైనది? ఏ సమస్యవల్ల అధిక నష్టం వాటిల్లుతుంది? దానికంటే తక్కువ నష్టాన్ని కలిగించే సమస్యలేమిటి? అనే విషయం బేరీజు వేసుకుంటుంది. ఏ ప్రభుత్వ ప్రణాళికలు, విధానాలు మరియు పరిస్థితుల ప్రభావం వల్ల ఉత్పన్నమైన ఏ ఏ సమస్యలు భవిష్యత్తులో తనకు నష్టదాయకమో అది అవగతం చేసుకుంటుంది. ఈ రెండు విషయాలపై సమగ్రమైన పరిశీలన జరిపి ఒక అవగాహనకు వస్తే సమస్యల పట్ల సమంజసమైన విధానాన్ని అవలంబించడానికి దోహదపడుతుంది. అలా

పరిశీలించిన పిదప ఈ సమస్యలను అత్యంత ప్రధానమైనవి, సామాన్యమైనవి అని రెండు విధాలుగా విభజించింది. మరియు ప్రాధాన్యతా క్రమాన్ని బట్టి దేనిపై ఎంత దృష్టి పెట్టాలో నిర్ణయించింది. మొదటి రకానికి చెందిన సమస్యలు దాని కార్యాచరణ పరిధిలో ఉన్నాయి. రెండవ రకానికి చెందిన సమస్యలపై అది కేవలం తన అభిప్రాయాలను భావోద్వేగాలను వెల్లడిస్తుంది. అంతమాత్రాన వాటి ప్రాముఖ్యత దానికి తెలీదని, లేదా అవి దేశానికి ముస్లిం సమాజానికి లేదా ఇస్లామీ ఉద్యమానికి సంబంధించిన సమస్యలు కావని భావించినట్లుకాదు. ఉద్యమ వనరులు సమస్యలన్నింటిని పరిష్కరించడానికి సరిపడవు. చాలినన్ని వనరులు సమకూరినట్లయితే నిస్సందేహంగా ఈ సమస్యలన్నింటినీ పరిష్కరించ డానికి అది ప్రయత్నించేది. ఈనాడు దానికున్న పరిమిత వనరుల దృష్ట్యా ఆ ఆలోచనే అది చేయజాలదు. అలా చేస్తే విస్తరించిన కార్యరంగం వల్ల ఉద్యమ శక్తి నిర్వీర్యమైపోతుంది. దాని ప్రయత్నాలు విభిన్న కార్యాలపై విభజితమైపోవడం వల్ల చాలా వరకు సఫలీకృతం కాజాలవు.

**1) అత్యంత ప్రధాన సమస్యలు**

మొదటి రకపు సమస్యలను వాటికున్న ప్రాధాన్యత దృష్ట్యా ఇస్లామీయ ఉద్యమం తన కార్యాచరణలో పొందుపర్చింది. వాటిని దిగువన పేర్కొనటం జరిగింది:

1) **మౌలిక ధార్మిక విద్యను విస్తృతస్థాయిలో ప్రవేశపెట్టడం.**

2) **ప్రభుత్వ నిర్బంధ విద్యావిధానం నుండి ముస్లిం విద్యార్థుల మినహా యింపు.**

3) **ప్రభుత్వ పాఠ్యాంశాల సంస్కరణ.**

4) **ముస్లిం పర్సనల్ లా- ఖచ్చితంగా చెప్పాలంటే ముస్లింల వ్యక్తిగత జీవితానికి సంబంధించిన ఇస్లామీయ చట్టాల పరిరక్షణ.**

5) **ముస్లింలలో ధార్మిక చైతన్యం, వారిపై ఉన్న ధర్మప్రచార బాధ్యతను తెలియపర్చి జాగృత పర్చడం.**

6) **మానవ సేవ.**

**7) మతతత్వ నిర్మూలన జాత్యాహంకార సంఘర్షణల నివారణ.**

**8) దేశంలో సత్కార్యాలను (మంచిని పుణ్యాన్ని కాంక్షించడం) పెంపొందించడం, దుష్కార్యాలను(భౌతిక లాలసత్వం, చెడు నడవడిక, పాపకార్యాలు) నిర్మూలించడం.**

**9) ముస్లింల ధన ప్రాణ రక్షణ.**

– పై సమస్యలకు అధిక ప్రాధాన్యత ఎందుకు ఇవ్వబడింది? దానికి కారణాలేమిటి? నిదానంగా ఆలోచిస్తే అర్థమైపోతుంది.

– మౌలిక ధార్మిక విద్యా ప్రాచుర్యం ఎంత ఆవశ్యకమైనదో స్పష్టంగా అందరికీ తెలుసు. ముస్లింలనవతరం ముస్లింలుగా ఉండాలంటే అది ముఖ్యంగా వారి ధార్మిక విద్యాబుద్ధులపైనే ఆధారపడి ఉంది. ముస్లిం సంతతి ఏ స్థాయి వరకు నిజ ముస్లింలౌతారో ఆ స్థాయి మేరకే వారు తమ విశిష్టతను, తమపై ఉన్న ధర్మప్రచార బాధ్యతను గుర్తిస్తారు. ఆ బాధ్యతను ఎంత మేరకు గుర్తిస్తే అంతమేరకు ఇస్లామీ ఉద్యమానికి సహకరిస్తారు.

ప్రభుత్వ నిర్బంధ విద్యావిధానం నుండి ముస్లిం విద్యార్థులను మినహాయించే ప్రయత్నం వారిని ధార్మిక ఆచార సంప్రదాయాల నుండి ధర్మభ్రష్టత (ఇర్తెదాద్) ప్రమాదం నుండి రక్షించడానికి చేయబడింది. వాస్తవ పరిస్థితి ఏమిటంటే ఇక్కడి రాష్ట్ర ప్రభుత్వాలు రూపొందించిన పాఠ్యప్రణాళికలన్నీ ఇస్లాం దృష్టికోణంతో చూస్తే చాలా ప్రమాదకరమైనవి. అందులో బహుదైవారాధనా విశ్వాసాలను, ఆచారాలను జొప్పించటమే కాకుండా, ముస్లింల పట్ల విద్వేషం, ఏహ్యాభావాన్ని కల్గించే విధంగా కథనాలు చేర్చబడ్డాయి. అంతేకాదు, ఆ విద్యను బోధించేవారు కూడా 98 శాతం పైన పేర్కొన్న విశ్వాసాలను కలిగి ఉన్నవారే. వారి ఆచారాలు అవే,వారూ ఆ కాల్పనిక దేవతల గాథలనే నమ్ముతారు. కాబట్టి వారు విద్యార్థులకు చదువు చెప్పడంతోపాటు తమ విశ్వాసాలకు, ఆలోచనలకు అనుగుణంగా వారి మేథో మథనం చేస్తారు. ఇలాంటి విద్యాబుద్ధుల వల్ల ముస్లింలపై కలిగే ప్రభావం చెప్పనలవి కాదు. ముస్లిం చిన్నారుల నిర్మలమైన, నిష్కల్మశమైన సున్నిత మేధస్సుపై ఆరు సంవత్సరాల వరకు ఎడతెగకుండా

కాల్పనిక దేవతల గాథలను, బహుదైవారాధనా విశ్వాసాలను ఉపదేశిస్తుంటే వారు ఎలాంటి ముస్లింలుగా రూపొందుతారనేది తెలుసుకోవడం కష్టతరం కాదు. ఈనాటి ముస్లింలకు ఇస్లాం పట్ల సరియైన అవగాహన లేదు. పరిజ్ఞానం లేదు. చదువూ రాదు. వీరు ఇస్లాం నుండి ఎంత దూరంలో ఉన్నారో అంతకంటే అధిక దూరంలో ఈ చదువుకున్న ముస్లింలు ఉన్నారు. ఇలాంటి నిర్బంధ విద్యావిధానం ఎప్పుడో ప్రవేశపెట్టబడింది. కేవలం ఆర్థిక ఇబ్బందుల వల్ల యావత్ దేశంలో ఇది ఇంకా అమలు కాలేదు. కాని సాధ్యమైనంత త్వరలో ఈ విధానాన్ని దేశ నలుదిశలలో ప్రవేశపెట్టడానికి సిద్ధంగా ఉంది. అది దాని రాజ్యాంగబద్ధమైన బాధ్యత కూడా. ఇలాంటి పరిస్థితుల్లో తప్పనిసరిగా బహు దైవారాధన దైవధిక్కార ప్రభావం నుండి ముస్లిం విద్యార్థులను సంపూర్ణంగా సంరక్షించుకోవాలి. ఎందుకంటే ముస్లిం విద్యార్థికి కూడా విద్యార్జన ప్రమాదకర మైన విధానం ద్వారానే పొందవలసిన అగత్యం ఉండకూడదు. అలా చేయకుంటే వారు ఇస్లాంకు దూరమై మేధస్సులో విరోధభావాలు పెంపొందించుకుంటారు. ఇది ఇస్లాం కొరకు అత్యంత ప్రమాదకరమైన విషయం. ఇస్లామీయ ఉద్యమ భవిష్యత్తుకు కూడా అత్యంత ప్రమాదకరం. ఇలాంటి స్థితిలో ఇస్లామీయ ఉద్యమ నియమాలు ఆశయాలతో రేపటి ముస్లింల అవగాహన నేటి ముస్లింల అవగాహనకంటే ఎన్నోరెట్లు అధమంగా ఉంటుంది. కాబట్టి ముస్లిం విద్యార్థులు ప్రభుత్వ నిర్బంధ విద్యావిధానం నుండి తప్పనిసరిగా మినహాయింపు పొందడం ఈనాడు ఎంతో అవసరం. చివరకు మౌలిక ధార్మిక విద్యావ్యాప్తికన్నా ఇది ముఖ్యమైనది. ఎందుకంటే ఈ మౌలిక ధార్మిక విద్యావ్యాప్తి యొక్క ప్రయోజనాలు కూడా ముస్లిం విద్యార్థులను తప్పనిసరిగా ప్రభుత్వ విద్యాలయాలలో చేర్పించాలనే ప్రభుత్వ ఆంక్షలు లేనప్పుడు మాత్రమే సాధ్యమవుతాయి. ప్రైవేటు ధార్మిక విద్యాలయాలలో ప్రవేశానికి స్వేచ్ఛలేనప్పుడు అందులో విద్యనభ్యసించే వాడెవడు?

– ప్రభుత్వ పాఠ్యప్రణాళిక వల్ల కలిగే నష్టాలు, ప్రభుత్వ నిర్బంధ విద్యా విధానం వల్ల కలిగే నష్టాలకంటే తక్కువేమీ కావు. కాబట్టి పాఠ్యప్రణాళికను

సహితం సంస్కరించే అవసరం ఎంతైనా ఉంది. ముస్లిం విద్యార్థులు ఈ నిర్బంధ విద్యావిధానం నుండి మినహాయింపు పొందినప్పటికీ, ప్రైవేటు పాఠశాలలో ప్రవేశం పొందే ఆర్థిక స్తోమత లేక ఎంతో మంది ప్రభుత్వ పాఠశాలల్లో చేరే అవకాశముంది. లక్షలాది మంది విద్యార్థుల కోసం ఎన్నో ధార్మిక పాఠశాలలు స్థాపించినప్పటికీ, ప్రభుత్వ పాఠశాలల్లో లభించే రాయితీలను, సౌకర్యాలను విడనాడి తమ పిల్లలను ధార్మిక పాఠశాలల్లో చేర్పించేంత చైతన్యవంతమైన, బలమైన, విశ్వాసాన్ని ముస్లింలందరూ కలిగి ఉంటారని భావించలేం. కాబట్టి ప్రభుత్వ పాఠ్యప్రణాళిక వల్ల కలిగే విశ్వాస రాహిత్య కీడును నివారించేందుకు కీడు కలుగనంతవరకు మాత్రమే దాన్ని భరించాలి. "భరించాలి" అని ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే, ఒక సెక్యులర్ ప్రభుత్వంలో రూపొందించిన పాఠ్యప్రణాళిక ఎంత విశిష్టంగా ఉన్నప్పటికీ ధార్మిక దృష్టిలో అది, పరిపూర్ణంగా ఉండజాలదు. అది కేవలం భరించేస్థాయిలోనే ఉంటుంది.

– 'ముస్లిం పర్సనల్ లా' పరిరక్షణ సమస్య కూడా ఒక విధంగా ప్రభుత్వ నిర్బంధ విద్యాప్రణాళిక కీడునుండి ముస్లిం విద్యార్థులను మినహాయించే సమస్య లాంటిదే. పరిస్థితి ఏమిటంటే, ముస్లింలు ఒక ఇస్లామేతర ప్రభుత్వవిధానాలలో జీవనం గడపడం మూలాన, ధర్మపరంగా సామూహిక ఆదేశాలను పాటించలేక పోయారు. ఇలా సామూహిక జీవన రంగంలో వారు ఇస్లామేతర విధానాలకు అలవడ్డారు. కాని ఈనాడు వారి వ్యక్తిగత జీవన రంగంలో కూడా ఇస్లామీ విధానానికి ప్రమాద ఘంటికలు మ్రోగుతున్నాయి. జాతి, మత, తారతమ్యాలు లేకుండా దేశ పౌరులందరికీ ఒకే సివిల్‌కోడ్‌ను రూపొందించి అమలు పరచాలనే భారత రాజ్యాంగం ఆదేశిస్తుంది. దానిని ప్రవేశపెట్టాలని ప్రభుత్వం ఉరకలు వేస్తోంది. ప్రభుత్వం ఈ విషయంలో సఫలమైతే, జరిగేది ఏమిటంటే– వివాహం, విడాకులు, వారసత్వం, వీలునామా, ఆస్తిప్రదానం మొదలైన విషయాలలో ముస్లింలు ఇంతవరకు ఆచరిస్తున్న ఇస్లామీ చట్టాలు కూడా సమసిపోతాయి. ఖుర్ఆన్, ప్రవక్త (స) సంప్రదాయం ప్రకారం తప్పకుండా ఆచరించవలసిన ఆదేశాలు కూడా తమ ప్రాధాన్యతను కోల్పోతాయి. ఉదాహరణకు:

వివాహ మాడటానికి ఇస్లాంపై, దైవంపై విశ్వాసం ఉండాలనే షరతు చట్టవిరుద్ధమని పరిగణించబడవచ్చు. (ఖుర్ఆన్ ముస్లిమేతరులతో వివాహాన్ని ఖచ్చితంగా నిషేధించింది). తప్పని పరిస్థితుల్లో, అవసరార్థం కూడా ఒకరికంటే ఎక్కువ వివాహాలు నిషేధించవచ్చు (షరీయత్ దీన్ని అనుమతించింది). విడాకుల అధికారం పురుషుని నుండి తొలగించి ప్రభుత్వ యంత్రాంగానికి అప్పగించవచ్చు. లేదా ఈ విషయంలో స్త్రీ పురుషులకు సమాన అధికారం కల్పించవచ్చు (కాని ఇది ఇస్లామీ చట్ట ప్రకారం కేవలం పురుషునికే ఉంది). మరణించిన వ్యక్తి ఆస్తి పంపకంలో కుమారులకు, కుమార్తెలకు సమంగా ఆస్తి పంపకం చేయడానికి ఆదేశించవచ్చు (అల్లాహ్ గ్రంథంలో, కుమారుల వాటా స్పష్టంగా అధికంగా ఉందని పేర్కొనబడింది). ఈ విధంగా కామన్ సివిల్ కోడ్ ప్రవేశపెట్టినట్లయితే ఇలాంటి విషయాలకు ఖచ్చితంగా ఆస్కారముంది. దురదృష్టవశాత్తు ఈ ఒకే సివిల్ కోడ్ ప్రవేశపెడితే, ముస్లింలలో ప్రస్తుతమున్న ఈ ధార్మిక బలహీన సంబంధాలు కూడా చెరిగిపోతాయి. ఇప్పుడున్న వారి సామాజిక సాంస్కృతిక వైభవం, మస్జిద్‌లకు వెలుపల ఏమాత్రం మిగిలి ఉండదు. ఎందుకంటే ఒక వర్గానికి చెందిన ప్రత్యేక పర్సనల్ లా పైనే దాని సామాజిక ప్రత్యేకత, సాంస్కృతిక వ్యక్తిత్వం ఆధారపడి ఉంటుంది. దానిని తొలగిస్తే దాని ఆనవాళ్ళు కూడా మిగిలి ఉండవు. అందుకే ముస్లిం పర్సనల్ లా ను తొలగించే ప్రయత్నం వాస్తవంగా ఈ ధరణిలో మిగిలివున్న ఇస్లాం సిద్ధాంతాలను చెరిపివేసే కుటిల ప్రయత్నమే! ఈనాటి వరకు నిర్మూలించబడిన ఇస్లాం సిద్ధాంతాలను తిరిగి నెలకొల్పడమే తన ఆశయంగా పెట్టుకున్న ఇస్లామీయ ఉద్యమం దీన్ని ఒక ఛాలెంజ్‌గా పరిగణిస్తుంది.

★ ముస్లింలలో ధార్మిక చైతన్యం కల్గించడం, వారిలో ధర్మ ప్రచార బాధ్యతను జాగృత పర్చడం వాస్తవంగా ఇస్లామీయ ఉద్యమానికి అనుకూల వాతావరణం సృష్టించడానికి ఎంతో అవసరం. కాబట్టి దానిని కూడా ధర్మప్రచార కార్యంగానే పరిగణించాలి. ముస్లింలు తమ ధర్మానికి ఎంత దగ్గరవుతారో ఇస్లామీ ఉద్యమానికి అంతే దగ్గరవుతారు. కాబట్టి ఇస్లామీయ ఉద్యమం

చేసే ఈ ప్రయత్నం సహజమైనది. ఆవశ్యకమైనది. ముస్లింలలో నిజమైన ఇస్లాం పరిజ్ఞానం పెంపొందించి, వారి ఆలోచనాతీరు, ఆచరణా విధానం, నిజ దైవ దాస్యానికి అనువుగా రూపొందిస్తుంది. వారి దైవ బాంధవ్యాన్ని పటిష్టపరచ డానికి, పూర్తి జీవితాన్ని తీర్చిదిద్దడానికి, ఇస్లాం ధర్మ సాక్షులుగా నిలబెట్టడానికి అది ప్రయత్నిస్తుంది. అలా చేయకుంటే, ధర్మపరంగా ఈనాడు వారిలో ఉన్న బలహీనతలు ఇస్లామీయ ఉద్యమానికి అవరోధాలుగా మారగలవు.

★ ఇస్లాం నేర్పిన మానవత్వం – సౌభ్రాతృత్వం, కారుణ్యం, సమభావన మొదలైన నైతిక విలువలకు ప్రతిరూపమే 'మానవసేవ'. ఇస్లాంలో దానికి ప్రముఖస్థానం ఉంది. దైవ విశ్వాసం దైవదాసుల దుఃఖాన్ని పట్టించుకోకుండా ఉండనీయదు. ఈ కార్యంవల్ల హృదయాలను జయించవచ్చు. కాబట్టి ఇస్లామీయ ఉద్యమానికి దీని ఆవశ్యకత సూత్రప్రాయంగానూ, ఆశయ పరంగానూ చాలా ముఖ్యమైనది. కాబట్టి ఇస్లాంను ఆచరించే ఒక నిజమైన ముస్లింలాగే ఉద్యమ కార్యకర్తలు కూడా ఆవశ్యకమైన ఈ ధార్మిక కార్యాన్నుండి దూరంగా ఉండ జాలరు. వాస్తవంగా ఇది ఒక సమాజ లేదా దేశ సమస్య కాదు. దీనికి ఒక పాలసీ కూడా అవసరం లేదు. కాబట్టి ఇస్లామీయ ఉద్యమం తన కార్యకర్తలకు ఈ విషయంలో ఆదేశాలిచ్చే అవసరమే లేదు. ఈ 'మానవసేవ' ఒక ముస్లింగా, ఇస్లాంధర్మ అనుయాయిగా వారి ధార్మిక బాధ్యత. విశ్వాసానికి ప్రతీకగా భావించి దానిని వారు స్వతహాగా నెరవేరుస్తారు.

★ కాని ఈ విషయంలో ఒక విధానాన్ని ఇస్లామీయ ఉద్యమం నిర్ణయించ వలసి వస్తుంది. అదేమిటంటే ఈ బాధ్యతను వ్యక్తులు కేవలం వ్యక్తిగతంగా నెరవేర్చాలా లేదా సంస్థాగతంగా సామూహికంగా నెరవేర్చాలా? అనేది. ఇస్లామీయ ఉద్యమం "మానవ సేవ"ను ఒక సమాజ దేశ సమస్యగానే తన ప్రోగ్రాంలో పేర్కొంది. సర్వసామాన్యంగా యావత్ దేశానికి ముఖ్యంగా ముస్లిం లకు ఎదురయ్యే సమస్యలే దీనికి కారణం. ఉదాహరణకు ముస్లింలపై జరుగు తున్న ఎడతెగని మతతత్వ హింసా దౌర్జన్యాలు, వాటివల్ల జరిగే హత్యాకాండలు, విధ్వంసాలు, అతివృష్టి అనావృష్టి వల్ల దేశవ్యాప్తంగా నెలకొనే దుర్భర పరిస్థితులు.

ఇలాంటి అసాధారణ పరిస్థితుల్లో బాధితులకు సేవచేయడం, ఆదుకోవడం వ్యక్తిగతంగా ఒక వ్యక్తికి సాధ్యపడదు. కాబట్టి సామూహికంగా, ప్రణాళికా బద్ధంగా చేసే ప్రయత్నమే సత్ఫలితాలివ్వగలదు.

★ మతతత్వ నిర్మూలన, జాత్యాహంకార సంఘర్షణా నివారణకు ఇస్లామీయ ఉద్యమం రెట్టింపు ప్రాధాన్యత ఇస్తుంది. ఈ మతతత్వం మరియు జాత్యాహం కారం ఎంతఘోరమైన చెడుగు అంటే అది మానవత్వం, సోదరభావం, న్యాయం, ధర్మం, త్యాగనిరతి, వాటి మౌలిక నైతిక విలువలను మంటగలుపుతుంది. నిజం చెప్పాలంటే అది కేవలం ఒక నేరం కాదు, అనేక నేరాలకు పుట్టినిల్లు లాంటిది.

ఈ జాడ్యము అంటుకున్న సమాజంలో పుణ్యకార్యాలకు తావుండదు. కాబట్టి పాపాలను నిర్మూలించి పుణ్యాలను పాదుకొల్పడమే మౌలిక లక్షణం గల ఇస్లామీయ ఉద్యమం దానిని నిర్మూలించడాన్ని తన ప్రధమ కర్తవ్యంగా భావిస్తుంది. మరో విషయమేమిటంటే మతతత్వం జాత్యాహంకారం వల్ల కలిగే సంఘర్షణ స్వయాన ఈ సందేశానికి ఒక గుదిబండ లాంటిది. పరిస్థితులను దానికి వ్యతిరేకంగా– విషపూరితంగా మార్చివేస్తుంది. ఎందుకంటే ఇది మానవ మస్తిష్కాన్ని ఘోర వ్యాకులతకు గురిచేస్తుంది. న్యాయం, సత్య స్వీకార గుణం బదులు విముఖతను కల్గిస్తాయి. దానివల్ల ముస్లిమేతరులకు ఇస్లాం సందేశం, అసహనానికి, ద్వేషాగ్నికి, కోపోద్రేకాలకు గురిచేస్తుంది. మరోవైపు ముస్లింలు కూడా ఇబ్బందికి గురిఅవుతారు. కాబట్టి ఇస్లామీయ ఉద్యమం ఈ దుష్టశక్తులను కనిపెట్టకుండా కళ్ళు మూసుకుని ఉంటే, తన భవిష్యత్తుకు నిస్సందేహంగా ముళ్లబాట వేయగలదు. అందువల్ల అది తన శాయశక్తులా ఈ ఘోరమైన నైతిక జాడ్యాలను కూకటివ్రేళ్ళతో పెకలించి పారవేయడానికి ఏమాత్రం వెనుకంజ వేయదు.

★ "సత్కార్యాలను పెంపొందించడం, దుష్కార్యాలను నిర్మూలించడం" అంటే సమాజాన్ని పాపకార్యాల నుండి రక్షించడం పుణ్యకార్యాలకు ప్రేరేపించడం అని అర్థం. ఇస్లామీయ ఉద్యమం ఈ కార్యానికి ఎంత ప్రాముఖ్యత ఇస్తుందో

వేరే చెప్పనవసరం లేదు. వాస్తవమేమిటంటే సమాజంపై చెడు ప్రభావం ఎంత ఉంటుందో, ఇస్లామీ ఉద్యమ సాఫల్యతకు అవకాశాలు అంతే తగ్గిపోతాయి. మంచిని కాంక్షించే స్వభావం ఎంత పరిఢవిల్లుతుందో ఇస్లామీయ ఉద్యమ సాఫల్యత అంతే సులభతరమవుతుంది. ఈనాడు దేశ నైతిక పరిస్థితి ఎలాగుందో, ఎలా దిగజారిపోతూ ఉందో అందరూ గమనిస్తూనే ఉన్నారు. ఇక్కడి అవివేకులు, అసమర్థ నాయకులు దేశ పునర్నిర్మాణానికి, అభివృద్ధికి ధర్మం నైతికవిలువలకు స్థానం లేకుండా కేవలం భౌతిక దృష్టితో చట్టాలు చేసినారు. ప్రభుత్వ ఖజానాను నింపడానికి సారాయి లాంటి పాపాలపుట్టను బహిరంగంగా అమ్మడానికి, కొనడానికి అవలంబించిన విధానాల ఫలితంగా దేశం పాపపంకిలంలో ఘోరంగా చిక్కుకుంది. మనదేశం కర్మభూమిగా, ఆధ్యాత్మిక సంగమంగా వినుతికెక్కింది. కాని ఈనాడు ఎటుచూసినా మనోవాంఛలు, ప్రాపంచిక వ్యామోహం పెను తుఫానులా ముంచుకొస్తున్నాయి. సజ్జనుల, ధర్మాత్ముల సంతానం, దైవ పరిజ్ఞాన రహితులుగా, ధర్మవ్యతిరేకులుగా మారిపోతున్నారు. భక్తులు, శిష్టుల ఒడిలో నుండి భక్తిని, శిష్టతను అపహాస్యంగా చేసే సంతతి పుట్టుకొని వస్తుంది. ఆధ్యాత్మికత స్థానంలో, భౌతికతత్వం, పరలోక చింతన స్థానంలో ప్రాపంచిక వ్యామోహం తిష్టవేస్తోంది. త్యాగం ఉన్నచోట, స్వార్థ పరత్వం, నిజాయితీ ఉన్నచోట దుర్మార్గం చోటుచేసుకుంటోంది. నిస్వార్థ గుణాన్ని స్వార్థం మింగేస్తోంది. ఆత్మనిగ్రహం, సంయమనాల స్థానాన్ని విషయలోలత్వం, మనోవాంఛలు ఆక్రమిస్తున్నాయి. న్యాయమున్న చోట అన్యాయం రాజ్యమేలుతోంది. వాగ్దాన పాలన జరిగేచోట దగా, మోసం పరిఢవిల్లుతున్నాయి– ఒక్కమాటలో చెప్పాలంటే అన్ని రకాల మేలు అతివేగంగా కీడు కోసం తన స్థానాన్ని ఖాళీ చేస్తూపోతోంది. ఈ దౌర్భాగ్యస్థితి ఇస్లామీయ ఉద్యమానికి ఒక ఛాలెంజ్ అనే చెప్పాలి. దాని నుండి అది ఏ మాత్రమూ తప్పించుకోజాలదు. తప్పించుకుంటే అది స్వయానా కష్టాలను కోరి తెచ్చుకున్నట్లే అవుతుంది. అందువల్లనే దాని ప్రోగ్రాంలో సత్కార్యాలను ప్రేరేపించడం, దుష్కార్యాలను

రూపుమాపడం కూడా చేర్చబడింది. మరియు స్వాభావికంగా అదే సరిఅయినది.

★ ముస్లింల ప్రాణ, ధన రక్షణ ఈనాటి ఎంత ప్రధానమైన జఠిలమైన సమస్యో వేరే చెప్పనవసరం లేదు. భారతదేశం స్వాతంత్ర్యానంతరం నుండీ ముస్లింల కొరకు కష్టాల కొలిమిలా తయారైంది. తరచుగా వారి ప్రాణాలపై, ఆస్తులపై దౌర్జన్యకరమైన హింసాకాండ చెలరేగుతూనే ఉంది. దానికి కారణం ఏమైనప్పటికీ, ధర్మపరంగా వారిని కాపాడటానికి ఇస్లామీయ ఉద్యమం తన శాయశక్తులా కృషి చేస్తుంది.

**ఆచరణాత్మక ప్రణాళిక**

ఈ అతి ముఖ్యమైన సమస్యల పరిష్కారానికి ఇస్లామీయ ఉద్యమం చేస్తున్న ప్రయత్నాలు ఇవి:

"ప్రాథమిక ధార్మిక విద్యా వ్యాప్తి" ఈ సమస్య ఇస్లామీయ ఉద్యమానికి అన్నింటికంటే ప్రధాన సమస్య. దాని పరిష్కారానికి ఈ క్రింది కార్యక్రమాలను అది చేపట్టింది.

1) ఉన్నత పాఠశాల విద్యవరకు సరియైన పాఠ్యప్రణాళిక తయారు చేయడం. సరియైన పాఠ్యప్రణాళిక అంటే పాఠ్యాంశాలను రూపొందించడంలో, విద్యార్జన లక్ష్యాన్ని, విద్యాప్రావీణ్యాన్ని వాస్తవ ఇస్లామీయ దృష్టికోణంతో సంపూర్ణంగా క్షుణ్ణంగా ప్రవేశపెట్టడం. మతాన్ని ప్రపంచం నుండి విడదీసే పాశ్చాత్య విధానాన్ని, ఇస్లామేతర విధానాలను పూర్తిగా త్యజించాలి. చరిత్ర భౌగోళిక శాస్త్రం, సాహిత్యం, సైన్స్, గణితం మొదలైన విషయాలను (వీటిని సాధారణంగా ప్రాపంచికమైనవని ధర్మానికి సంబంధించినవి కావని భావించబడుతుంది). ఖుర్‌ఆన్ ప్రస్తావించిన పునాదులపై ఇస్లాం పరిభాషలో సంకలనం చేయటం. తద్వారా ఈ విషయాలపై విద్యాభ్యాసం విద్యార్థులకు ఇస్లామీయ దృక్పథాన్ని కల్గిస్తాయి. మొత్తానికి ఈ పాఠ్యాంశాల పుస్తకాలు వైజ్ఞానికంగా, ప్రామాణికంగా ఉండాలి మరియు లక్ష్య సాధనకు కూడా ఉపయోగపడాలి. ముస్లిం యువత విద్యా-వైజ్ఞానిక అభిరుచితోపాటు ధృఢమైన దైవ

విశ్వాసం, వ్యక్తిత్వ వికాసం పొందడానికి అనువుగా ఉండాలి. ఇలాంటి పాఠ్యప్రణాళిక మొదటి తరగతి నుండి ఆరవ తరగతి వరకు తయారు చేయబడింది. దేశంలో అనేక పాఠశాలల్లో సంపూర్ణంగానో పాక్షికంగానో బోధించబడుతోంది. ఆపై తరగతులకు పాఠ్యప్రణాళిక తయారు చేయ వలసి ఉంది.

2) ఒక ప్రామాణిక పాఠశాలను నెలకొల్పడం, అందులో పైన పేర్కొన బడినట్లు విద్యాభ్యాసాన్ని ఏర్పాటు చేసి దాని ఒక ఆదర్శ విద్యాలయంగా చూపెట్టడం. ఇలాంటి పాఠశాల నేరుగా ఇస్లామీయ ఉద్యమ ఆధ్వర్యంలో చాలా రోజులుగా నడపబడుతుంది. అంతేకాదు ఇలాంటి పాఠశాలలు వివిధ ప్రాంతాలలో స్థానిక ఉద్యమ విభాగాల ఆధ్వర్యంలో ఇప్పటికీ నడుస్తున్నాయి.

3) ప్రతి పట్టణంలో తమ ధార్మిక పాఠశాలలను స్థాపించి పేర్కొనబడిన పాఠ్యప్రణాళికానుసారం లేదా వారి ఇష్టానుసారం ధార్మిక విద్యాబోధనకు ముస్లింలను ప్రోత్సహించడం. ముస్లిం సమాజం యొక్క ఈ ధార్మిక ఆవశ్యకతను నెరవేర్చటానికి ఉద్యమ కార్యకర్తలు ప్రాంతీయ, రాష్ట్రీయ ఉద్యమ సంఘాలు ప్రజలను నిరంతరం చైతన్య పరుస్తూనే ఉంటాయి. సాధ్యమైనంత మేరకు తమ సహాయ సహకారాలు అందజేస్తాయి. దైవాను గ్రహం వల్ల ఈ ప్రయత్నాలు సఫలీకృతం అవుతున్నాయి. తత్ఫలితంగానే అనేక పాఠశాలలు స్థాపించబడ్డాయి. ఇంకా స్థాపించబడుతున్నాయి.

4) ధార్మిక విద్యా వికాసం కోసం కృషి చేస్తున్న ఇతర సంస్థలతో, ఆ మహత్తర కార్యం సఫలంగా సునాయాసంగా నెరవేర్చడానికి సహకరించడం జరుగుతుంది. ఈ విషయంలో ముఖ్యంగా ఉత్తరప్రదేశ్‌లోని ధార్మిక విద్యా కౌన్సిల్ లేదా ధార్మిక విద్యాసంఘం స్థాపించడంలో ఇస్లామీయ ఉద్యమం సంపూర్ణ సహకారాన్ని అందించింది. ప్రారంభం నుండే అందులో భాగస్వామిగా చేరింది.

5) ప్రభుత్వ పాఠశాలల్లో, కళాశాలల్లో విద్యనభ్యసించే ముస్లిం విద్యార్థుల కోసం ఉద్యమం రాత్రింబవళ్ళు ప్రాథమిక ధార్మిక విద్యాబోధనకు ప్రయత్నం చేస్తుంది. తద్వారా ప్రభుత్వ పాఠశాలల చెడు ప్రభావం నుండి వారిని రక్షించడం జరుగుతుంది.

ప్రభుత్వ నిర్బంధ విద్యావిధానం నుండి ముస్లిం విద్యార్థులను మినహాయించడానికి అది ప్రభుత్వానికి తన వినతి సమర్పిస్తుంది. ఈ విషయంలో ఇతర సంస్థలతో సహకరిస్తుంది. తగిన ప్రామాణిక ఆధారాలతో ఈ కార్యాన్ని అది నిర్వహిస్తుంది. ఈ విషయంలో ఉత్తరప్రదేశ్ విద్యాకౌన్సిల్ ప్లాట్‌ఫాం నుండి కొంతమేరకు సఫలత చేకూరింది. కాబట్టి ఉత్తరప్రదేశ్ రాష్ట్ర విద్యా విభాగం, ధార్మిక విద్యాకౌన్సిల్ ఆధ్వర్యంలో నడుపబడుతున్న పాఠశాల విద్యార్థులకు ప్రైమరీ విద్య పూర్తిచేసిన తర్వాత ప్రవేశ పరీక్షపెట్టి ఉత్తీర్ణులైన వారికి ప్రభుత్వ పాఠశాలల్లో ఆరవ తరగతిలో ప్రవేశమివ్వడానికి అంగీకరించింది. ఆ పాఠశాలలు ప్రభుత్వ గుర్తింపు పొందనప్పటికీ ఆమోద యోగ్యమైనవిగా భావించబడింది. కాని సాధించదలచిన దానికంటే, ఇది చాలా తక్కువ. ఈ విషయంలో ఇంకా ఎంతో చేయవలసి ఉంది. "ప్రభుత్వ పాఠ్యప్రణాళికా సంస్కరణ" సమస్యను పరిష్కరించడానికి, ముస్లిం విద్యార్థులను ప్రభుత్వ నిర్బంధ విద్యావిధానం నుండి మినహాయించడానికి చేపట్టిన విధానమే సరియైనది. కాబట్టి ఈ విషయంలో ప్రామాణిక ఆధారాలతో అది తప్పు అని నిరూపిస్తూ ప్రభుత్వానికి తమ ఆక్షేపణలు-విన్నపాలు తెలియపర్చుతూ ఉద్యమిస్తుంది. ఈ ఉద్యమాన్ని స్వయంగానూ, మరియు ఇతరులతో కలిసి కూడా చేపడుతుంది. ఈ ఉద్యమాన్ని పటిష్టపరచడానికి అది సాక్ష్యాధారాలతో సమంజస విధానాన్ని అవలంబించింది. రాష్ట్రాలలో వ్యాపించివున్న తన ఉద్యమ శాఖలను అచటి ప్రభుత్వ పాఠశాలల్లో బోధించే పుస్తకాలను పరిశీలించి వాటిలో ఉన్న అభ్యంతరకరమైన విషయాలను, బహుదైవారాధన, కాల్పనిక గాథలను, ఇస్లాం మరియు ముస్లింలకు వ్యతిరేకంగా ఉన్న పాఠ్యాంశాలను గుర్తించి నివేదికలు పంపవలసిందిగా ఆదేశించింది. అనేక వ్యయ ప్రయాసలకోర్చి తయారు చేసిన ఆ

నివేదికలను రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాల ముందు, ప్రజాప్రతినిధుల ముందు ప్రవేశపెట్టడం జరిగింది. ఇతర పార్టీలతో కలసి ప్రభుత్వ అధికారులతో సంప్రదించడం జరిగింది. వారి కర్తవ్యాన్ని గుర్తుచేయించి సముచిత చర్య తీసుకోవాలని అభ్యర్థించడం జరిగింది. ఎడతెగకుండా ప్రయత్నాలు చేస్తున్న ప్పటికీ ఇంతవరకు ఎవరూ పట్టించుకోలేదు. అయినా అవి పూర్తిగా విఫలం కాలేదు. అందువల్లనే పార్లమెంటులో హైందవ సభ్యులు ఈ అంశాన్ని పలుమార్లు లేవనెత్తారు. తత్ఫలితంగా కేంద్ర ప్రభుత్వం ఒక ఉన్నతస్థాయి కమిటి ఏర్పాటు చేసి వివిధ రాష్ట్రాలలో బోధించబడే పాఠ్యాంశాలను క్షుణ్ణంగా పరిశీలించి, వాటిని మత రహితంగా సెక్యులర్ విధానాలకు అనుగుణంగా మార్చడానికి నివేదికలు సమర్పించవలసిందని ఆదేశించింది. ఈ కమిటీ చేపట్టిన కార్య క్రమాల గురించి అందిన సమాచారం ప్రకారం, అది నామమాత్రపు కమిటీ కాదు, కార్యాచరణ కమిటీగా నిలుస్తుందనే నమ్మకం కలుగుతుంది. దైవం ఆ నమ్మకాన్ని వమ్ము చేయకుండుగాక.

'ముస్లిం పర్సనల్ లా పరిరక్షణ' దీన్ని ప్రభుత్వ జోక్యాన్నుండి రక్షించు కోడానికి ఇస్లామీయ ఉద్యమం అప్రమత్తంగా వ్యవహరిస్తుంది. ప్రత్యక్షంగానో పరోక్షంగానో 'పర్సనల్ లా'లో జోక్యానికి ప్రభుత్వం ఆరాటపడుతుందనే విషయాన్నే అది గ్రహించిన వెంటనే తన ఆక్షేపణలను తెలుపుతుంది. తన కేంద్ర రాష్ట్ర శాఖల ద్వారా తీర్మానాలు చేసి, తమ అసమ్మతిని ప్రభుత్వానికి తెలియపరుస్తుంది. ఈ ప్రమాదాన్నుండి బయటపడటానికి ముస్లింలందరినీ జాగృతపర్చి, కార్యోన్ముఖులుగా చేస్తుంది. ఈ విషయాలలో భారత రాజ్యాంగంలో ప్రస్తావించబడిన 'దేశానికంతటికీ ఒకే సివిల్ కోడ్' అనే ఆదేశ సూత్రాన్ని తొలగించడం, లేదా దాని నుండి ముస్లింలకు మినహాయింపు ఇవ్వడం ఇస్లామీయ ఉద్యమ అంతిమ లక్ష్యం.

ఈ ప్రయత్నాలు కేవలం ఆక్షేపణలు, అర్జీల వరకే పరిమితం కావు. ప్రామాణిక ఆధారాలతో బలంగా తన విధానాన్ని ప్రకటించడానికి అది ఉద్య మిస్తుంది. ముస్లిం పర్సనల్ లా పూర్తి సమస్యపైనే గాక, పర్సనల్ లా కు

చెందిన ఏఏ అంశాలపై ఇతరులు తీవ్ర ఆక్షేపణలు తెలుపుతున్నారో, రద్దు పరచడానికి కఠిన వైఖరి అవలంబించారో వాటిపై వివరణాత్మక - విజ్ఞాన దాయక పుస్తకాలను ప్రచురించడానికి కృషి చేస్తుంది. వాటి ద్వారా అది ప్రభుత్వానికి "ఈ ఆదేశాలు ధర్మానికి, షరీయత్‌కు సంబంధించినవీ, దానిని మార్చడానికి తొలగించడానికి, స్వయంగా ముస్లింలకు కూడా హక్కులేద"ని తెలియపర్చుతుంది. అంతేకాదు, ఆ ఆదేశాలలో నిగూఢమై ఉన్న విశిష్ఠతలు, ఔచిత్యాలను ప్రామాణిక ఆధారాలతో విశదపరుస్తుంది. తద్వారా మానవ కళ్యాణం ఆ ఆదేశాలను మార్చడంలో కాదు వాటిని సరిగ్గా ఆచరించడంలోనే ఉందని తెలియపర్చుతుంది. (ఈ విషయంపై కొన్నిపుస్తకాలు ప్రచురించబడ్డాయి. ఉదాహరణకు: త అద్దుదె ఇజ్‌దివాజ్, హుఖూఖుజ్జవ్‌జైన్, పరదా, ఔరత్ ఇస్లామీ ముఆషిరేమే. మరికొన్ని ప్రచురణలు ఉన్నాయి).

★ ముస్లింలలో ధార్మిక చైతన్యం కల్పించడానికి ఉద్యమ సర్వయంత్రాంగం పనిచేస్తుంది. దేశమంతటా ప్రాంతీయ, జిల్లా, రాష్ట్రస్థాయిల్లో నిర్వహించే దాని బహిరంగ సభలు, నలువైపులా వ్యాపిస్తున్న దాని సాహిత్యం వివిధ భాషల్లో విస్తృతంగా ప్రచురించబడుతున్న దాని పత్రికలు, దాని కార్యకర్తల దైవసందేశ ప్రచారం, ఇవన్నీ ముస్లింలలో తమ ధర్మం గురించి అవగాహన కల్పించడానికి, ఇస్లాం వారి నుండి కాంక్షించేదేమిటి? అనే విషయాన్ని వారికి విశదీకరిస్తూ, వారి జీవితాలు దైవప్రసన్నతకు అనువైన జీవితాలుగా మార్చడానికి కృషి చేస్తుంది. ఖచ్చితంగా దీనినే ధార్మిక చైతన్యమంటారు. కాబట్టి ఇస్లామీయ ఉద్యమం, ఏ స్థాయిలో ధర్మప్రచార కార్యక్రమం చేపట్టుతుందో ఆ స్థాయిలోనే ముస్లింలలో ధార్మిక చైతన్య కార్యక్రమం కూడా జరుగుతోంది. ఇందులో ఎలాంటి సందేహం లేదు. అంతేకాదు, దీని ప్రాథమిక ధార్మిక విద్యా వికాస కార్యక్రమం కూడా సత్ఫలితాలనిస్తోంది.

'మానవ సేవ' కోసం ఇస్లామీయ ఉద్యమం సామూహికంగా ప్రణాళికా బద్ధంగా చేపట్టే కార్యక్రమం రెండు విధాలుగా ఉంటుంది. మొదటిది: దీర్ఘకాలిక కార్యక్రమాలది. రెండవది: అత్యవసర కార్యక్రమాలది. దీర్ఘకాలిక కార్యక్రమాలలో

ప్రాంతీయ స్థాయి ఉద్యమ సంస్థలు తమ ప్రాంతపు నిరుపేదలకు శక్తిమేరకు సహాయసహకారాలు అందజేస్తాయి. ఇది వారిపై ఉన్న సంస్థాగతమైన బాధ్యత. అత్యవసర సేవా కార్యక్రమం ఆవశ్యకత, సమాజంపై లేదా దేశంపై ఒక పెద్ద విపత్తు వచ్చిపడినప్పుడు ఉంటుంది. ఈ కార్యక్రమం పెద్ద ఎత్తున చేపట్టవలసి వస్తుంది. ఇలాంటి కార్యక్రమాలెన్నో ఉద్యమం చేపట్టింది. ఉదాహరణకు 1948వ సంవత్సరంలో హైదరాబాద్ పోలీస్ యాక్షన్‌లో సర్వస్వాన్ని కోల్పోయిన బాధితులకు, 1961లో జబల్‌పూర్-సాగర్‌బాధితులకు, 1964లో రూర్కెలా, జంషెడ్‌పూర్ మరియు ఇతర ప్రాంత బాధితులకు, 1965లో వరద బాధితులకు, 1966-67లో అనావృష్టికి గురియైన బీహార్, ఉత్తరప్రదేశ్ బాధితులకు, 1967లో పాలస్తీనా నిరాశ్రయులకు, 1969లో గుజరాత్ బాధితులకు అందించిన సహాయ సహకారాలు దాని తాహతుకు మించినవిగానే భావించవచ్చు. ఇక చిన్నాచితకా ప్రమాదాలలో అది అందించిన సహాయ సహకారాలు లెక్కలేనన్ని.

★ 'మతతత్వం-జాత్యోన్మాద సంఘర్షణలను నివారించడానికి ఉద్యమ కార్యా చరణలో ఎల్లప్పుడు ప్రత్యేక స్థానాన్ని కల్పించడం జరిగింది. దేశప్రజలకు ముఖ్యంగా ముస్లింలకు, ఇది మీ పాలిట హాలాహాలం కంటే ప్రమాదకరమని నచ్చజెప్పడానికి ప్రయత్నిస్తుంది. ఇది మీ ధర్మానికి, విశ్వాసానికి నష్టదాయకం, ప్రాపంచిక జీవితానికి మరణ మృదంగం లాంటిది అని తెలియపరుస్తుంది. ముస్లింలను ఈ మారణ కాండ నుండి రక్షించుకోడానికి, చివరకు అసెంబ్లీ సీట్లలో, ప్రభుత్వ ఉద్యోగాలలో తమ వంతు వాటాను పొందడానికి ఆసక్తి చూపకుండా ఉండాలని అది కోరుకుంటుంది. ఎందుకంటే ఈ విషయాలు కూడా జాతి దురభిమానానికి దోహదపడతాయి. దానికి బదులుగా వారు ఒక సైద్ధాంతిక సంస్థగా ఎదిగి అల్లాహ్ ధర్మానికి నిజమైన సాక్షులుగా ఉన్నత స్థానాన్ని అధిరోహించాలి. ఈ కార్యక్రమంలోనే వారి ఇహలోక సాఫల్యం, పరలోక సాఫల్యం ఆధారపడి ఉంది. అంతేకాదు, ఇతరులకు కూడా ఇదే శుభకరమైనది. ఈ సత్యాన్ని వారు ఈనాడు గుర్తించకపోయినా ఒకానొక

సమయంలో దాన్ని తప్పకుండా గుర్తిస్తారు. షరతు ఏమిటంటే, ముస్లిం సమాజం (ఉమ్మతె ముస్లిమా) ఈ దేశంలో నిజమైన ముస్లిం సముదాయంగా బ్రతకడానికి నిర్ణయించుకోవాలి.

★'దుష్కార్యాలను రూపుమాపడం, సత్కార్యాలను స్థాపించడం' అనేది ఒక విస్తృతమైన కార్యం. దేశంలోని సామాజిక వ్యవస్థలో అనేక రుగ్మతలు పాతుకు పోయి ఉన్నాయి. అందువల్ల కేవలం ఒక ఇస్లామీయ ఉద్యమమే వాటన్నింటిని రూపుమాపడం సాధ్యమయ్యే పని కాదు. కాబట్టి అధిక నష్టదాయక మైన రుగ్మతలను కనిపెట్టి వాటిని నిర్మూలించడానికి ప్రయత్నించడమే సరియైన విధానం. కాబట్టి అలాగే చేయడం జరిగింది. అది నిర్మూలించడానికి ఎంచు కున్న రుగ్మతలు ఇవి:

1) మద్యపానం (2) అశ్లీల సాహిత్యం, (3) నాట్యగానాలు.

ఈ రుగ్మతలకు వ్యతిరేకంగా ఇస్లామీయ ఉద్యమం ప్రజాభిప్రాయాన్ని సేకరిస్తుంది. ప్రభుత్వ అధికారుల దృష్టిని వాటిపై మళ్ళిస్తుంది. వాటివల్ల జరిగే నైతిక, సామాజిక అరిష్టాలను హేతుబద్ధ ఉదాహరణలతో చారిత్రక నిరూపణలతో స్పష్టంగా తెలియపరుస్తుంది. తద్వారా ప్రజల అంతరాత్మలు ఈ దుష్కార్యాల వల్ల కలిగే కీడును బాగా గ్రహించి తమ దేశాన్ని, సమాజాన్ని వాటి నుండి పునీతం చేయడానికి కలవరపడి కార్యోన్ముఖులవుతారు.

★ 'ముస్లిం ధన ప్రాణ రక్షణ' సమస్యపై వెంటనే స్పందించవలసి ఉంది. కాని ఇది ఎంతో క్లిష్టతరమైనది. ఎందుకంటే దాని కారణాలను అదుపుచేయడం ప్రస్తుత పరిస్థితుల్లో సాధ్యపడదు. అయినప్పటికీ ఉద్యమానికి తన బాధ్యత నెరవేర్చవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. పరిస్థితులను చూసి నిరాశ చెందక ఒకానొక రోజున ఈ విపత్కర పరిస్థితి తొలగిపోతుందని విశ్వాసముంచాలి. ఇదే విశ్వాసుల నైజం. దీనికోసం సరియైన ప్రయత్నాలు చేయాలి. తగిన ఉపాయాలు ఆలోచించాలి. అందుకోసం ఇస్లామీయ ఉద్యమం అవలంబించిన ఉపాయాలు, ప్రయత్నాలు ఈ విధంగా ఉన్నాయి:

1) హింసాత్మక దాడులు, మత కలహాల వల్ల భవిష్యత్తులో కలిగే కీడును అది దేశ ప్రజలకు తెలియపరుస్తుంది. వాస్తవ పరిస్థితిని వారి దృష్టికి తెచ్చి వారిని అప్రమత్తం చేస్తుంది.

2) అధిక సంఖ్యాక వర్గం నుండి శాంతికాముకులను సమైక్యపరిచి దుష్టశక్తులకు, విచ్ఛిన్నకర శక్తులకు వ్యతిరేకంగా వారిని ఆయత్త పరుస్తుంది. దేశం పట్ల, జాతి పట్ల, మానవుల పట్ల వారు నెరవేర్చవలసిన నైతిక బాధ్యతను వారికి గుర్తుచేస్తుంది.

3) ఈ విషయంలో ప్రభుత్వం మరియు ప్రభుత్వ కార్యనిర్వాహకులపై ఉన్న గురుతర బాధ్యతను తన విజ్ఞతతో గుర్తుచేస్తూ ఉంటుంది.

4) ముస్లింల- ముస్లిమేతరుల మధ్య ఉన్న సంబంధాలను చెడగొట్టడానికి, మత కలహాలకు, మారణకాండకు ప్రేరేపించే అపోహలను, వదంతులను తొలగించడానికి అది ప్రయత్నిస్తుంది.

5) వారిపై దాడి జరిగేటప్పుడు, భయానికి, పిరికితనానికి, చేతకాని తనానికి లోనుకాకుండా పరిస్థితులను ధైర్యంగా ఎదుర్కోవాలని, ఆత్మరక్షణ కొరకు షరీయత్ ఆదేశాల ప్రకారం, నైతికంగా, చట్టపరంగా వ్యతిరేకం కాని అన్ని విధానాలను చేపట్టాలని అది ముస్లింలను కోరుతుంది. ఈ విషయంలో సమాజంలోని ఇతర శాంతికాముకుల సహకారాన్ని కూడా పొందడానికి అది ప్రయత్నిస్తుంది.

6) చివరి ముఖ్య విషయమేమిటంటే అది ముస్లింలను, దైవవిశ్వాసం తమలో పెంపొందించుకోవాలని, ఇస్లాం నైతిక విలువలను అలవర్చుకోవాలని, ఖుర్ఆన్ ఆదేశించినట్లు అల్లాహ్‌తో సంబంధం, అల్లాహ్‌పై విశ్వాసం కలిగి ఉండాలని కోరుకుంటుంది. వారికి ఎదురవుతున్న ఆపదలు, కష్టాలు, అల్లాహ్‌తో, ధర్మంతో దూరమైనందువల్లనే దాపురిస్తున్నాయనే సత్యాన్ని తెలియపర్చుతుంది. వాటి నుండి విముక్తి పొందాలంటే తమ ధర్మానికి చేరువ కావాలనీ, తమ ప్రభువు ఆశ్రయం పొందాలని ప్రబోధిస్తుంది.

**2) ఇతర సమస్యలు**

తక్కువ ప్రాధాన్యత గల ముస్లిం సముదాయిక-దేశ సమస్యల విషయంలో ఇస్లామీయ ఉద్యమం అనేక కారణాలవల్ల తన దృష్టి కేవలం భావోద్వేగాలను తెలుపడం వరకే పరిమితం చేసుకుంది. అవి ఇవి:

1) వ్యక్తి సేచ్ఛా సంబంధమైన సమస్యలు:

ఈ సమస్యలలో విశ్వాసం, అభిప్రాయం, అంతరాత్మ, భావ వ్యక్తీకరణ నమ్మిన సిద్ధాంతాన్ని ప్రచారం చేయడం సభా స్వాతంత్ర్యం, మానవ ప్రాథమిక హక్కుల పరిరక్షణ, ప్రజాస్వామిక విలువల పరిరక్షణ, ప్రగతి, అన్ని రకాల ఏకసత్తాక, నిరంకుశ, నియంతృత్వ పోకడలను అరికట్టడం ముఖ్యమైనవి.

**3) సామాజిక న్యాయంతో ముడిపడి ఉన్న సమస్యలు**

ఈ సమస్యలలో సమాజంలో నిమ్నోన్నతా భేదభావాలు, అంటరానితనం నిర్మూలన, జాత్యాహంకారం, వర్గవైషమ్యాలు, భాషా దురభిమానాన్ని దూరం చేయడం, ఉర్దూ భాషను అభివృద్ధి చేయడం ముఖ్యమైనవి.

**4) నైతిక నిర్మాణానికి సంబంధించిన సమస్యలు**

ఈ సమస్యలంటే నగ్నత్వం, సిగ్గుమాలిన తనం, వ్యభిచారం, లంచ గొండితనం, జూదం, దొంగవ్యాపారం, కృత్రిమ నిల్వలు మొదలైనవి. వీటిని నిర్మూలించి, సమాజ సంస్కరణకు కృషి చేస్తుంది.

5) ధర్మంతో, మానవత్వంతో సంబంధమున్న అంతర్జాతీయ సమస్యలు:

ఉదాహరణకు ప్రపంచ శాంతి సుస్థిరతలు, వ్యక్తుల, జాతుల ప్రాథమిక మానవ హక్కులు. ఇస్లామీయ సోదరభావం యొక్క ఆవశ్యకత, మానవ ప్రాతిపదికపై కనికరం, సానుభూతి మొదలైనవి.

ఈ సమస్యలన్నింటిపై మనోభావాలను ఆలోచనలను వ్యక్తపరచడం అంటే వాటిని గురించి వాస్తవాలను స్పష్టంగా అరమరికలు లేకుండా వ్యక్తపరచడమే. సత్యమైన, న్యాయపరమైన విధానాలను సమర్థించడం, హింసా దౌర్జన్యాలను ఎదురించడం - ఆక్షేపించడం అని అర్థం.

# ఇస్లామీయ ఉద్యమం - దేశ ముస్లిం సమాజ సమస్యల క్రియాత్మక పరిష్కారం

ఇస్లామీయ ఉద్యమం ఈనాడు, ఇక ముందు చేయు ప్రయత్నాల వల్ల దేశానికి ముస్లిం సమాజానికి చెందిన సమస్యలను వాస్తవంగా ఎంత వరకు పరిష్కరించగలదని ప్రశ్నించవచ్చు. దానికి సమాధానం తెలుసుకోడానికిముందు, ఒక దేశానికి, సమాజానికి చెందిన సమస్యలు ఎప్పుడు పరిష్కారమవుతాయి? ఏ విషయాలపై ఈ పరిష్కారం ఆధారపడి ఉంటుందనే దాన్ని ప్రథమంగా తెలుసుకోవాలి. అప్పుడే దేశ సమాజ సమస్యల పరిష్కార విషయంలో ఇస్లామీయ ఉద్యమ విధానమేమిటో అర్థమవుతుంది.

**1) సమస్యలు ఎప్పుడు పరిష్కారమవుతాయి?**

ఒక దేశానికి లేదా జాతికి చెందిన సమస్యల పరిష్కారం మూడు విషయాలపై ఆధారపడి ఉంటుంది.

1) సమాజం– ముఖ్యంగా పలుకుబడి గలవారి నియమబద్ధత, నైతిక ఔన్నత్యం, సత్య నిబద్ధత.

2) రాజకీయ అధికారం

3) నీతిబద్ధమైన, న్యాయబద్ధమైన చట్టాలు.

ఈ మూడు విషయాల ప్రాముఖ్యతలలో హెచ్చుతగ్గులున్నప్పటికీ, అవన్నీ ఆవశ్యకమైనవే. కానీ నియమబద్ధత, సత్యబద్ధత అత్యంత ఆవశ్యకమైనవి.

ఒక మానవ సమూహం వద్ద ఈ విశిష్టమైన సుగుణం ఉన్నదంటే అది తన సమస్యలను అవలీలగా పరిష్కరించుకోడానికి ఆస్కారముంది. తదుపరి రెండు విషయాలు రాజకీయ అధికారం, ప్రమాణబద్ధమైన చట్టాలు లేకున్నా కేవలం ఆ ఒక్క విధానం ద్వారా తమ జీవిత సమస్యలెన్నింటినో పరిష్కరించుకోవచ్చు. ఆ విధానం లేకుంటే మానవ జీవితం సమస్యల వలయంలో చిక్కుకొని ఎన్నడూ సురక్షితంగా ఉండజాలదు. రాజకీయ శక్తి న్యాయబద్ధమైన చట్టాలు కూడా అతని కష్టాలను కడతేర్చలేవు.

రాజకీయ అధికారం ఆవశ్యకత, ప్రాముఖ్యత అందరికీ తెలిసిందే. ఒక జాతి జీవన వ్యవస్థ సంపూర్ణంగా ఈ రాజకీయ శక్తి అధీనంలో ఉంటుంది. అదే దానికోసం చట్టాలు రూపొందిస్తుంది. అదే చట్టాలను అమలుపరుస్తుంది. తమ ఇష్టప్రకారం విద్యావిధానాన్ని రూపొందించి దాని ప్రకారమే యువతీ యువకుల ఆలోచనా విధానాన్ని తీర్చిదిద్దుతుంది. ఇక ఇప్పుడైతే అదే, సత్యం-అసత్యం, మంచీ-చెడు, ధర్మం-అధర్మం నిర్ణయిస్తుంది. కాబట్టి ఒక జాతివద్ద ఈ రాజకీయ అధికార లేదంటే అది తన సమస్యలను పరిష్కరించ డానికి ఒక ముఖ్య ఆధారాన్ని కోల్పోయినట్లే అవుతుంది. కాబట్టి తన సమస్యలను అది సరియైన రీతిలో పరిష్కరించజాలదు.

నీతికి కట్టుబడిన న్యాయబద్ధమైన చట్టాల ఆవశ్యకత, ప్రాముఖ్యత కూడా అందరికీ తెలిసిందే. దేశ రాజ్యాంగం, చట్టాలలో అసమంజసత, కీడు ఉన్నట్లయితే సమాజంలో సుస్థిరత, సమానత్వం, సామరస్యం సాధ్యపడదు. వివిధ సమస్యలలో రుగ్మతలలో అది తప్పనిసరిగా చిక్కుకుంటుంది. ఒకచోట వ్యక్తి స్వాతంత్ర్యం హరించబడుతుంది. అతని వ్యక్తిత్వం అధికార పార్టీ కబంధ హస్తాలలో చిక్కుకొని నలిగిపోతుంది. మరోచోట పార్టీని నిర్వీర్యం చేసి వ్యక్తులు విచ్చలవిడిగా వ్యవహరించడం జరుగుతుంది. ఒకచోట భౌతిక లాలసత్వం ప్రాధాన్యత సంతరించుకుంటుంది. ధార్మిక నైతిక విలువలు తుడిచిపెట్టుకొని పోతాయి. ఒకచోట భౌతిక అవసరాల ఆవశ్యకతను గుర్తించడం జరుగదు. మరోచోట వ్యక్తికి ఎంత వరకు స్వేచ్ఛ ఇవ్వబడుతుందంటే అతను ఎన్ని నేరాలు

చేసినా, ఎన్ని పాపకార్యాలు చేసినా అడ్డూ ఆపూ ఉండదు. మరొకచోట వ్యక్తి స్వేచ్ఛ ఎంతగా అణగద్రొక్కబడుతుందంటే అతడు తన అంతరాత్మ, విశ్వాసం ప్రకారం తన వ్యక్తిగత జీవితాన్ని సహితం గడపలేడు. ప్రపంచ నలువైపులా దృష్టి సారించినట్లయితే ఈ పరిస్థితులన్నీ వాస్తవంగా మనకు కనిపిస్తాయి. ఇలాంటి పరిస్థితి మానవాళికి శ్రేయస్కరమైనది కాదు. అది సమాజానికి న్యాయం- శాంతిని ఎన్నడూ ప్రసాదించలేదు. ప్రసాదించబోదు. ఇది జీవిత సమస్యలను పరిష్కరించడం అటుంచి, కొత్తకొత్త సమస్యలను కొనితెస్తుంది. కాబట్టి మానవాళిని అశాంతి అలజడుల నుంచి రక్షించడానికి సమాజాన్ని ప్రాణాంతకమైన సమస్యల నుండి విముక్తి కల్గించడానికి స్వచ్ఛమైన, న్యాయ బద్ధమైన చట్టాలను ప్రవేశపెట్టడం ఎంతో అవసరం.

## ఉద్యమ కాలంలో సమస్యల పరిష్కారం సాధ్యపడదు

ఈ మూడు విషయాలలో ఏదీ ఉద్యమ అధీనంలో ఉండదు. ఉద్యమాలు సఫలీకృతం కాకముందు వాటివద్ద రాజకీయ ప్రాబల్యముండదు. దేశం కోసం రాజ్యాంగాన్ని చట్టాలను రూపొందించలేదు. అదే విధంగా సమాజంలో చట్ట బద్ధత సత్య నిబద్ధతను సాధించలేదు. దానికి కారణమేమిటంటే ఒక సమాజంలో ఏదైనా ఉద్యమం ఉనికిలోకి వచ్చినప్పుడు రెండు రకాలలో ఏదో ఒక రకానికి అది చెందినదై ఉంటుంది. అది ధార్మిక, నైతిక విలువలను పాటించని ఉద్యమ మైనా అయి ఉంటుంది. లేదా వాటిని పాటించే ఉద్యమమైనా అయివుంటుంది. ఒకవేళ మొదటి రకానికి చెందిన ఉద్యమమై ఉంటే, సమాజంలో ధార్మిక నైతిక విలువలపై ఆధారపడిన జీవన వ్యవస్థ వృద్ధిచెందే ప్రశ్నేలేదు. ఒకవేళ రెండవ రకానికి చెందినదైతే, సమాజంలో చట్టబద్ధత, నైతిక ఔన్నత్యం, సత్య నిబద్ధతలు అడుగంటిపోయి ఉన్నాయని అర్థం. ధార్మిక నైతిక విలువలు పుణికిపుచ్చుకున్న ఉద్యమం లేచిందంటే అక్కడి సమాజంలో ధార్మిక నైతిక విలువలు బలహీనమై జీవితరంగంపై దాని ప్రభావం లేకపోవడమే అని తెలుసు కోవాలి. సమస్యలను పరిష్కరించడానికి ఆవశ్యకమైన పై మూడు అంశాలు ఉద్యమ అధీనంలో లేనప్పటికీ, ప్రతి విప్లవం పై విషయాలను, లేదా తనకు

అవసరమైన విషయాలను పొందడానికి నిరంతరం ప్రయత్నిస్తూనే ఉంటుంది. కాని ఆ అంశాలు దాని అధీనంలో వచ్చే వరకు దానికి వ్యతిరేకంగానే అవి ప్రయోగించబడుతూ ఉంటాయి. ఇదీ వాస్తవ పరిస్థితి. కాబట్టి ఏ ఉద్యమం కూడా దేశ సమాజ సమస్యలను స్వయంగా పరిష్కరించజాలదు. పరిష్కరిస్తుందని భావించడం కూడా సమంజసం కాదు. సమస్యలను పరిష్కరించడానికి ఆవశ్యకమైన విధానాలు దాని అధీనంలో లేనప్పుడు అది ఆ పనిని ఎలా చేయగలదు? ఆ పనిని అది సామూహిక జీవనవ్యవస్థను నడిపే అధికారం తన హస్తగతమైనప్పుడే చేయగలదు. దానికంటే ముందు అది తనకు ఎన్ని విశిష్టతలు, అర్హతలున్నా తన ప్రామాణిక విమర్శల ద్వారా చలామణిలో ఉన్న ప్రభుత్వ వ్యవస్థకు వ్యతిరేకంగా ప్రజాభిప్రాయాన్ని సేకరించి వారిని ప్రత్యర్థులుగా నిలబెట్టడం తప్ప ఏమీ చేయలేదు. లేకుంటే తాను సమంజసమని భావించిన విధానాల యొక్క విశిష్ఠత,ఆవశ్యకతలను వివరించి ప్రజల విశ్వాసాన్ని చూరగొని వారి ద్వారానే ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చి వాటిపై అమలు చేసేటట్లు చేయవచ్చు. అంతేగాని దేశానికి, సమాజానికి చెందిన క్లిష్టసమస్యలను అది స్వయంగా పరిష్కరించజాలదు. ఈ క్లిష్ట సమస్యను పరిష్కరించడం అటుంచి దానికై ప్రయత్నించడం వల్ల అది అనేక జఠిల సమస్యలలో కష్టాలలో చిక్కుకుంటుంది. కమ్యూనిస్టు పార్టీ ఉదాహరణ ప్రపంచం ముందు ఉంది. అది శ్రామికుల సమస్యలను తాను తలచినట్లుగా, ప్రకటించినట్లుగా ఎంతోకాలం పోరాడి జార్ చక్రవర్తి సింహాసనాన్ని కూలద్రోసి, స్వయంగా తన ప్రభుత్వాన్ని ఏర్పరుచుకున్న తర్వాతనే సాధ్యపడింది. అంతకు ముందు ఆ కార్మికులకు ఇవ్వడానికి దానివద్ద ఏమీలేదు.ఏమైనా లభించాయంటే కష్టాలు- భయానక సమస్యలు, కారాగార కఠిన శిక్షలు మాత్రమే. ఇస్లామీయ ఉద్యమాల, ప్రవక్తల సందేశాల గురించి చెప్పాలంటే వారి పూర్తి చరిత్ర యొక్క ఒక్కొక్క పుట ఈ యదార్థాలకు సాక్ష్యంగా నిలిచాయి.

మొత్తానికి ఉద్యమాలు సమస్యలను పరిష్కరించలేవు. కానీ సమస్యల పరిష్కారం కోసం అవి ఉంటాయి.